# ఏమో... అవుతానేమో! -తాన్య హోప్



**'అప్పట్లో ఒకడున్నాడు'తో తెలుగు తెరకు పరిచయమైన తాన్య హోప్ తన మలి చిత్రం 'పటేల్ సర్'లో పవర్‌ఫుల్ పోలీసాఫీసరు పాత్రలో కనిపించింది. అందరి హీరోయిన్ల లాగానే మోడలింగ్ నుంచి వెండితెరకు దిగుమతైన తాన్య తనకు సినిమాల కన్నా రాజకీయాలంటేనే ఎక్కువ ఇష్టం అంటోంది. అవకాశం వస్తే రాజకీయనాయకురాలిగా తన సత్తా చూపిస్తానంటున్న తాన్యతో....**

**రెండవ సినిమాలోనే అంత పవర్‌ఫుల్ పాత్రలో కనిపించాలంటే భయం వేయలేదా?**

ముందు కొద్దిగా భయం అనిపించింది. షూటింగ్ మొదలైన రెండు మూడు రోజుల తరువాత భయం ఎగిరిపోయింది. జగపతిబాబుగారిని చూసి చాలా నేర్చుకున్నాను.

**మామూలుగా సినిమాలో హీరోయిన్‌కి ఒక్క పాటన్నా ఉంటుంది. 'పటేల్ సర్'లో పాటలు లేవు కదా! లోటుగా అనిపించలేదా?**

ఈ సినిమాలో పాటలకి పెద్దగా అవకాశం ఉండదు. ముఖ్యంగా నా పాత్రకి. ఈ విషయాన్ని దర్శకులు ముందుగానే చెప్పారు. ఎంతసేపూ హంతకుడి చుట్టూ తిరిగేపాత్రకి పాటలేముంటాయి? పాటలు హీరోయిన్ని గ్లామర్‌గా చూపించడానికే తప్ప వాటితో పెద్దగా ఉపయోగం ఉండదు. ఈ సినిమాలో నన్ను అందంగానే చూపించారు.

**మీకు రాజకీయాలంటే ఆసక్తి కదా... భవిష్యత్తులో రాజకీయాల్లోకి ప్రవేశించే అవకాశం ఉందా?**

నేను పొలిటికల్ సైన్స్ గ్రాడ్యుయేట్‌ని. దాంతో సహజంగానే రాజకీయాలంటే ఆసక్తి ఏర్పడింది. ఇక రాజకీయాల్లోకి రావడం అంటారా? అవకాశం వస్తే తప్పకుండా వెడతానేమో! ఇప్పుడే చెప్పలేను.

**సినిమాల్లోకి రావాలని ఎలా అనిపించింది?**

చదువుకునే రోజుల్లోనే మోడలింగ్ అంటే ఇష్టం ఏర్పడింది. మోడలింగ్‌లో ట్రైనింగ్ కోసం పూణె వచ్చాను. అక్కడ శిక్షణ పూర్తికాగానే మోడలింగ్‌లో అవకాశాలు రావడం మొదలయ్యాయి. అయితే మోడలింగ్‌లో ఎక్కువ కాలం ఉండే అవకాశం రాలేదు. మోడల్‌గా కెరీర్ ప్రారంభించిన రెండు మూడునెలల్లోనే సినిమాల్లో అవకాశం వచ్చింది. 2015లో 'మిస్ పూణె' టైటిల్ గెలుచుకున్న తరువాత 'అప్పట్లో ఒకడున్నాడు' సినిమాలో ఛాన్స్ వచ్చింది. తెలుగులో నా మొదటి సినిమాకే మంచి ఆదరణ లభించింది. దాంతో నామీద నాకు నమ్మకం కలిగింది. నటిగా నిలదొక్కుకోగలను అన్న నమ్మకం కలిగింది. వరుసపెట్టి సినిమాలు చేయాలని డిసైడ్ అయ్యాను. నా నిర్ణయానికి మా కుటుంబం నుంచి మంచి సపోర్ట్ లభించింది.



**నటనలో శిక్షణ తీసుకున్నారా?**

మిస్ పూణె కాంపిటీషన్‌ తరువాత ముంబయి వచ్చి నటన కోసం నిర్వహించే వర్క్‌షాపులో శిక్షణ తీసుకున్నాను. ఆ తరువాతే నా మొదటి సినిమా ఆడిషన్‌కి వెళ్లాను.

**మీ మొదటి సినిమాకీ, మలి సినిమాకీ చాలా గ్యాప్ వచ్చినట్టుంది?**

మధ్యలో చాలామంది అడిగారు. కానీ నాకే కథలు నచ్చక చేయలేదు. 'పటేల్ సర్' కథ విన్న వెంటనే ఓకే చెప్పాను. ఈ సినిమాకి వస్తున్న ఆదరణ చూస్తుంటే మంచి కథ కోసం ఆగి నేను తప్పు చేయలేదు అనిపించింది. ఇక ముందు కూడా కథకీ, నా పాత్రకీ ప్రాధాన్యం ఇస్తాను. ఇది చాలామంది చెబుతుండవచ్చు. నేను మాత్రం ఆచరించి చూపిస్తాను.

**పోలీసాఫీసరు పాత్ర కోసం హోంవర్క్ చేశారా?**

'జనతా గ్యారేజ్' సినిమాలో ఎన్టీఆర్ పాత్రను పరిశీలించమని డైరెక్టర్ చెప్పారు. ఆ సినిమాను చాలా సార్లు చూశాను. సెట్‌కి వచ్చిన తరువాత డైరెక్టర్ గారు ఏం చెబితే అదే చేశాను.

**తెలుగులో సినిమాలు అంగీకరించారా?**

తెలుగులో కథలయితే వింటున్నాను కానీ, ఇంత వరకూ వేటికీ ఓకే చెప్పలేదు. కన్నడంలో ఓ సినిమా అంగీకరించాను. తమిళంలో కూడా ఓ సినిమా చేయడానికి ఒప్పుకున్నాను.

**ఎలాంటి సినిమాలు చేయాలనుకుంటున్నారు?**

ఇప్పటివరకూ ఏమీ అనుకోలేదు. భవిష్యత్తులో అనిపిస్తుందేమో చెప్పలేను.

—బికె

## సరదాగా....

### ఐడియా

ఒకరోజు రంజని డాక్టర్ దగ్గరకు వెళ్ళింది. ఆమె కళ్ళకింద నల్లటి చారలతో, చెంపలు బూరెల్లా ఉబ్బి వున్నాయి. డాక్టర్ ఆమెని చూసి, "ఏమైంది? మీరు ఎందుకు అలా ఉన్నారు?" అని అడిగాడు.

**రంజని:** డాక్టర్‌గారూ, నా భర్త రోజూ తాగొచ్చి నన్ను కొట్టడం మొదలుపెడతాడండి. దాంతో రానురానూ నా ఆరోగ్యం దెబ్బతింటోంది. మీరే ఏదైనా చేయండి, ప్లీజ్!

**డాక్టర్:** ఓస్...అంతేనా....దానికి నా దగ్గర బ్రహ్మాండమైన చికిత్స ఉంది. నీ భర్త తాగి ఇంటికి రాగానే నువ్వు గోరు వెచ్చని నీటిలో కొంచెం ఉప్పు కలుపుకుని పుక్కిలిస్తూ ఉండు.

రెండు వారాల తరువాత డాక్టర్ దగ్గరకి వెళ్ళిన రంజని ఎంతో ఆరోగ్యంగా, ఉత్సాహంగా ఉన్నట్టు కనిపించింది డాక్టర్‌కి.

**రంజని:** డాక్టర్‌గారూ... మీరు నిజంగానే బ్రహ్మాండమైన ఐడియా చెప్పారు. ఇప్పుడు నా భర్త తాగి ఇంటికి రాగానే నేను పుక్కిలించడం చూసి ఆయనసలు నావంక కన్నెత్తి కూడా చూడటం లేదు. కనీసం ముట్టుకోవడం కూడా లేదు.

**డాక్టర్:** చూశావా... నోరును అదుపులో ఉంచుకుంటే ఎన్ని ప్రయోజనాలున్నాయో!

### ఒక ప్రశ్న?

శ్యామ్, రఘు, శ్రీకాంత్, హరీష్ నలుగురూ మంచి స్నేహితులు. ఒకే ఊరివాళ్ళు. ఒకే స్కూలు, ఒకే కాలేజ్‌లో చదువుకున్నారు. ఒకే కంచం ఒకే మంచం అన్నట్టుగా ఉండేవారు. కానీ ఉద్యోగరీత్యా నలుగురూ నాలుగు ప్రాంతాలకు చేరారు. పెళ్ళి, పిల్లలూ అంటూ సంసార బాధ్యతలతో సతమతమవుతూ, ఉద్యోగ బాధ్యతలలో తలమునకలై చాలా కాలం వరకు కలుసుకోలేకపోయారు. ఫోన్లో టచ్‌లో ఉన్నా, వివరాలు తెలుస్తున్నా వారికి మాత్రం సంతృప్తి ఉండేది కాదు. ఎలాగో తీరిక చేసుకుని నలుగురూ కలుసుకోవాలనుకున్నారు. ప్లాన్ చేసుకుని, నలుగురూ సెలవు పెట్టుకుని తమ సొంత ఊళ్ళో దిగారు. అలాగే రెండురోజులు ఉండేటట్టుగా రెండు రెండు సూట్‌లను సూట్‌కేసుల్లో సర్దేసుకుని పట్టుకొచ్చేశారు. అవి నలుపు, గోధుమ, గులాబీ, తెలుపు రంగుల సూట్లు. అయితే ప్రశ్న ఏమిటంటే కింద ఇచ్చిన సూచనల ఆధారంగా ఎవరి దగ్గర ఏయే రంగు సూట్లు ఉన్నాయో కనుక్కోవటమే. ప్రయత్నించండి మరి.

1. మొత్తం 8 సూట్‌లు. 4 రంగుల్లో ఉన్నాయి. అంటే ఒక్కో రంగులో రెండు సూట్‌లు ఉన్నాయి.
2. ఒకే రంగు సూట్‌లు ఏ ఒక్కరి దగ్గరా లేవు.
3. శ్యామ్‌కి తెలుపు సూట్ లేదు.
4. హరీష్ దగ్గర నలుపు సూట్ లేదు. కానీ గోధుమరంగు సూట్ ఉంది.
5. నలుగురిలో ఒకరికి తెలుపు, గులాబీ రంగుల్లో ఉన్న సూట్‌లు ఉన్నాయి. ఇంకొకరి దగ్గర గోధుమ రంగు, గులాబీరంగు సూట్లు ఉన్నాయి.
6. రఘుకి తెలుపు సూట్ ఉంది.
7. శ్రీకాంత్‌కి గులాబీరంగు సూట్ ఉంది కానీ గోధుమరంగు సూట్ లేదు.













8

## 'చిత్ర'మైన థియేటర్లు

**సినిమా థియేటర్ల రూపురేఖలు మారిపోయాయి. వాటి హంగు ఆర్భాటం చూస్తే నోరెళ్ళబెట్టాల్సిందే. టబ్‌లో స్నానం చేస్తూ బీర్ తాగుతూ సిన్మా చూసే థియేటర్లు, ప్రియురాలితో పడుకుని సినిమా చూసే థియేటర్లు, ఆర్ట్‌హౌస్ థియేటర్లు, లైట్‌హౌస్ థియేటర్లు ఎన్నెన్నో...!**

**38**

### జంతువుల ద్వీపాలు

అడవులు అంతరించిపోయాయి. అందుకే జంతువులకోసం ప్రత్యేకంగా ద్వీపాలు వెలిశాయి. గుర్రాలు, పిల్లులు, పాములు, మొసళ్ళు ఇలా ఎన్నో జంతువులకు ద్వీపాలున్నాయి.

**70**

### ఇంటర్వ్యూ

దక్షిణాదిన ఉన్న మంచి ప్రతినాయకులలో ఆదిత్యమీనన్ ఒకరు. రంగస్థల నటుడుగా, టీవీ ఆర్టిస్టుగా, వెండితెరపై విలన్‌గా ఆయన ప్రస్థానం...

## సీరియల్స్



## కథలు



## ఫీచర్స్



ముఖచిత్రం: తాన్య హోప్


**రచనలు, కథలు పంపవలసిన చిరునామా**

నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్33. email: navyaweekly@andhrajyothy.com





### ఎవరు?

ఏడుపుగొంతుతో నీరసంగా ఫోన్లో మాట్లాడాడు రవి. భార్యకు మొరపెట్టుకున్నాడిలా.

"అసలు ఏం జరిగిందంటే బేబీ...పద్మని కలవడానికి నేను కార్లో కోనసీమకు వెళ్తున్నాను. వెళ్తోంటే... కారుకి కుక్క అడ్డం వచ్చింది. దానిని కాపాడేందుకు కారుని ఎడమవైపుకి టర్న్ చేశాను. స్పీడుగా వస్తున్నానేమో! కారుని టర్న్ చెయ్యడం నావల్ల కాలేదు. కారు ఎటుపడితే అటు టర్నయి దగ్గరగా ఉన్న కొండ నెక్కేసింది. ఎక్కి అక్కడ ఆగింది. దానిని బ్యాక్ చేసి కిందకి దించడం అసాధ్యం. వేల అడుగుల ఎత్తున ఉంది కారు. కిందికి చూస్తే భయం వేసింది. అయినా నన్ను నేను కాపాడుకోవాలిగా...జాగ్రత్తగా కారులోంచి బయటపడ్డాను. కిందికి జాగ్రత్తగా దిగుతోంటే కాలు జారింది. అంతే! దొర్లుకొంటూ కిందపడ్డాను. నా కాలు విరిగిపోయింది. నా దవడ ఎముక పగిలిపోయింది. తలకి పెద్దగాయం అయింది. ఇప్పుడు ఆసుపత్రిలో ఉన్నాను.

అటునుంచి ఎలాంటి సమాధానమూ లేదు. నిశ్శబ్దంగా ఉంది కాసేపు. తర్వాత అతన్ని అడిగిందిలా భార్య.

"ఇంతకీ పద్మ ఎవరు?"

### చంపుతాను

ఆమె గొప్ప అందగత్తె. ఆ అందానికే పడిపోయాడతను. ఇద్దరూ పెళ్ళి చేసుకున్నారు. కొన్నాళ్లు హాయిగా గడిచాయి. ఇంకొన్నాళ్ళకు ఆమె అంటే అతనికి మోజు తీరిపోయింది. వేరే అమ్మాయి ప్రేమలో పడ్డాడతను. ప్రేమలోనే కాదు, ఆ అమ్మాయితో బెడ్ మీద కూడా పడ్డాడు. చూసిందామె. తట్టుకోలేకపోయింది. అతన్ని చంపాలనుకుంది. రివాల్వర్ కొన్నది. ఇంటి కొచ్చింది. బెడ్‌మీద అమ్మాయితో ఉన్న అతన్ని చూసింది. కోపంతో రగిలిపోతూ రివాల్వర్‌తో తనని తానే కాల్చుకునేందుకు ప్రయత్నించింది. అతడది చూశాడు. ఒకే ఒక గెంతుతో ఆమె ముందు వాలాడు.

"వద్దు! కాల్చుకోవద్దు! నువ్వు లేకపోతే నేను బతకలేను." అన్నాడు.

"నిన్నేమీ నేను వదలిపెట్టను, ముందు నేను చచ్చి, తర్వాత నిన్ను చంపుతాను." అన్నదామె.

అందగత్తెలకు బుర్ర ఉండదన్నది ఋజువు చేశావు అనుకున్నాడతను. సన్నగా నవ్వుకున్నాడు.

### జబ్బు

డాక్టర్: అయ్యో! మీ జబ్బు వంశపారంపర్యంగా వస్తోంది. ఆపరేషన్ చేస్తే పోతుంది."

"అయితే ఆ ఆపరేషనేదో మా తాతగారికి చెయ్యండి."

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 14 సంచిక: 22

2-8-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ

# మొదటి పేజి

## వరాలకొండ

ఇది ఆనోటా ఈనోటా విన్న మాట. నా నోట మీకు వినిపిస్తున్నాను. అగ్రహారానికి ఆమడదూరంలో వరాలకొండ అని ఓ కొండ ఉంది. ఆ కొండకొమ్మున ఓ చిన్న గుహ ఉంది. ఆ గుహలో ఓ శివలింగం ఉంది. ఆ లింగం స్వయంభువు. అది 'చెంబుడు నీళ్ళు పొయ్యండి! కోరింది చేదుకోండి' అంటూ అందరినీ పిలుస్తోంది. ఆ పిలుపు అందుకున్నవారు చెంబుతో నీళ్ళు తీసుకుని వెళ్ళి, లింగాన్ని అభిషేకించి, కావాల్సింది కోరుకుంటున్నారు. కోరుకున్నది కొరతలేకుండా తీరుతోందట! అంతా ముక్తకంఠంతో చెప్పుకుంటున్నారు. దాంతో జనం వేలంవెర్రిగా తరలి వస్తున్నారు. కొండ ఎక్కి, దిగడానికి రెండుమూడు గంటలు పడుతుంది. ఆ రెండుమూడుగంటలూ సందర్శకులకు తోడుగా వచ్చినవారు, తమవల్ల కాదనో, ఇష్టం లేకనో కొండదిగువన ఉండిపోతే, వారి కాలక్షేపం కోసం పుస్తకాలిచ్చి చదువుకోండంటూ రామలింగం రంగప్రవేశం చేశాడప్పుడు. చరిత్ర, సాహిత్యం, ఆత్మకథలూ, జీవితచరిత్రలూ, పండగలూ, ఆచారసంప్రదాయాలకు సంబంధించి అనేక పుస్తకాలు ఇటు తెలుగు, అటు ఇంగ్లీషులో ఏది కావాలంటే అది ఇచ్చి, చదివి, జాగ్రత్తగా అందజేయమని చెప్పడం అలవాటు చేసుకున్నాడతను. ఆఖరికి అదేపనిగా పెట్టుకున్నాడు. తొలిరోజుల్లో అద్దెకు అనుకుని అర్థా, రూపాయీ ఎవరైనా అందజేస్తే వద్దనేవాడు రామలింగం. తర్వాత తర్వాత ఇచ్చింది తీసుకుని, ఆ సొమ్ముతో కొత్తపుస్తకాలు కొనుగోలు చేయడం ప్రారంభించాడు.

ఒకప్పుడు పదుల్లో పుస్తకాలను సంచుల్లో పెట్టుకుని మోసుకొచ్చి అందించేవాడు రామలింగం. ఇప్పుడు వందల్లో అంటే కష్టం కాబట్టి ఓ చక్కని ఆలోచన చేశాడతను. మూతలుసహా పెద్దసైజు మట్టికుండల్ని కొనుగోలు చేశాడు. ఆ కుండల్లో రకరకాల పుస్తకాలు ఉంచాడు. వాటిని ఉట్టిల్లో పెట్టి, ఆ ఉట్టిల్ని చెట్లకు వేలాడదీశాడు. కావాల్సినవారు ఉట్టిమీది కుండలోని పుస్తకం తీసుకుని చదవడం, చదవడం అయిపోయాక ఆ పుస్తకాన్ని యథాస్థానంలో ఉంచడాన్ని నేర్పాడు. కొన్నాళ్ళు చెట్టుకో ఉట్టి వేలాడేది. తర్వాత కొమ్మకో ఉట్టి వేలాడసాగింది. వరాలకొండతోపాటు ఉట్టిసాహిత్యం బాగా పేరుమోయడంతో కొండమీద దేవుడికి చెంబుడునీళ్ళుసహా కొండదిగువ చెట్టుకి ఓ ఉట్టి, ఓ కుండ, ఆ కుండనిండుగా పుస్తకాలివ్వడం ప్రజలకు పరిపాటి అయింది. దాంతో ఇప్పుడు ఓ కొమ్మకు నాలుగైదు ఉట్టిలు వేలాడుతూ కనిపిస్తున్నాయి.

అగ్రహారం, దానికి ఆమడదూరంలో వరాలకొండ, కొండకొమ్మున గుహ, అందులో శివలింగం, కొండదిగువున ఉట్టిసాహిత్యం ప్రజాదరణ పొందడంతో ఆ ప్రాంతాన్ని మరింత అభివృద్ధి చేసేందుకు రాష్ట్రపర్యాటకశాఖ ముందుకు వచ్చింది. గాలివానకి కుండలు



పగిలి, పుస్తకాలు పాడవడంతో, కుండల్లో పుస్తకాలు వద్దంటూ చేతికివ్వండని చిన్నా పెద్దా అయిదారు గ్రంథాలయాలు నెలకొల్పిందక్కడ. అయినా ఉట్టికట్టడంలోనే ఆనందం ఉందంటూ పర్యాటకులు అదే సంప్రదాయాన్ని కొనసాగిస్తున్నారు. కొమ్మకొమ్మకో సన్నాయిలా కొమ్మకొమ్మకో ఉట్టి కడుతున్నారు. వాటిని అక్కణ్ణుంచి తొలగించి, గ్రంథాలయాల్లో భద్రపరచడం ప్రభుత్వం పనైందీవేళ. ఇదంతా బాగానే ఉంది. అసలు ఈ రామలింగం ఎవరు? అతనికి పుస్తకాలపై ఎందుకింత ఆసక్తి కలిగింది. ఈ సరదా ఏమిటంటే...దాని వెనుక చాలా కథలు ప్రచారంలో ఉన్నాయి.

అగ్రహారంలో అందరూ చదువుకున్నవారే! ఆమడదూరంలోని వరాలకొండ దిగువునే చదువులేనివారు అధికంగా ఉన్నారు. పైగా వారంతా మూఢనమ్మకాల్లో మునిగి తేలుతున్నారు. ఆ సంగతి తెలిసి రామలింగం తండ్రి పేర్రాజు గారు తట్టుకోలేకపోయారట! బాధపడుతూ కూర్చునేవారట! తండ్రిబాధను చూసి రామలింగం విలవిల్లాడిపోయి, వివరాలు కనుక్కున్నాట్ట! కనుక్కుని, తాను వారందరినీ చదువరులను చేస్తానన్నాట్ట! అన్నట్టుగానే కొండదిగువన ఉన్నవారికి ఈరకంగా ప్రేరణ కలిగించాడంటూ ఓ కథ ప్రచారంలో ఉంటే మరో కథ మరోలా వినవస్తోంది. రామలింగం తల్లిగారికి తెగ పుస్తకాల పిచ్చిట! కనిపించిన ప్రతి పుస్తకాన్నీ ఆమె చదివేదట! పట్నంలోని పుట్టింటికి ఎప్పుడు వెళ్ళినా పెట్టెలనిండా పుస్తకాలనే తెచ్చుకునేదట! తల్లిదండ్రులూ, అన్నదమ్ములూ చీరలూ, నగలూ కాదు, పుస్తకాల్నే ఆమెకు కొని ఇచ్చి పొంగిపోయేవారట! అంత్యకాలంలో కూడా ఆమె పుస్తకం చదువుతూనే పోయిందట! తల్లి అంటే రామలింగానికి చెప్పలేనంత అనురాగంట! ఆమె గుర్తుగా అతగాడు ఇదంతా చేశాడంటారు ఇంకొందరు. ఏది ఏమైనా వరాలకొండ పర్యాటకాన్నీ, రామలింగం పఠనాసక్తినీ పెంచి చరిత్రలో నిలిచిపోయారు, చాలదూ?!

నవ్య

# శుభవేళ

**బుధవారం: 26 జూలై 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: తదియ ఉ. 8.09 తదుపరి చవితి
నక్షత్రం: పుబ్బ తె. 4.23 తదుపరి ఉత్తర
వర్జ్యం: మ. 12.42 నుంచి 2.16 వరకు
దుర్ముహూర్తం: ఉ. 11.57 నుంచి 12.48 వరకు
అమృతఘడియలు: రా. 10.07 నుంచి 11.41 వరకు
రాహుకాలం: మ. 12.00 నుంచి 1.30 వరకు
సూర్యోదయం: 5.57
సూర్యాస్తమయం: 6.48

**గురువారం: 27 జూలై 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: చవితి ఉ. 7.01 తదుపరి పంచమి
నక్షత్రం: ఉత్తర తె. 4.40 తదుపరి హస్త
వర్జ్యం: ఉ. 11.40 నుంచి 1.17 వరకు
దుర్ముహూర్తం: ఉ. 10.14 నుంచి 11.05 వరకు, మ. 3.22 నుంచి 4.13 వరకు
అమృతఘడియలు: రా. 9.23 నుంచి 11.00 వరకు
రాహుకాలం: మ. 1.30 నుంచి 3.00 వరకు
సూర్యోదయం: 5.57
సూర్యాస్తమయం: 6.47

**శుక్రవారం: 28 జూలై 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: పంచమి ఉ. 6.39 తదుపరి షష్ఠి
నక్షత్రం: హస్త తె. 5.40 తదుపరి చిత్త
వర్జ్యం: మ. 1.25 నుంచి 3.05 వరకు
దుర్ముహూర్తం: ఉ. 8.31 నుంచి 9.23 వరకు, మ. 12.48 నుంచి 1.39 వరకు
అమృతఘడియలు: రా. 11.25 నుంచి 1.05 వరకు
రాహుకాలం: ఉ. 10.30 నుంచి 12.00 వరకు
సూర్యోదయం: 5.57
సూర్యాస్తమయం: 6.47

**శనివారం: 29 జూలై 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: షష్ఠి ఉ. 7.01 తదుపరి సప్తమి
నక్షత్రం: చిత్త పూర్తి
వర్జ్యం: మ. 2.14 నుంచి 3.57 వరకు
దుర్ముహూర్తం: ఉ. 5.58 నుంచి 6.49 వరకు
అమృతఘడియలు: రా. 12.31 నుంచి 2.14 వరకు
రాహుకాలం: ఉ. 9.00 నుంచి 10.30 వరకు
సూర్యోదయం: 5.58
సూర్యాస్తమయం: 6.47

**ఆదివారం: 30 జూలై 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: సప్తమి ఉ. 8.07 తదుపరి అష్టమి
నక్షత్రం: చిత్త ఉ. 7.23 తదుపరి స్వాతి
వర్జ్యం: మ. 1.31 నుంచి 3.16 వరకు
దుర్ముహూర్తం: సా. 5.04 నుంచి 5.55 వరకు
అమృతఘడియలు: రా. 12.01 నుంచి 1.46 వరకు
రాహుకాలం: సా. 4.30 నుంచి 6.00 వరకు
సూర్యోదయం: 5.58
సూర్యాస్తమయం: 6.46

**సోమవారం: 31 జూలై 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: అష్టమి ఉ. 9.47 తదుపరి నవమి
నక్షత్రం: స్వాతి ఉ. 9.40 తదుపరి విశాఖ
వర్జ్యం: మ. 3.54 నుంచి 5.41 వరకు
దుర్ముహూర్తం: మ. 12.48 నుంచి 1.39 వరకు, మ. 3.21 నుంచి 4.12 వరకు
అమృతఘడియలు: రా. 2.34 నుంచి 4.21 వరకు
రాహుకాలం: ఉ. 7.30 నుంచి 9.00 వరకు
సూర్యోదయం: 5.58
సూర్యాస్తమయం: 6.46

**మంగళవారం: 1 ఆగస్టు 2017**

శ్రీహేవళంబినామ సంవత్సరం, దక్షిణాయనం, వర్షరుతువు, శ్రావణమాసం, శుక్లపక్షం
తిథి: నవమి ఉ. 11.54 తదుపరి దశమి
నక్షత్రం: విశాఖ మ. 12.21 తదుపరి అనూరాధ
వర్జ్యం: సా. 4.50 నుంచి 6.38 వరకు
దుర్ముహూర్తం: ఉ. 8.32 నుంచి 9.23 వరకు, రా. 10.26 నుంచి 11.09 వరకు
అమృతఘడియలు: తె. 3.37 నుంచి 5.24 వరకు
రాహుకాలం: మ. 3.00 నుంచి 4.30 వరకు
సూర్యోదయం: 5.59
సూర్యాస్తమయం: 6.46

# మెయిల్ బాక్స్

### ఆ పనితనం ప్రశంసనీయం

జూలై 12 సంచిక మార్నింగ్ కాఫీలో డాక్టర్ ఝలక్ అదిరింది. పెద్దలందరినీ పులులు చేసిన ఘనత సాధించిన నకాసిబ్రహ్మం పనితనం ప్రశంసనీయం. 'పిల్లలకు ప్రత్యేకం' శీర్షిక ప్రారంభం కావడం హర్షణీయం. సురభిలో బుల్లినిఘంటువు భలే గమ్మత్తుగా ఉంది. శారదాఅశోక్‌వర్ధన్‌గారి శతమానంభవతి కథ బాగుంది. నిధి సీరియల్ చారిత్రక నేపథ్యంలో ఉత్కంఠ పెంచుతూ విభిన్నరీతిలో కొనసాగుతోంది. పినిశెట్టి, చంద్ర, బాలి చిత్రాలు సజీవంగా ఉంటున్నాయి.

—నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

### అలరించిన సీరియల్స్, కథలు

కొత్త సీరియల్స్ రెండూ ఆసక్తి కలిగించాయి. ఘటన, ఎదలోతుల్లో, దర్పణం కథలు మూడూ మనిషి దృక్పథంలో మార్పును, సమాజానికి సందేశాన్ని అందించాయి. ఆరోగ్యసూత్రాలు పాటించదగినవి. హైతి దేశంలో మందులు బుట్టల్లో అమ్మడం, డ్యుమాస్ బీచ్‌లో దయ్యాల సంచారం ఆశ్చర్యపరిచాయి. తారల చిత్రాలు, ఇంటర్వ్యూలు అలరించాయి. కె.ఆర్.విజయ సినీ అనుభవాలు ఆకట్టుకున్నాయి.

—తాళాబత్తుల సత్యనారాయణమూర్తి, విశాఖపట్నం

### పోటాపోటీ సీరియల్స్

నవ్య వీక్లీలో సీరియల్స్ ఒకదానికి ఒకటి పోటీగా సస్పెన్సుగా నడుస్తున్నాయి. ప్రభాకర్‌జైని గారి లాకర్ నెంబర్ 369 చాలా సస్పెన్స్‌తో క్రైమ్‌లో ఎన్ని విధాల పరిశోధనలుంటాయో చాలా గొప్పగా చెబుతున్నారు.

వారు రచించిన సినీవాలి సీరియల్ చాలా అద్భుతమైనది. చిత్రసీమలో మాకు తెలియని చాలా విషయాలు తెలియజేశారు. నవల కొని తెచ్చుకునేదాకా మా మనసు ఆగలేదు.

—కొప్పుల ప్రకాశం, హైదరాబాద్—36

### హరివంశం ఉన్నతం

అరణిగారి హరివంశం సాధారణ శైలిలో ఉన్నతంగా నడుస్తోంది. రివ్యూ బాగుంది. కరుణానిధి తనయుడు స్టాలిన్ ఏకాకి అవుతారు. మౌనం వ్యక్తి పరిపూర్ణత్వానికి పనికొస్తుంది.

—వాస్తురామచంద్ర, నెల్లూరు

### హృదయాన్ని తాకిన మార్నింగ్ కాఫీ

మార్నింగ్ కాఫీలో కమీషన్, అతితెలివి లోని వాక్చాతుర్యం, సందర్భోచిత సంభాషణ పాఠకుల హృదయాలకు చేరువయ్యాయి. చాక్లెట్ తీపికబుర్లు ఆనందింపజేశాయి. మైత్రీబంధం కథలో, మానవ సంబంధాలు స్నేహితుల మనసులను ఎలా పెనవేసుకుపోతాయో హృద్యంగా చెప్పారు. విజయవిలాసం గుర్తుంచుకోదగినది.

—డాక్టర్ శివభూషణం, కర్నూలు

### నవ్విస్తున్నాయి

దిశాపటానీ ఇంటర్వ్యూ బాగుంది. సరదాగా, తీన్మార్ నవ్వించాయి. మార్నింగ్‌కాఫీ స్కిట్లు విభిన్నంగా నవ్విస్తున్నాయి. మొదటిపేజీ 'పులి', చాక్లెట్ పూర్వచరిత్ర, గురుపౌర్ణమి విశిష్టత బాగున్నాయి. హరివంశంలో శ్రీకృష్ణలీలలు కొత్తగా ఉండి ఆకట్టుకున్నాయి. ఆబోతుల వీరంగం రంజింపజేసింది.

పిల్లల కథ రంజింపజేసింది.

—మాధవరపు కృష్ణ, కాకినాడ

శరీరంపై ఎర్రని మచ్చలు, దానిపైన తెల్లని పొలుసులు ఏర్పడి తీవ్రమైన మానసిక, శారీరక ఆందోళనకు గురిచేసే సొరియాసిస్ అనేది ఆటో ఇమ్యూన్ చర్మ వ్యాధి. శరీరంలో ఒక భాగమని కాక శరీరమంతా వ్యాపించే సొరియాసిస్‌కు సకాలంలో వైద్యం అందించకపోతే అది ప్రాణాంతకంగా మారే అవకాశం ఉంది. జెనెటిక్ హోమియోపతి వైద్యం ద్వారా సొరియాసిస్‌ను సమూలంగా నయం చేయవచ్చని అంటున్నారు హోమియో వైద్య నిపుణులు డాక్టర్ పవన్ కుమార్.

# సొరియాసిస్‌కు హోమియోతో పరిష్కారం


డాక్టర్ జి.పవన్ కుమార్
జెనెటిక్ హోమియోపతి
కొండాపూర్ & దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్
ఫోన్: 8125 108 108
9133 180 108




వైద్యపరంగా సొరియాసిస్ వ్యాధిని గట్టేట్, పస్టులర్, ఎరిత్రోడెర్మా, నెయిల్ సొరియాసిస్, ఫ్లెక్సురల్, ఆర్థ్రోపతి అని వివిధ రకాలుగా విభజించడం జరిగింది. గట్టేట్ సొరియాసిస్ సాధారణంగా పిల్లలు, కౌమారప్రాయులు, యువజనులలో ఎక్కువగా వస్తుంది. ఒక సెంటీమీటర్ కన్నా తక్కువ వ్యాసార్థంలో ఎర్రని మచ్చ శరీరంపైన ఏర్పడుతుంది. క్రానిక్ ప్లేక్ (సొరియాసిస్ వల్గారిస్) 90 శాతం మంది వ్యాధిగ్రస్తులలో కనిపిస్తుంది. మోచేతులు, మోకాళ్లు, మాడు, గజ్జలు, చెవులు, మర్మాంగము తదితర అంతర్గత ప్రదేశాలలో తెల్లని పొలుసులు ఏర్పడుతాయి. పస్టులర్ సొరియాసిస్ రోగులలో జ్వరం ఉంటుంది. ఇది పాదాలు, అరికాళ్లపైన ఏర్పడుతుంది. ఇది శరీరమంతటా వ్యాపిస్తే ప్రాణాంతకంగా మారే ప్రమాదం కూడా ఉంది. ఎరిత్రోడెర్మిక్ సొరియాసిస్ కూడా ప్రమాదకరమైనదే. ఇది శరీరం వెలుపల చర్మమంతటా వ్యాపిస్తుంది. దీనివల్ల హైపోథెర్మియా, హైపోఅల్బుమినీమియా, రక్త హీనత, ఇన్‌ఫెక్షన్లు ఏర్పడడమే కాకుండా గుండెపై కూడా తీవ్ర ప్రభావం చూపగలదు. సొరియాటిక్ నెయిల్ అనేది గోళ్లకు వచ్చే వ్యాధి. ఇది దాదాపు 50 శాతం మంది సొరియాటిక్ రోగులలో కనబడుతుంది.



### వ్యాధి కారణాలు

సొరియాసిస్ ఎవరికైనా రావచ్చు. అయితే కొన్ని కారణాల వల్ల సొరియాసిస్ వచ్చే అవకాశాలు అధికంగా ఉంటాయి.

**కుటుంబ చరిత్ర:** సొరియాసిస్ వ్యాధి కుటుంబంలో ఎవరికైనా ఉంటే వంశపారంపర్యంగా వచ్చే అవకాశాలు ఎక్కువ. దాదాపు 40 శాతం వ్యాధిగ్రస్తులు వంశపారంపర్యత వల్ల ఈ వ్యాధి బారినపడుతున్నారు.

**ఒత్తిడి:** మానసిక ఒత్తిడి కారణంగా శరీరంలో వ్యాధి నిరోధక శక్తి తగ్గుతుంది. దీనివల్ల సొరియాసిస్ వచ్చే అవకాశం ఉంది.

**స్థూలకాయం:** అధిక బరువు కారణంగా సొరియాసిస్ వచ్చే అవకాశం అధికం.

**ధూమపానం:** పొగతాగడం వల్ల సొరియాసిస్ వచ్చే అవకాశాలు ఎక్కువగా ఉండడంతోపాటు వ్యాధి తీవ్రత కూడా పెరుగుతుంది.

**వైరల్, బ్యాక్టీరియా ఇన్‌ఫెక్షన్లు:** వ్యాధి నిరోధక శక్తి చక్కగా ఉన్నవారితో పోలిస్తే హెచ్ఐవి పాజిటివ్‌తో బాధపడేవారిలో సొరియాసిస్ వచ్చే అవకాశాలు ఎక్కువ. తరచు ఇన్‌ఫెక్షన్లు, గొంతు నొప్పితో బాధపడే పిల్లలు, యువజనులలో సొరియాసిస్ బారినపడే అవకాశాలు అధికం.

**లక్షణాలు:** సొరియాసిస్ లక్షణాలు వ్యాధి తీవ్రత, దశ , రకం, ఏర్పడిన ప్రదేశాన్ని బట్టి ఉంటాయి. సాధారణంగా ఎర్రని మచ్చలు ఏర్పడి చర్మం పొలుసులు పొలుసులుగా మారుతుంది. చిన్న ఆవగింజంత పరిమాణం నుంచి అరచేయంత పరిమాణంలో ఇవి ఏర్పడతాయి.

**దుష్ప్రభావాలు:** సొరియాసిస్ చర్మంపైన ఏర్పడిన ప్రదేశం, దాని రకాన్ని బట్టి దుష్ప్రభావాలు ఏర్పడతాయి. చర్మం మొద్దుబారిపోయి, ఇన్‌ఫెక్షన్లు ఏర్పడడం వల్ల విపరీతమైన దురద ఉంటుంది. వాటిని గీరడం వల్ల పుండ్లు ఏర్పడే అవకాశం ఉంది. రోగి మానసికంగా క్రుంగిపోతాడు. ఒత్తిడి, ఆందోళన, ఎవరితో కలవలేని ఒంటరితనం కారణంగా డిప్రెషన్‌కు లోనయ్యే అవకాశం ఉంది. హైబిపి, షుగర్ లెవల్స్ పెరగడం, గుండె వ్యాధులు, కేన్సర్లు వంటి సమస్యలు ఏర్పడే అవకాశం ఉంది. సొరియాటిక్ ఆర్థరైటిస్ వల్ల కీళ్ల నొప్పులు ఏర్పడి కాలు కదపడం కష్టమవుతుంది.

**హోమియో చికిత్స:** సొరియాసిస్ వ్యాధికి సమర్థంగా చికిత్సను అందచేయడంలో హోమియోపతి సంపూర్ణ సత్ఫలితాలు సాధించినట్లు ఎన్నో కేసులు నిరూపించాయి. హోమియో వైద్యం తీసుకున్న సొరియాసిస్ రోగులకు వారి జీవన ప్రమాణంలో గణనీయమైన పురోగతి లభించింది. ఎటువంటి సైడ్ ఎఫెక్ట్ లేకుండా సొరియాసిస్ వ్యాధి లక్షణాలు చాలావరకు తగ్గిపోయాయి. గడచిన 15 సంవత్సరాలుగా సొరియాసిస్ వ్యాధితో బాధపడుతూ, అనేక ఇతర వైద్య పద్ధతులలో చికిత్స పొంది, వ్యాధికి ఎటువంటి గుణం కనిపించకపోవడంతో హోమియో చికిత్స ద్వారా వ్యాధిని సంపూర్ణంగా నయం చేయించుకున్నవారు ఎందరో ఉన్నారు. మేము అందచేస్తున్న జెనెటిక్ హోమియో వైద్య విధానంలో ఎందరో రోగులు సొరియాసిస్ వ్యాధి నుంచి పూర్తిగా విముక్తి పొందారు. మేము అందజేసే సురక్షితమైన, శాస్త్రీయమైన వైద్య చికిత్సలు మానసికంగా కృంగిపోయిన ఎందరో సొరియాసిస్ వ్యాధిగ్రస్తులలో మళ్లీ చిరునవ్వులు నింపాయి. రోగికి సంబంధించిన సంపూర్ణ కుటుంబ చరిత్ర వ్యక్తిగత జీవన శైలిని ఆధారం చేసుకుని చికిత్స అందజేయడం జరుగుతుంది. మేము అందజేసే జెనెటిక్ కాన్స్టిట్యూషనల్ మందులు, ఇతర జెనెటిక్ కాంబినేషన్ మందులు జన్యువుల స్థాయిలో ప్రభావం చూపి వ్యాధిని సంపూర్ణంగా నిర్మూలిస్తాయి. సొరియాసిస్ వ్యాధి నిర్మూలనకు బాగా పనిచేసే కాలి అర్స్, బరైటా కార్బ్, నిట్ యాసిడ్, గ్రాఫిటిస్, స్టాఫ్, సెపియా, లైకోపోడియం, కాలి కార్బ్, కాలి ఫాస్, బ్రయోనియా, మెర్క్ తదితర హోమియో మందులను కచ్చితంగా అనుభవజ్ఞులైన వైద్యుల పర్యవేక్షణలోనే వాడాల్సి ఉంటుంది.



# 'చిత్ర'మైన థియేటర్లు

**సంతోషంగా ఉన్నప్పుడో, బోర్ కొట్టినప్పుడో సినిమాకి వెళుతుంటాం. అప్పటి సినిమాలకు ఇప్పుడొస్తున్న సినిమాలకు చాలా తేడా ఉంది. మరింత అద్భుతమైన టెక్నాలజీతో సినిమాలు వస్తున్నాయి. అలా కొత్త సినిమాలు వస్తున్నట్లే సినిమా థియేటర్ల రూపురేఖలు కూడా రోజు రోజుకు మరింత మారుతున్నాయి. వాటి హంగులు, ఆర్భాటాలు చూస్తే నోరెళ్లబెట్టక తప్పదు. అందుకు తగినట్టుగానే టికెట్ ధర ఉంటుందండోయ్. కానీ ధర విషయం పక్కన బెడితే ఈ చిత్ర విచిత్ర సినిమా థియేటర్ల గురించి వింటే మీరు కూడా ఒక్కసారైనా ఇలాంటి థియేటర్లలో సినిమా చూడాలనుకుంటారు. మరి ఆ సినిమా థియేటర్ల కథాకమామీషేంటో మీరూ తెలుసుకోండి!**

సినిమాలంటే చిన్నపిల్లలకు అంత ఆసక్తిగా ఉండదు. ఆరేడేళ్ళలోపు పిల్లలు థియేటర్లకు వెళ్ళి సినిమా చూసి ఆస్వాదించలేరు. పిల్లలకు ఆసక్తి లేదు కదా అని పెద్దలు సినిమా చూడకుండా ఉండలేరు కదా. తల్లిదండ్రులు తమతో చిన్నారుల్ని తీసుకెళ్తే, నానా యాగీ చేసేస్తారు. పేరెంట్స్‌ని సినిమా చూడనివ్వరు. పోనీలే అని వాళ్ళను బయటికి తీసుకెళ్దామనుకున్నాగానీ, సస్పెన్స్ మధ్యలో వదిలి వెళ్ళాలనిపించదు. ఇటు వారి అల్లరి మాన్పించలేక అటు సినిమా చూడలేక ఎంతో ఇబ్బంది పడతారు కదూ! ఈ సమస్య పరిష్కారానికి మెక్సికో సినీ థియేటర్ల నిర్వహణా సంస్థ ఓ కొత్త ఆలోచనకు శ్రీకారం చుట్టింది. అదే కిడ్స్ ఫ్రెండ్లీ థియేటర్. సాధారణంగా హాలులో పిల్లలు సినిమా చూస్తే, సీట్లో కామ్‌గా కూర్చోవాల్సిందే. కానీ అమెరికాలోని కాలిఫోర్నియా సినీపోలిస్ థియేటర్లో మాత్రం పిల్లలు

## పిల్లలకే ప్రత్యేకం

ఎంచక్కా ఆడుకోవచ్చు. వారికోసం ప్రత్యేకమైన గేమింగ్ జోన్‌లు ఉంటాయి. మల్టీప్లెక్స్‌లో గేమింగ్ జోన్స్ ఉంటాయి కానీ, అవన్నీ థియేటర్ బయట హాల్‌లోనే. ఈ సినిమాహాల్లో మాత్రం థియేటర్ స్క్రీన్‌కి దగ్గరగా కొంత ప్రదేశంలో గేమింగ్ జోన్ ఏర్పాటు చేశారు. ఇందులో స్లైడ్స్, ప్లేస్ట్రక్చర్స్, జంగిల్‌జిమ్స్ వంటివి ఉంటాయి. అటు పెద్దలు సినిమా చూస్తుంటే ఇటు పిల్లలు తమకు నచ్చిన ఆట ఆడుకోవచ్చు. ప్రస్తుతం కాలిఫోర్నియాలో ఇలాంటి థియేటర్లు రెండు ఉన్నాయి. పన్నెండేళ్ళ పిల్లలు ఇక్కడ ఆడుకునేందుకు అనుమతి ఉంటుంది. ఈ థియేటర్లకు అక్కడ ఆదరణ ఎక్కువగా ఉంది. ఇంకా ఇతర దేశాల్లో కూడా ఇలాంటి థియేటర్లు నిర్మించే ఆలోచనలో ఉందీ సంస్థ.



### హాట్‌టబ్ థియేటర్

ఎప్పుడైనా అలసిపోతే గోరువెచ్చని నీటి టబ్‌లో అలా రిలాక్స్‌గా సేద తీరుతుంటే ఎంత బాగుంటుందో కదా. శరీరంలోని మురికి వదలటమే కాదు, అప్పటిదాకా ఉన్న ఆ అలసట మొత్తం పోయి ఉత్తేజితులవుతాము. ఆ హుషారుతో మరిన్ని పనులు చక్కబెట్టుకుంటాం. అదే మనకు నచ్చిన సినిమాని థియేటర్‌లో చూస్తూ అలా గోరువెచ్చని నీటి టబ్‌లో రిలాక్స్ అవుతూ ఉంటే ఎంత బాగుంటుందో అనుకుంటున్నారా... ఆ ఆనందాన్ని మీ సొంతం చేయడానికే ఈ హాట్‌టబ్ సినిమా థియేటర్ కట్టారేమో! ప్రేక్షకులకు నేత్రపర్వం, వీనుల విందు కలిగించడంతోపాటు శరీరాన్ని తేలికచేసి ఫ్రెష్‌నెస్ ఇవ్వాలన్న ఉద్దేశంతో ఈ హాట్‌టబ్ సినిమా థియేటర్ ఏర్పాటు చేశారు. అయితే ఈ టబ్‌లో కూర్చోవాలంటే స్విమ్‌వేర్ కంపల్సరీగా వేసుకోవాలన్న నిబంధన ఉంది. ఒక టబ్‌లో ఆరుగురు కూర్చునే అవకాశం ఉంటుంది. ఒక చిన్న స్విమ్మింగ్ పూల్‌లో రకరకాల టబ్‌లు గోరువెచ్చని నీటితో నింపి ఉంటాయి. అందులో కూర్చుని సినిమా చూడాలి. సినిమా చూస్తూ తాగడానికి బీర్, ఇంకా కూల్ డ్రింక్స్, చిప్స్ అన్నీ అందుబాటులో ఉంటాయి. ఈ సదుపాయాలన్నీ ఉపయోగించుకునేందుకు చెల్లింపులు కూడా బాగానే ఉంటాయి. లండన్‌లోని న్యూయార్క్ సిటీలో ఈ సినిమా థియేటర్ ఉంది.

### కారులో సినిమా

"కారులో ఏం చేస్తారు?" ఏంటీ వింత ప్రశ్న! ఏం చేస్తారు, పాటలు వింటూ ఎంజాయ్ చేస్తూ షికారుకెళ్తారు, అంతే కదా! కానీ అక్కడకెళ్తే మాత్రం మీరు కారులో కూర్చుని తింటూ, ఎంచక్కా పాతకాలం సినిమాలు చూస్తూ ఎంజాయ్ చేయవచ్చు. అర్థమైందికదా, అక్కడున్న థియేటర్లలో కార్లే సీట్లన్నమాట. యునైటెడ్ స్టేట్స్‌లోని డిస్నీ హాలీవుడ్ స్టూడియోస్‌లో ఈ కార్‌సీట్ థియేటర్ ఉంది. ఈ థియేటర్ పేరు సై ఫై డైన్ థియేటర్ రెస్టారెంట్ (sci fi dine in theater restaurent). 1991 మే నెలలో ఈ థియేటర్ ప్రారంభమైంది. థియేటర్లలో ఎక్కడైనా

కొత్తసినిమాలు రిలీజవుతాయి. కానీ ఈ థియేటర్‌లో 1950, 1960 దశకంనాటి సినిమాలు లేదా ఆ చిత్రాల్లోని సన్నివేశాలు మాత్రమే ప్రదర్శిస్తారు. పాత కాలం సినిమాలు ఇష్టపడేవారు ఎంచక్కా ఈ సినిమా థియేటర్‌కి వెళితే సరి. కావల్సినంత కాలక్షేపం, ఆ అభిరుచికి తగ్గట్టు మానసిక ఆహ్లాదం లభిస్తుంది.

### ఆర్ట్‌హౌస్ థియేటర్

ఈ సినిమా థియేటర్ అమెరికా ఫ్లోరిడా రాష్ట్రం మైట్లాండ్‌లో ఉంది. కొందరికి ఆర్ట్ మూవీస్ అంటే చాలా ఇష్టం ఉంటుంది. అలాంటి వారి కోసమే ప్రత్యేకంగా ఈ సినిమా హాలు నిర్మించారు. దీనిపేరు ఎన్జైన్ థియేటర్. కొద్దో గొప్పో మంచి సినిమాలు ప్రదర్శించి థియేటర్ యజమానులు లాభాలు ఆర్జించాలనుకుంటారు. అయితే ఇది లాభాపేక్ష ఆశించని సినిమా థియేటర్. ఈ థియేటర్‌లో అన్నీ ఆర్ట్‌కి అంటే కళాత్మక సంబంధమైన సినిమాలు మాత్రమే వేస్తారు. అదేవిధంగా ఈ థియేటర్‌లో లోకల్ ఫిల్మ్ ఫెస్టివల్స్, ఫ్లోరిడా ఫిల్మ్ ఫెస్టివల్స్ ఘనంగా నిర్వహిస్తారు. ఇంకా విశేషమేంటంటే సినిమా థియేటర్ అందునా ఆర్ట్ థియేటర్ అనగానే ఎలా ఉంటుందో అనుకునేరు, అక్కడ కుర్చీలన్నీ డైనింగ్ కుర్చీల్లా ఉంటాయి. అక్కడ హాయిగా కూర్చుని తింటూ, తాగుతూ ఎంజాయ్ చేస్తూ మూవీ చూడవచ్చు.



### లైట్‌హౌజ్ థియేటర్

థియేటర్లను కళాత్మకంగా, ఆకర్షణీయంగా తీర్చిదిద్దేందుకు యాజమాన్యాలు ప్రయత్నిస్తుంటాయి. కానీ కొన్ని థియేటర్లు మాత్రమే తమ ప్రత్యేకత చాటుకుంటాయి. అలాంటి వాటిల్లో ఐర్లాండ్ లైట్‌హౌజ్ సినిమా థియేటర్ ఒకటి. ఐర్లాండ్ దేశ రాజధాని డబ్లిన్ నగరంలోని స్మిత్‌ఫీల్డ్‌లో ఉన్న లైట్‌హౌజ్ కళాత్మకంగా ఉంటుంది. అందుకే దీన్ని ఆర్ట్‌హౌజ్ థియేటర్ అని కూడా అంటారు. థియేటర్లోని ప్రతి సీటూ వైవిధ్యమైన రంగులో ఉంటుంది. సీట్లు, ఫ్లోరింగ్ అంతా వేర్వేరు రంగుల్లో ఉంటూ ఆకర్షణీయంగా కనిపిస్తుంది. 1988 నుంచి ఈ థియేటర్లో ఐరిష్, ఇండిపెండెంట్, విదేశీ క్లాసిక్ చిత్రాలు ప్రదర్శించేవారు. 1996లో ఈ థియేటర్ మూతపడింది. మార్పులు చేర్పులతో 2012లో అధునాతనంగా తిరిగి ప్రారంభించారు. అప్పటి నుంచి ఈ థియేటర్ ప్రేక్షకుల్ని మరింతగా ఆకట్టుకుంటోంది. ఈ రకమైన థియేటర్లు అక్కడ నాలుగు ఉన్నాయి.



### ఆరుబయట స్క్రీనింగ్

ఆరుబయట వెన్నెల్లో, బఠానీలు తింటూ డాక్యుమెంటరీ సినిమా లేదా ఏదైనా షార్ట్‌ఫిల్మ్ చూస్తుంటే ఎలా ఉంటుంది? ఎంత బాగుంటుందో కదా! అలాంటి థీమ్‌తోనే ఈ స్క్రీనింగ్ థియేటర్ ఏర్పాటు చేశారు. ఆగ్నేయ యూరప్‌లోని కొసావాలో అత్యంత ఘనంగా నిర్వహించే డాక్యుమెంటరీ, షార్ట్‌ఫిల్మ్, ఫిల్మ్‌ఫెస్టివల్ 'డోకుఫెస్ట్ 2002 నుంచి ప్రిజ్రెన్ (prizren) నగరంలో ప్రతి సంవత్సరం ఈ ఫిలిమ్‌ఫెస్టివల్ నిర్వహిస్తున్నారు. ఈ ఫెస్ట్ స్క్రీనింగ్‌కి వచ్చే ఎన్నో విభిన్నమైన చిత్రాలను ఆరుబయట పచ్చని గడ్డి మధ్యలో కూర్చుని బిగ్ స్క్రీన్‌లో వీక్షించడం చాలా ఆహ్లాదకరకరంగా ఉంటుంది.

### పడుకుని చూసేయండి

పడుకుని సినిమా చూస్తూ నిద్రలోకి జారిపోయేవారు చాలామందే ఉంటారు. కానీ సినిమా థియేటర్‌లో ఆ ఛాన్స్ తక్కువ. ఎందుకంటే అక్కడ కూర్చొనే సినిమా చూడాలి. అలాకాకుండా మెత్తని వెల్వెట్ పరుపుమీద పడుకుని, ప్రియురాలితో కలిసి అప్పడే విడుదలైన సినిమా చూస్తే ఎలా ఉంటుంది? ఈ ఆలోచనతోనే ఈ థియేటర్ ఏర్పాటు చేశారు. బ్లిడ్జ్ మెగాప్లెక్స్‌కి సంబంధించిన థియేటర్లు ఇండోనేషియాలో చాలా చోట్ల ఉన్నాయి. ఇవి 2013లో ప్రారంభమయ్యాయి. జకార్తాలో ఉన్న బ్లిడ్జ్ మెగాప్లెక్స్‌లో ఈ సదుపాయం మనకు లభిస్తుంది. ఇక్కడ సోఫా బెడ్స్‌పై పడుకుని ఎంచక్కా మూవీ చూడవచ్చు. దీన్ని ప్రత్యేకించి కపుల్స్ కోసమే ఏర్పాటు చేశారు. అంటే ఇది ఒకరకంగా కపుల్ థియేటర్ అన్నమాట. మామూలు థియేటర్ టికెట్ల ధరలతో పోలిస్తే మాత్రం ఇక్కడ టికెట్ ధర సినిమాను బట్టి రెండు నుంచి నాలుగురెట్లు అధికంగా ఉంటుంది. ఎంత అధికంగా ఉన్నా సరే కపుల్స్ ఎక్కువమంది ఈ థియేటర్‌లోనే సినిమా చూడడానికి ఉత్సాహపడుతున్నారని నిర్వాహకులు చెబుతున్నారు.







## అతిచిన్న థియేటర్

చిన్న మల్టీప్లెక్స్ అయినా సరే కనీసం వందమందికి పైగా కూర్చుని సినిమా చూసే వీలుంటుంది. ఇక పెద్ద హాల్స్‌లో అయితే ప్రేక్షకులు వందల సంఖ్యలోనే ఉంటారు. మరి ఎనిమిది సీట్లు మాత్రమే ఉండే థియేటర్ గురించి తెలుసా? అదే బ్రిటన్‌కు చెందిన సోల్ సినిమా థియేటర్. ఇదో మొబైల్ థియేటర్. 1965లో మ్యురిస్ మైనర్ అనే ఓ క్యాంపర్, చిన్న క్యారవాన్‌లో ఈ థియేటర్‌ను ఏర్పాటు చేశాడు. ఆటోకంటే కాస్త పెద్దగా ఉండే ఈ థియేటర్‌లో ఎనిమిది మంది ప్రేక్షకులు మాత్రమే కూర్చోవచ్చు. ఈ థియేటర్ ఏడు అడుగుల ఎత్తు, 16 అడుగుల వెడల్పు మాత్రమే ఉంటుంది. దీంతో సోల్ సినిమా థియేటర్‌కి ప్రపంచంలోనే అతి చిన్న థియేటర్‌గా గుర్తింపు దక్కింది. చిన్నగా ఉంటుంది కదా అని ఇందులో ఒక పెద్ద సైజు ఎల్ఈడీ టీవీలాంటిది ఉంటుందేమో అని అనుకోవద్దు. మామూలుగా అన్ని సినిమా హాల్స్‌లో ఉండే తెర, ప్రొజెక్టర్ ఉంటాయి. ఇక్కడ కూర్చుని సినిమాచూస్తే థియేటర్లో కూర్చుని సినిమా చూస్తున్న ఫీలింగే కలుగుతుంది. ఇక ఇంటర్వెల్‌లో బయట పాప్‌కార్న్, కూల్‌డ్రింకులు సైతం అందుబాటులో ఉంటాయి. పైగా సినిమా థియేటర్ల తరహాలో దీనికి పవర్‌సప్లై అవసరం లేదు. ఇది పూర్తిగా సౌరశక్తిపై ఆధారపడి పనిచేస్తుంది. తెర చిన్నగా ఉన్నప్పటికీ ప్రేక్షకులకు మంచి అనుభూతి కలుగుతుందని నిర్వాహకులు చెబుతున్నారు.

–సంతోషిలక్ష్మి దహగాం

# అపోహాలు - అసహనాలు

శ్రీ ఉదయిని



**"నా మూడేం బాగాలేదు" ఆ రోజు బహుశా ఇరవయ్యోసారి అనుకుంది ఇందుమతి.**

**"హలో! ఏమిటీ ఇంకా ఆలోచనలోనే ఉండిపోయావా? అక్కడ మన బస్ టైమ్ అవుతోంది" ఆమె సహోద్యోగి జలజ భుజం తట్టి గుర్తు చేసింది.**

తత్తరపడి లేచి జలజతో పాటు స్టాఫ్ రూం నుంచి బయటకి నడిచింది ఇందుమతి. ఎంటెక్ అయ్యాక హైదరాబాద్ ఇంజనీరింగ్ కాలేజీలో లెక్చరర్‌గా చేరింది ఇందుమతి. ఈ మధ్య ఆత్రేయ ఆశపెట్టి ఓ సలహా ఇచ్చాడు. "ఇందూ! నువ్వు కంప్యూటర్ కోర్సులు నేర్చుకుంటే ఉద్యోగం మారడం సులువు. నాకు అమెరికా ఛాన్స్ వస్తే ఇబ్బంది లేకుండా నువ్వూ నాతో వచ్చేసి అక్కడ ఉద్యోగం చేసుకోవచ్చు" అన్నాడు. అప్పటి నుంచి సాయంత్రం కాలేజీబస్సులో ఇంటికి వెళ్ళేటప్పుడు మధ్యలో మైత్రీవనం దగ్గర దిగి గంటసేపు కోర్సులు నేర్చుకుంటోంది.

"నాతో పాటు వచ్చేయచ్చు అని మా బాగా కబుర్లు చెప్పాడుగానీ, ఇప్పుడు అసలు పెళ్ళి అవుతుందో లేదో అనుమానంగా ఉంది" అనుకుంది ఇందుమతి. బస్సులో కూర్చుని ఆలోచనల్లో పడింది.

ఏడాది క్రితం స్నేహితురాలి పెళ్ళికి వెళ్ళినప్పుడు అక్కడ పరిచయం అయ్యాడు ఆత్రేయ. మొదటిసారి అతని పేరు విన్నప్పుడు పేరు చిత్రంగా ఉందే అనుకుంది. ఆ మాట చెప్పడానికి మొహమాటపడింది. అయితే ఆమె మనసును చదివినట్లు నవ్వాడు ఆత్రేయ. "నా పేరు మీకు చిత్రంగా అనిపించవచ్చు కానీ అర్థం ఒకటే" అన్నాడు.

"ఒకటే అంటే?" ఇందుమతి అడిగింది.

"ఐ మీన్...మన పేర్ల అర్థం దాదాపు ఒకటే." అన్నాడు. ఇంకా ఏదో చెప్పాడుగానీ భజంత్రీలమోతలో సరిగ్గా వినపడలేదు. ఆత్రేయ ఆమెకి బాగా దగ్గరగా వంగి "ఇక్కడ ఇంకో నిమిషం ఉంటే చెవులు బద్దలైపోతాయని అనుకుంటున్నారా?" అని అడిగాడు.

అవునన్నట్టు తల ఊపింది ఇందుమతి.

"మీకు కాఫీ ఇష్టమా?"

మళ్ళీ తల ఊపింది. "అయితే రండి." అంటూ చనువుగా సుతారంగా ఆమె భుజం తట్టాడు ఆత్రేయ. 'ఏమిటి అబ్బాయి మరీ ఓవర్ చేస్తున్నాడు' అని మనసులో సన్నగా కసురుకుంది. కానీ రాను అని చెప్పలేక అతనితో పాటు నడిచింది. మ్యారేజ్ హాల్‌కి కొద్ది దూరంలో ఉన్న కాఫీ డే కేఫ్‌కి తీసుకువెళ్ళాడు. కాఫీ బాగుంది, అతని కబుర్లు ఇంకా బాగా నచ్చాయి ఇందుమతికి. మెయిల్ ఐడి, సెల్ నెంబర్లు ఇచ్చిపుచ్చుకున్నారు. వారం తరువాత ఓ సాయంకాలం ఆమె ఇంటి దగ్గర కాలేజీ బస్సు దిగేసరికి అక్కడ ఆత్రేయ కనిపించాడు. "నా బాకీ వసూలు చేసుకుందామని

వచ్చాను" అన్నాడు.

"ఏం బాకీ?" అయోమయంగా అడిగింది ఇందుమతి.

"భలేవారే! ఆ రోజు నేను కాఫీ ఇప్పించాను కదా! ఈ రోజు మనం కాఫీ తాగాక బిల్ మీరు కడితే మన ఇద్దరి మధ్యా ఇక రుణానుబంధం ఉండదు" నవ్వాడు ఆత్రేయ.

"ఈ అబ్బాయి నవ్వులో ఏదో మాయ ఉంది" అనుకుంది ఇందుమతి. వాచ్ చూసుకుంది. ట్రాఫిక్ వల్ల అప్పటికే మామూలు సమయం కన్నా ఆలస్యం అయ్యింది. ఇప్పుడు ఇతనితో కాఫీ ప్లస్ కబుర్లు అంటే ఇంకా లేట్ అవుతుంది. కొన్ని క్షణాలు ఆత్రేయ కళ్ళల్లోకి లోతుగా చూసింది ఇందుమతి. అబ్బాయి జోరు మీద ఉన్నాడు. ఈ అబ్బాయికి బ్రేక్ ఎలా వేయాలి? సన్నగా నవ్వింది. "మీ బాకీ గురించి మీరేం వర్రీ అవకండి. నేను ఎప్పటికైనా తీర్చేస్తాను. ఏం అనుకోకండి" మెత్తగానే అయినా కచ్చితంగా చెప్పింది.

అతనికి నిరాశ కలిగిందేమో తెలియదు. కానీ అతని మొహంలో చిరునవ్వు మాత్రం చెదిరిపోలేదు. "నో ప్రాబ్లం" అన్నాడు. "అయితే నేను వస్తాను, బై" అంది కదులుతూ. "ఈరోజు రాను అని డిజప్పాయింట్ చేశారు. కనీసం నెక్స్ట్ టైం బెటర్ లక్ అని చెప్పి ఎంకరేజ్ చెయ్యొచ్చు కదా!" దీనంగా అడిగాడు ఆత్రేయ. పగలబడి నవ్వింది ఇందుమతి.

ఆమె నవ్వు చూశాక అతనికి ఉత్సాహం కలిగింది. "మీ ఇంటి దగ్గర డ్రాప్ చేయమంటారా?" ఇందుమతి తడుముకోలేదు. దీనికి కూడా 'నెక్స్ట్ టైం బెటర్ లక్' అంటూ కదిలింది. అబ్బాయికి నిజంగానే జలక్ ఇచ్చాను అనుకుంది. మామూలుగా దిండుమీద తల ఇలా ఆన్చగానే అలా నిద్ర వచ్చేసేది ఇందుమతికి. కానీ ఆ రాత్రి ఎందుకో ఆమెకి నిద్ర త్వరగా రాలేదు. 'కాఫీకి రావడం కుదరదని కచ్చితంగా చెప్పేసరికి అతను పాపం నొచ్చుకున్నాడా? అన్న ఆలోచన వేధించింది. మరీ బెట్టు చూపించకుండా ఓ అరగంట అతని సరదా కబుర్లు వింటే బాగుండేది కదా' అనే ఆలోచన ఆమెని చాలా సేపు వెంటాడింది. మర్నాడు సాయంకాలం కాలేజీలో బస్ ఎక్కడానికి వెడుతుంటే చిరునవ్వులు చిందిస్తూ ఎదురు పడ్డాడు ఆత్రేయ. "బస్‌లో వెళితే గంట ప్రయాణం, బైక్ మీద అయితే అరగంట సమయం కలిసొస్తుంది. ఈ అరగంటలో నా కాఫీ బాకీ మీరు తీర్చేయచ్చు" అన్నాడు. రెండు ప్లస్ రెండు నాలుగు కదా అన్నంత సింపుల్‌గా.

నాలుగేళ్ళ క్రితం బీటెక్ చదివినప్పుడు గడిపిన సరదా రోజులు గుర్తుకు వచ్చాయి ఇందుమతికి. అలా వారి పరిచయం పుంజుకుంది. ఆ తరువాత ఇక వారానికి రెండురోజులన్నా కలుసుకుంటున్నారు. ఆత్రేయ పరిచయం తర్వాత కాలం పరుగు తీస్తున్నట్టు అనిపించసాగింది ఆమెకి. "మా అమ్మని మీ కాలనీలో ఉన్న స్కూల్‌కి ట్రాన్స్‌ఫర్ చేశారు. స్కూలు దూరమైపోతుంది. అందుకని ఇల్లు మారాలనుకుంటున్నాం" అని రెండు నెలల క్రితం ఇందుమతి చెప్పగానే "వావ్! మా వెనక వీధిలో అంటే ఆల్మోస్ట్ మా ఇంటి వెనకే ఓ ఇల్లు ఖాళీగా ఉంది. చూస్తావా?" అడిగాడు ఆత్రేయ. ఉత్సాహంగా తల ఊపింది ఇందుమతి. "అయితే ఈరోజు హోటల్‌కి వద్దు. కాఫీ మా ఇంట్లోనే తాగి వెడదాం" అన్నాడు బైక్ ఎక్కమన్నట్టు సంజ్ఞ చేస్తూ. ఇంటి గోడకున్న నేమ్‌ప్లేట్‌మీద వై.ఎస్. శాస్త్రి అనే పేరు చదివిన ఇందుమతి ఆత్రేయ వంక ప్రశ్నార్థకంగా చూసింది. "అది మా నాన్న పేరు" అన్నాడు. ఇందుమతి అడుగు ముందుకు పడలేదు. ఇంతవరకూ ఆమె ఆ కోణంలో ఆలోచించలేదు. పార్టీల్లో, హోటల్స్‌లో ఆత్రేయ వెజ్ నాన్‌వెజ్ తేడా లేకుండా అన్ని రకాలు తినేవాడు. అందుకే తనకు కులం గురించి ఆలోచనలు కలగలేదా? "అక్కడే నిలబడి పోయావేమిటి?" స్వరం తగ్గించి గుసగుసగా అన్నాడు ఆత్రేయ. "నువ్వు మా ఇంటికి రావడం ఇది ఫస్ట్ టైం అనుకో. అయినా హారతి ఇచ్చి ఆహ్వానించాలంటే ఇంకొన్ని రోజులు ఆగాలి మేడమ్"

ఆ మాటతో ధైర్యం వచ్చి లోపలికి నడిచింది. ఆ తరువాత వెనక వీధిలో ఇల్లు చూసింది. బాగానే ఉంది. అయితే ఇంటికి చిన్న చిన్న రిపేర్లు చేశాక అద్దెకి ఇస్తారట. ఓ నెల రోజులు ఆగమన్నారు. ఆత్రేయ చొరవతో అనుకున్న అద్దెకే ఇంటి యజమాని ఒప్పుకున్నాడు. ఇల్లు మారేలోపు మూడుసార్లు ఆత్రేయ ఇంటికి వెళ్ళింది ఇందుమతి. ఒకసారి వెళ్ళినప్పుడు తమ్ముడు వరసయ్యే మూర్తితో మాట్లాడుతున్నాడు శాస్త్రి. నమస్తే అంకుల్ అని ఆయన్ను పలకరించి



ఆత్రేయతో కలిసి అతని తల్లి గాయత్రిని కలవడానికి లోపలికి వెళ్ళింది. ఉద్యోగం గురించి ఆమె అడుగుతుంటే ఇందుమతి సమాధానాలివ్వసాగింది. హాల్‌లో సంభాషణ పక్కనుంచి వినిపిస్తూనే ఉంది. "అవును మూర్తీ! ఇప్పుడు అర్జెంట్‌గా నీకు రెండువేలు ఎందుకురా?" శంకరశాస్త్రి అడిగాడు. "ఎల్లుండి నాన్నగారి ఆబ్దికం ఉంది కదా అన్నయ్యా!" మూర్తి గొణిగాడు. "రామాయణంలో దశరథుడి మరణవార్త విని వనవాసంలో ఉన్న రాముడు ఏం చేశాడో తెలుసా? ఆర్భాటంగా నాలుగు కూరలు, నాలుగు పచ్చళ్ళు, బూరెలు, గారెలు వండించలేదు. తాము స్వీకరించే ఆహారాన్నే దేవతలకి పితృదేవతలకి సమర్పించడం సంప్రదాయం అని చెప్పి గారపిండి, రేగుపళ్ళ పిండాలనే సమర్పించాడు. లేనిపోని చాదస్తాలకి పోకు" అన్నాడు శాస్త్రి. "అబ్బో! అంకుల్ చాలా ప్రోగ్రెసివ్" అనుకుంది ఇందుమతి. తమ పెళ్ళికి ఆయన నుంచి అభ్యంతరం

రాకపోవచ్చునన్న ఆశ కలిగింది. ఆ సంభాషణ విన్నావా అన్నట్లు ఆత్రేయ వంక చూసి తల ఊపింది. ఆత్రేయ చిత్రంగా నవ్వాడు. ఎందుకో నిముషం తరువాత తెలిసింది. "అమ్మా! నేను చెబితే ఇందు నమ్మకపోవచ్చు. కానీ నాన్నగారు నాకు ఈ పేరే ఎందుకు పెట్టారో చెప్పు" అన్నాడు. ఇందుమతివైపు తిరిగింది గాయత్రి. "ఆయనకి దేవుడి మీద నమ్మకం లేదని నా పెళ్ళయ్యాక తెలిసింది.

**బీటెక్ పూర్తిచేసి ఇంజనీరింగ్ కాలేజీలో లెక్చరర్‌గా ఉద్యోగంలో చేరిందామె. ఒక ఫంక్షన్‌లో ఆమెను చూసిన ఓ అబ్బాయికి తెగ నచ్చేసింది. ఇద్దరిమధ్యా మెల్లిగా ప్రేమకలాపం ప్రారంభమైంది. ఆమెను అతడింటికి తీసుకెళ్ళాడు. ఆ ఇంటికి ఉన్న నేమ్‌ప్లేట్ చూసి విస్తుపోయిందామె. మళ్ళీ ఊరట చెందినప్పటికీ ఆ తర్వాతి సంఘటనలు ఆమె మూడ్‌ను పాడు చేశాయి. ఇంతకీ ఏమిటా సంఘటనలు? అసలు ఆ నేమ్‌ప్లేట్‌మీద ఏమని ఉంది?**

అయితే నా పూజలకి వ్రతాలకి ఆయన ఎప్పుడూ అడ్డు చెప్పలేదు. గుడికి తీసుకెళ్ళేవారు. ఈయ నేమో గుడి బయటే నా చెప్పులకి కాపలాగా ఉండే వారు. వీడు కడుపులో పడినప్పటి నుంచీ నాకు బెంగ పట్టుకుంది. హేతువాదో నాస్తికుడో ఒకా యన తన పిల్లలకి వాళ్ళు పుట్టిన తేదీల్నిబట్టి ఉప్పు సత్యాగ్రహం, ప్రపంచ యుద్ధం ఆధారంగా పేర్లు పెట్టాడని విన్నాను. ఈయన కూడా ఆ తరహాలోనే పుట్టబోయే మా బిడ్డకి అప్పటివార్తల్ని బట్టి బోఫోర్స్ అనో బాబ్రీ మసీదు అనో పేరు పెడతారేమోనని హడలి చచ్చాను. పురిటికి వెళ్ళేటప్పుడు ఆసంగతే ఆయన్ని అడిగాను. ఆయన నవ్వేసి, "పిచ్చిదానా! తొమ్మిది నెలలు మోసింది నువ్వు. వేవిళ్ళ బాధ పడింది నువ్వు. నాకు దేవుళ్ళపైన నమ్మకం లేదు నిజమేగానీ, నీకు నచ్చని పేరు ఎందుకు పెడ తాను? మన గోత్రం పేరు పెడితే నీకు అభ్యంత రమా?" అన్నారు. బోఫోర్స్, మండల్ అని కాకుండా ఓ మహర్షి పేరు, కొత్తరకంగా కూడా ఉంది కాబట్టి నాకు పట్టలేని ఆనందం కలిగింది. తరువాత తెలి సింది నాకు.

"ఏం తెలిసింది ఆంటీ?" "గోత్రం అని కలరింగ్ ఇచ్చారు కానీ ఆత్రేయ రాసిన సినిమా పాటలంటే ఆయనకి చాలా ఇష్టమట." ఇందుమతి పగలబడి నవ్వింది. మొదటి నుంచీ ఆత్రేయ తల్లిదండ్రుల నుంచి మంచి మార్కులు సంపాదించాలని ఇందు మతి ప్రయత్నిస్తూనే ఉంది. రెండు వారాల క్రితం ఆత్రేయ తైవాన్ వెళ్ళాడు. రావడానికి నెలరోజులు పడుతుంది. వారం క్రితం ఇందుమతి కుటుంబం ఇల్లు మారింది. ఆత్రేయ తల్లిదండ్రుల దగ్గర ఇంత వరకూ తాను ఎన్ని మార్కులు సంపాదించుకుందో తెలియదుగానీ, ఆ ఉదయం మాత్రం గాయత్రి, రెడ్ పెన్నుతో తన రిపోర్ట్ కార్డ్‌లో పెద్ద పెద్ద ఇంటూ మార్కులు పెట్టిందా అన్న అనుమానం కలిగింది ఇందుమతికి.

ఆ ఉదయం ఇందుమతి మామయ్య అమెరికా నుంచి వచ్చాడు. అతనికి ఇష్టం అని రొయ్యలు మొదలైన నాన్‌వెజ్ వండటం మొదలుపెట్టింది ఇందుమతి తల్లి. కిచెన్‌లో తల్లికి సాయం చేస్తూ బయటకు వచ్చిన ఇందుమతికి గాయత్రి కిటికీ తలుపు టపటపా శబ్దం చేస్తూ మూయటం కన పడింది. అలా ఆవిడ మూయటం అసహనంతో చేస్తున్నదని శబ్దాన్ని బట్టి సులువుగానే తెలిసిపోతోంది. స్వైన్‌ఫ్లూ భయంతో కట్టుకున్నట్టు ముక్కుకు అడ్డంగా రుమాలు కట్టుకోవటంతో ఆమె ఎందుకు కిటికీ తలుపులు మూస్తోందో అర్థం చేసుకుంది ఇందుమతి. ఆ తరువాత హడావిడిగా కాలేజీకి బయల్దేరింది ఇందుమతి. దారిలో గాయత్రి ఎదురు పడింది. సాధారణంగా అయితే పలకరింపుగా నవ్వేది ఆవిడ. అప్పుడు మాత్రం మొహం దించు కుని ఇందుమతిని చూడనట్టు వెళ్ళిపోయింది. గాయత్రికి కోపం వచ్చిందని తెలిసిపోయింది. ఆ కోపానికి కారణం ఊహించడం కష్టం కాదు కాబట్టి, ఆమె కోపం తగ్గించే ఉపాయం తన చేతిలో లేదని తెలుసు కాబట్టి అప్పటినుంచి నా మూడేం బాగా లేదు అనుకోవడం మొదలుపెట్టింది. ఆలోచన ల్లోంచి బయటపడింది ఇందుమతి. మామూలుగా అయితే మైత్రీవనంలో బస్ దిగి కంప్యూటర్ క్లాస్‌కి వెళ్ళాలి. కానీ ఆ రోజు క్లాస్ మానేసింది. బస్ దిగి కాలనీలోకి నడిచింది. కొద్ది దూరం వెళ్ళగానే పార్క్ కనపడింది. క్లాస్‌కి వెళ్ళలేదు కదా కాసేపు ఇక్కడ గడిపి ఇంటికెళదాం అనుకుని పార్కులోకెళ్ళింది. ఓ మూలగా కూర్చుని మళ్ళీ ఆలోచనలో పడింది. 'తమ ఆహార వ్యవహారాలంటే ఆత్రేయ తల్లికి ఇష్టం లేకపోతే ఎలాగో ఒకలాగా నచ్చచెప్పవచ్చు. కానీ ఏహ్యాభావం ఉంటే ఏం చేయాలి? ఆవిడ తీరు చూస్తే తనని కోడలిగా ఒప్పుకునే అవకాశాలు కన పడడం లేదు. ఇలాంటి పరిస్థితి ఎదురైనప్పుడు సమయానికి ఆత్రేయ కూడా లేడు'.

"నా మూడేం బాగాలేదు."

ఆ మాటలు విని ఆలోచనల్లో ఉన్న ఇందుమతి ఉలికిపడింది. తన పేటెంట్ డైలాగ్‌ని తన అను మతి లేకుండా మరెవరో కూడా వాడుతున్నారా? అనుకుని అటు చూసింది. ఓ పక్కగా ఇద్దరు ఆంటీలు మాట్లాడుకుంటున్నారు.

"పొద్దున్న వీక్లీలో రామాయణం చదివినప్పటి నుంచి నా మూడేం బాగాలేదు. అరణ్యవాసంలో సీతమ్మ ఆకలి అనగానే రామలక్ష్మణులు వన్యమృ గాల్ని వేటాడి మాంసం తెచ్చారుట. సీతమ్మ చక్కగా వండితే ముగ్గురూ కడుపారా భుజించారని వాల్మీకి రామాయణంలో ఉందట"

"నిజమే అయుండొచ్చు. మనం కూడా తింటాం కదా? అలాగే దేవుడు కూడా.."

"ఛా! ఒకటే ఎలా అవుతుంది? అలా అని చెప్పి రామనవమికి వడపప్పు, పానకం నివేదన ఇచ్చి దాంతో పాటు చికెన్ సిక్స్‌టీ ఫైవ్ వండుతావా?" చప్పున అనేశాక అయ్యో తప్పు మాట అన్నానేమో అన్న భయంతో చెంపలురెండూ చేతితో తాకింది ఆవిడ. అప్రయత్నంగా లేచినిలబడింది ఇందుమతి. ఎందుకు నుంచుందో ఆమెకే తెలియదు. మళ్ళీ కూర్చో వడం ఇష్టం లేక పార్కు బయటకు వచ్చి పక్కనే ఉన్న ఆలయంలోకి నడిచింది. నువ్వంటే నమ్మకం లేని అబ్బాయితో నా పెళ్ళి జరిగేట్టు అనుగ్రహించు స్వామీ అని ప్రార్థిస్తే ఆ రామచంద్రుడు కటాక్షి స్తాడా అన్న ఆలోచన ఇందుమతికి నవ్వు కలిగిం చింది. పూజారి ఇచ్చిన కొబ్బరిచిప్ప, పూలు అందుకుని బయటకు వచ్చాక, 'గాయత్రికి దేవుడి ప్రసాదం ఇచ్చి కొన్ని అబద్ధాలు చెబితే ప్రసన్నురాలవుతుందేమో కదా?!' అనే ఆలోచన వచ్చింది. దాంతో ఇక చక చకా అడుగులు వేసింది.

***

ఆఫీసు నుండి వచ్చిన భర్తకి కాఫీ ఇచ్చి గొంతు సవరించుకుంది గాయత్రి. "ఆత్రేయ ఆ పిల్లని మన ఇంటికి తీసుకువస్తే వాడు మనసు పడ్డాడేమో అనుకున్నాను. పిల్ల కూడా లక్షణంగానే ఉంది అను కున్నాను. మీ ఎదుట కులం ప్రసక్తి తెస్తే మీకు కోపం వస్తుందని అప్పటికీ వాడిని చాటుగా అడిగాను. 'ఏ కులమో నాకు తెలియదు. నేను అడగలేదు. అడగను' అన్నాడు వాడు. అంతటితో ఆగకుండా 'అమ్మా! అవన్నీ పట్టించుకోవద్దు' అని కూడా అన్నాడు. సరే అనుకుని సమాధానపడ్డాను. ఈ ఉదయం అంత జరిగాక..."

టక్కున అడ్డుతగిలాడు శాస్త్రి, "ఏం జరిగింది?



వాళ్ళకి ఇష్టమైనది వాళ్ళు వండుకున్నారు, అంతే కదా?"

"అది కాదండి..." అడ్డు తగలబోయింది గాయత్రి. ఈ లోగా గేట్ తీసిన శబ్దం విని శాస్త్రి కిటికీలోంచి చూసి గుసగుసగా అన్నాడు. "ఆ అమ్మాయే వస్తోంది. తిరస్కారంగా మాట్లాడకు" అని హెచ్చరించి ఇందు మతి తలుపు తట్టాక తలుపు తీశాడు.

"గుడికి వెళ్ళొస్తున్నాను ఆంటీ! ప్రసాదం తీసు కోండి" అంది ఇందుమతి. మొహానికి నవ్వు పులుము కుని కొబ్బరిచిప్ప, పూలు అందుకుని కళ్ళకు అద్దుకుంది గాయత్రి. "అంకుల్! మీకు దేవుడంటే నమ్మకం లేదంటారు కదా, మరి రామాయణం ఎందుకు చది వారు?" అడగబోయే విషయానికి పునాది వేస్తూ అంది ఇందుమతి.

శాస్త్రి నవ్వి, "ఒక్కొక్క మతం ఒకొక్క దేవుణ్ణి నమ్మమని చెప్పింది. నేను ఏ దేవుడినీ నమ్మను. నిజమే! అలాగే హారీ పోటర్, డిటెక్టివ్ యుగంధర్ నిజంగా ఉంటారని నేను నమ్మను కానీ ఆ పుస్తకాలు చదవటం నాకు ఇష్టం. అలాగే రామాయణం కూడా చదివాను. ఎనీ అబ్జెక్షన్?"

ఇందుమతి కూడా నవ్వింది. "అబ్జెక్షన్ అని కాదుగానీ చిన్న డౌట్." అంటూ పార్కులో తను విన్న సంభాషణ చెప్పింది. "ఆవిడ చెప్పింది కరెక్టే! అంతే కాదు వాతాపి జీర్ణం అన్న ఆగస్త్యుడు తిన్నది ఏమిటి?" అన్నాడు శాస్త్రి. గాయత్రి మొహం నల్ల బడింది.

"అయ్యో! అది కరెక్టేనా అంకుల్?" అంది ఇందు మతి నాటకీయంగా.

"నేను అయ్యో అనుకోవాలి! నువ్వెందుకు తల్లీ అయ్యో అంటున్నావు" అనుకుంది గాయత్రి.

ఎందుకో ఇందుమతి వివరించింది. "నాన్ వెజ్ తినటం తప్పు అనుకుని చాలా రోజుల క్రితం నేను మానేశాను అంకుల్! సాక్షాత్తూ శ్రీరామచంద్రుడే వేటాడి మరీ నాన్ వెజ్ తిన్నాడని అప్పుడు నాకు తెలియదు" చెప్పింది. తను మాట్లాడేది శాస్త్రితో అయినా ఇందుమతి మాట్లాడేది గాయత్రిని ఉద్దేశించే. ఇందుమతి చూపులు మాత్రం గాయత్రి స్పందన ఎలా ఉందా? అని నిశితంగా పరిశీలించాయి. గాయత్రి మొహంలో నవ్వు ఛాయ కనపడడంతో అమ్మయ్యా! అబద్ధం పనిచేసింది అనుకుంది. ఇందుమతి వెళ్ళాక గాయత్రి కొంతసేపు మౌనంగా ఉండిపోయింది. "అన్నం పరబ్రహ్మ స్వరూపం అంటావు కదా! నీకు ఇష్టం లేకపోవచ్చు కానీ ఇతరులు తినే ఆహారాన్ని బాహా టంగా అసహ్యించుకోవడం అనాగరికత. ఇప్పటికైనా నీ కోపం తగ్గిందా?" గాయత్రిని అడిగాడు శాస్త్రి.

"నాకు ఎప్పుడు కోపం వచ్చింది?" అంది గాయత్రి లౌక్యంగా.

***

ఆ రాత్రి ఆత్రేయ స్కైప్‌లోకి వచ్చి ఇందుమతితో మాట్లాడాడు. జరిగినదంతా పూసగుచ్చినట్టు చెప్పింది ఇందుమతి.

"అబద్ధం చెప్పావా? అయితే మనకి ఆడపిల్ల గ్యారంటీ" అన్నాడు నవ్వుతూ. "అబ్బో! హేతువాదు లకి ఇలాంటి నమ్మకాలు కూడా ఉంటాయా?" అంటూ మూతి విరిచింది ఇందుమతి.

"ఉండవు. కాని అలాంటివి నమ్మే వాళ్ళతో జోక్ చేస్తే మజాగా ఉంటుంది."

"నీకు మజాగానే ఉంటుంది బాబూ! ఇక్కడ నాకు ఎంత టెన్షన్‌గా ఉందో తెలుసా? నేను ఆ అబద్ధం చెప్పాకే ఆంటీ మొహం కాస్త ప్రసన్నంగా మారింది."

ఆత్రేయ ముఖంలో చిరునవ్వు మాయమైంది. "అది అబద్ధమేనా లేకపోతే నిజంగా నిజం చేస్తావా?"

ఇందుమతి కింది పెదవి పంటి కింద నలి గింది. "ఆంటీని ఒప్పించడానికి అవసరమైతే నిజం గానే నాన్‌వెజ్ తినడం మానేస్తాను. అసలు మన పెళ్ళి అవుతుందా అవదా అని పొద్దుటనుంచీ ఎంత కంగారు పడుతున్నానో తెలుసా? పొద్దున్న ఆంటీ ఎంత వికారంగా రియాక్ట్ అయ్యారో నీకు మాట లతో చెప్పలేను."

"ఓకే! ఇక ఆ సీరియస్ విషయాలు పక్కనపెట్టి నా తైవాన్ అనుభవాలు చెప్పనా?" అన్నాడు ఆత్రేయ టాపిక్ ఇట్టే మారుస్తూ. భాష రాక తను పడ్డ అవ స్థలు చెబుతూ రూమ్ బయటకు నడిచాడు ఆత్రేయ. "ఇందూ! ఇదుగో ఇది మా హోటల్ రెస్టా రెంట్. స్టార్ బక్స్‌లో అరగంట క్రితం లీటర్ కాఫీ తాగాను కాబట్టి ఆకలి ఎక్కువ లేదు. ఓ బర్గర్ తింటే ఈ పూటకి చాలు. అన్నట్టు నా పక్క టేబుల్ అతను ఏం తింటున్నాడో చూసి ఊహించగలవా?...డాగ్ మీట్.."

"యాక్!" అంది ఇందుమతి మొహం చిట్లించి. "ఓహో! అమ్మ ఎంత వికారంగా మొహం పెట్టిందో మాటలలో చెప్పలేనన్నావు. ఇలా మొహంలో అద్భు తంగా భావాలు పలికించి చూపిస్తున్నావా?" ఆత్రేయ స్వరం సరదాగా ఉంది కానీ మాటలలో అవసరమై నంత పదును కూడా ఉంది అని అనుకుంది. ఇందు మతి జవాబు ఇవ్వటానికి తడబడింది. "చిన్న ప్పట్నించీ నువ్వు మీట్ తిన్నదానివే, కానీ డాగ్ మీట్ ప్రస్తావన రాగానే నీకు వికారం అనిపించింది. అమ్మ కూడా అంతే! అమ్మని సమర్థించడానికి ఇది చెప్పటం లేదు. ఆమె ఎందుకలా రియాక్టయిందో అర్థం చేసుకుంటావని చెబుతున్నాను. అలా అర్థం చేసుకోగలిగితే అబద్ధాలు చెప్పాల్సిన అవసరం ఉండకపోవచ్చు. అమ్మని ఒప్పించే బాధ్యత నాది, సరేనా? నాతో పెళ్ళి కోసం నీకు ఇష్టమైన వాటన్నిం టినీ కష్టపడి వదులుకోనవసరంలేదు, అర్థమైందా?" తల ఊపింది ఇందుమతి. "అర్థమైందిగానీ, ఆంటీని ఒప్పించడం, నా పైన కోపం, నా ఆహార వ్యవహా రాలపై ఆవిడకి అసహ్యం లేకుండా ఉండడం ఈ రెండూ వేరు వేరు కదా?" అది నువ్వెలా సాధిస్తావు అన్నట్టు అడిగింది.

ఆత్రేయ నిట్టూర్చాడు. ఇందాక నెట్‌లో చది వాను. యూపీలో ఎవడో బీఫ్ తిన్నాడని జనం దాడి చేసి చంపేశారుట. అతను ఏ మాంసం తిన్నాడో గానీ జనం సాధించింది మాత్రం నరమాంసం.

"ఆ దారుణానికి బీఫ్ కారణం కాదేమో? అందులో పొలిటికల్ యాంగిలుందేమో?"

"మన మనోభావాలు దెబ్బతీస్తూ వాడు ఇడ్లీ తింటున్నాడని, వెళ్ళి వాడిని కొట్టే పేరుతో ఎంత రాజకీయం చేసినా, మాయ చేసినా జనం మూగుతారా? బీఫ్ పైన అలాంటి అపోహలున్నాయి కాబట్టి జనం తేలికగా గుమికూడారు. సులువుగా రెచ్చిపోయారు. ఆ సంగతి ఎందుకు చెబుతున్నానంటే, సరైన హేతువు లేకుండా ఎప్పటి నుంచో పాతుకు పోయిన నమ్మకాలను, అపోహలను తొలగించటం ఈజీ కాకపోయినా, ఎట్‌లీస్ట్ మన దగ్గరి వారిలో ఉన్న అలాంటి అపోహల్ని సరైన కారణాలు చెప్పి తొల గించటం కష్టం కాదు అనుకుంటున్నాను" ఆత్రేయ దృఢంగా చెప్పాడు.

అతను చెప్పిన తీరు ఇందుమతికి బాగా నచ్చింది. "నువ్వు తోడుంటే నా మూడేం బాగాలేదు అని అను కోవాల్సిన అవసరం రాదు ఆత్రేయ" అనుకుంది.

## ఒంటరిగా కూర్చుని ఏడుస్తుందట!

ఈ మాటలు అన్నది ఎవరో కాదు విద్యాబాలన్. విద్యాబాలన్‌కి అంత కష్టమే మొచ్చింది? అనుకుంటున్నారా? కష్టమని కాదు. బాధతో ఏడుస్తుందట! ఎందు కంటే...దానికీ ఓ కారణం చెప్పింది. తన సినిమా ఫ్లాప్ అయితే ఆ బాధ తట్టుకోలేక గదిలో ఒంటరిగా కూర్చుని ఏడుస్తుందట! ఆ సమయంలో తన తల్లిదండ్రులు కానీ, భర్తకానీ ఎవరో ఒకరు తనని అంటిపెట్టు కుని ఉంటారట! అయితే ఆ బాధ కొద్దిసేపే ఉంటుందనీ, ఆ తరువాత మామూలు స్థితికి వచ్చేస్తాననీ చెబుతోంది. ఎన్ని సినిమాలు చేసినా తన బాధ ఎప్పటికీ అలాగే ఉంటుందని అంటోంది.





## స్కిన్ కేన్సర్‌ని అడ్డుకునే టమోటా

టమోటా తీసుకోవడం వలన కలిగే ఆరోగ్య లాభాల గురించీ, కొన్ని రకాల కేన్సర్లను అది అడ్డుకుంటుందన్న సంగతీ తెలిసిందే! ఇప్పుడు ఇది చర్మ కేన్సర్ కణాలను సమర్ధవంతంగా అడ్డుకుంటుందన్న విషయం ఒహియో స్టేట్ యూనివర్సిటీ పరిశోధనల్లో వెల్లడైంది. దీనిలోని కాంపౌండ్ హానికర అతి నీలలోహిత కిరణాల నుంచి చర్మాన్ని కాపాడుతుందనీ, తద్వారా కేన్సరు వచ్చే అవకాశాలను బాగా తగ్గిస్తుందని ఈ పరిశోధకులు చెబుతున్నారు. చర్మకేన్సర్‌తో బాధపడేవారు ప్రతిరోజూ ఒకటి రెండు టమోటాలు ఆహారం ద్వారా తీసుకోవడం వలన వారి జీవితకాలం పెరిగే అవకాశాలు ఉన్నాయని ఈ యూనివర్సిటీ పరిశోధకులు అంటున్నారు. వీరు ప్రతిరోజూ టమోటా పౌడర్‌ను ఆహారంగా ఎలుకలకు అందించారు. కొన్ని రోజుల అనంతరం వీటిని పరిశీలించగా, కేన్సర్ కణాల పెరుగుదల మందగించడం వీరు గుర్తించారు. కేన్సర్ కణాల పెరుగుదల ఎలుకల్లో ఏ విధంగా ఉంటుందో, మనుషుల్లో కూడా అదే విధంగా ఉంటుందనీ, అందువలన టమోటా తినడం ద్వారా చర్మ కేన్సర్ తీవ్రతను తగ్గించుకోవచ్చని వీరు స్పష్టం చేస్తున్నారు. దీని మీద ఇంకా పరిశోధనలు నిర్వహించాల్సి ఉందని వీరు చెబుతున్నారు.

# ఆరోగ్యమే మహాభాగ్యం

## త్వరగా తినడమే మంచిది!

రాత్రి సమయంలో త్వరగా తిని త్వరగా నిద్రపోవాలని పెద్దలు ఎప్పుడూ చెబుతుంటారు. ఇదే విషయం పెన్సిల్వేనియా విశ్వవిద్యాలయం పరిశోధనలో రుజువైంది. సుమారు 110 మంది ఆహార అలవాట్ల మీద ఈ విశ్వవిద్యాలయం పరిశోధకులు సుదీర్ఘకాలం పాటు పరిశోధన నిర్వహించారు. వీరిలో సగం మందిని రాత్రి ఎనిమిది ముందు, మిగతావారిని రాత్రి 8 నుంచి 11 గంటల లోపు ఆహారం తీసుకోమన్నారు. అనంతరం వీరి ఆరోగ్యాన్ని పరిశీలించారు. ఆహారం త్వరగా తీసుకున్న వారిలో జీవక్రియలు సక్రమంగా ఉండగా, లేటుగా ఆహారం తీసుకున్న వారి ఆరోగ్యంలో కొన్ని మార్పులు కనిపించాయి. రాత్రి ఆహారం ఆలస్యంగా తీసుకోవడం వలన శరీరంలో ఇన్సులిన్ ఉత్పత్తి, గ్లూకోజు నిల్వలు, కొవ్వు ఉత్పత్తి, అన్నీ ఎక్కువగా ఉన్నట్టు గమనించారు. అంతే కాకుండా గుండె, ఊపిరితిత్తుల పని తీరులో కూడా మార్పులు గమనించారు. కొవ్వు ఉత్పత్తి పెరగడం వలన అధికబరువు, బిపి, షుగర్ వంటి సమస్యలతో పాటు గుండె సంబంధింత సమస్యలు తలెత్తుతాయన్న సంగతి తెలిసిందే!



## మెదడుకి మంచి చేసే వైన్?

వైన్ మితంగా తాగితే కలిగే ఆరోగ్య లాభాల గురించి అందరికీ తెలిసిందే! గుండెజబ్బులు, పేగు కేన్సర్ వంటి వాటి నుంచి వైన్ కాపాడుతుందన్న సంగతి గతంలో నిర్వహించిన పరిశోధనల ద్వారా వెల్లడైంది. ఇప్పుడు మెదడుకు కూడా వైన్ మేలు చేస్తుందన్న సంగతి స్పెయిన్ పరిశోధనల్లో వెల్లడైంది. ప్రతిరోజూ కొద్దిగా వైన్‌ను తాగడం వలన మెదడులోని న్యూరాన్‌లు ఆరోగ్యంగా ఉంటాయని, మెదడులోని న్యూరాన్‌లు సక్రమంగా పనిచేయకపోతే మతిమరుపు, పార్కిన్సన్ వంటి సమస్యలు తలెత్తే అవకాశం ఉంది. అయితే వైన్ నుంచి వెలువడే రసాయనాలు మెదడులోని న్యూరాన్లు నిర్జీవం కాకుండా కాపాడతాయని వీరి పరిశోధనల్లో స్పష్టమైంది. స్త్రీలు ఒక గ్లాసు, పురుషులు రెండు గ్లాసుల వైన్ మించకుండా తాగితే ఆరోగ్యంగా ఉండవచ్చని వీరు సూచిస్తున్నారు.



కొన్ని రకాల ఆరోగ్య సమస్యలు ఉన్నవారు మాత్రం వైన్ తాగే ముందు వైద్యులను సంప్రదించాల్సిందేనని స్పష్టం చేస్తున్నారు. అలాగే గర్భవతులు వైన్‌కి దూరంగా ఉండాలని వారు చెబుతున్నారు.



## అలర్జీతో పిల్లల్లో డిప్రెషన్?

ఇది కొద్దిగా తికమకగా ఉన్నా నిజమే అంటున్నారు అమెరికా పరిశోధకులు. పిల్లల్లో సాధారణంగా కనిపించే అలర్జీ వారిలో డిప్రెషన్‌కి కారణమవుతుందని ఇటీవలి పరిశోధనలో వెల్లడైంది. 4 నుంచి 12 సంవత్సరాల వయస్సు ఉన్న సుమారు 80 మంది పిల్లల మీద వీరు సుదీర్ఘ అధ్యయనం నిర్వహించారు. వీరిలో సగం మందికి అలర్జీ లేదు. మిగతా వారికి ఉంది. కొన్ని నెలల అనంతరం వీరిని పరిశీలించగా అలర్జీతో బాధపడుతున్న పిల్లల్లో 60 శాతం మంది డిప్రెషన్‌కు గురైనట్టు పరిశోధకులు గుర్తించారు. అలర్జీ పిల్లల్ని తీవ్ర అసౌకర్యానికి గురిచేస్తుందనీ, తమ తోటి వారికి లేని ఇబ్బంది తమకే కలిగిందన్న భావన వారిలో క్రమేపీ డిప్రెషన్‌కి దారి తీస్తుందనీ వారు చెబుతున్నారు. తల్లులు ఈ విషయంలో కొద్దిగా జాగ్రత్త పడాలని అంటున్నారు. పిల్లల్లో అలర్జీ లక్షణాలు కనిపించగానే అదేదో సాధారణమే అన్నట్టుగా కాకుండా అదొక ఆరోగ్య సమస్యగా భావించి సరైన వైద్యం అందించడమే కాకుండా వారిలో ఆత్మస్థైర్యాన్ని కలగచేయాలని సూచిస్తున్నారు.

—అవినాష్

# మహావాస్తు

**వాస్తు అంటే ఏమిటి? మనం వాస్తును ఎందుకు విశ్వసించాలి?**

**మన ఇంటి వాస్తు ప్రభావం మన మీద, మన ఆలోచనా సరళిపైనా నిజంగా ఉంటుందా?**

**గృహ నిర్మాణం వాస్తు ప్రకారం ఎందుకుండాలి?**

**పంచభూతాలు, అష్టదిక్కులు, మన జీవన విధానం పైన ఎంత వరకు ప్రభావం చూపిస్తాయి?**

**మొదలైన ఎన్నో సాధారణ సందేహాలను నివృత్తి చేసుకునే ముందు కొన్ని ఆసక్తికరమైన విషయాలను తెలుసుకోవాలి.**


వాస్తు విద్వాన్, సాయిశ్రీ

**గౌ. డా. దంతూరి పండరీనాథ్**




## అండము-బ్రహ్మాండము

అమెరికాలోని చికాగో నగరంలో ఒక 'నేచురల్ సైన్స్ మ్యూజియమ్' ఉన్నది. అది ఖగోళాన్ని మరియు మనిషి ప్రాచీన నాగరికతను ప్రతిబింబింపజేస్తుంది. అంచెలంచెలుగా ఎదుగుతూ వస్తున్న మనిషి మేధస్సు, మనుగడల సమన్వయాన్ని భద్రపరచి మనకు చూపిస్తున్న ఆ మ్యూజియం ఒక అద్భుతమనే చెప్పాలి. అక్కడే ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన **'ప్లానిటోరియం'** కూడా ఉన్నది. అందులో ఖగోళశాస్త్రానికి సంబంధించిన అనేక దృశ్యాలను చూడవచ్చును.



మనము భూమి మీద ఏదేని ఒక కేంద్రాన్ని నిర్దేశించుకొని, అక్కడి నుండి పైకి ఎగురుతూ... టెలిస్కోప్‌లో ఆ కేంద్రాన్నే చూస్తూ చూస్తూపోతే, క్రమంగా అది కనుమరుగై దాని పరిసరాలు విస్తృతంగా కనిపిస్తుంటాయి కదా! అలాగే పై పైకి పోతున్న కొద్దీ ఈ కేంద్రం కనుమరుగైపోతూ, ఆ గ్రామం, పట్టణం, రాష్ట్రం, దేశం... ఇంకా పైకి వెళుతున్నకొద్దీ క్రమంగా భూగోళం కూడా చిన్నదైపోతూ భూమి చుట్టూ గాఢమైన నలుపురంగు సంతరించుకున్న శూన్యం కనిపిస్తుంది. ఆ శూన్యంలో నక్షత్ర సముదాయాలు. ఆ తరువాత మన సౌర కుటుంబంలోని వివిధ గ్రహాలు, వాటి భ్రమణ, పరిభ్రమణాల కక్ష్యలు గోచరిస్తాయి. ఇంకా పైకి వెళితే మన సౌరకుటుంబంయావత్తూ... సూర్యుని చుట్టూ తిరిగే నవగ్రహాలు (భూమికూడా) వెలుగులు చిమ్మే సూర్యుని లాంటి అనేకానేక నక్షత్రాలు... వాటిచుట్టూ మన నవగ్రహాల్లాంటి అనేకానేక గ్రహాలు పరిభ్రమిస్తుండటం కనిపిస్తుంది. దానిపేరే పాలపుంత! (Galaxy). అలాంటి ఇంకెన్నో పాలపుంతలు! రాత్రిపూట వినీలాకాశంలో కనిపించే నక్షత్ర సమాహారాల దృశ్యాన్ని ఎవరైనా ఊహించుకోవచ్చు. అయితే విశేషదృశ్యం ఏమిటంటే 'ఒక సాధారణ నీటి అణువును మైక్రోస్కోపు కింద పెట్టి కొన్ని వందల రెట్లు పెద్దదిగా చేసి పరిశీలించినప్పుడు కనిపించే **'కాంతి దృశ్యం'** కూడా... దాదాపు ఆకాశవీధిలో కనిపించిన **'నక్షత్ర సమాహార 'కాంతి'దృశ్యాన్ని'** పోలివుంటుంది. ఆశ్చర్యమేస్తుంది! అణువులో ఉన్నదే ఆకాశంలో ఉన్నది. అండపిండ బ్రహ్మాండము నిండా ఉన్నదొకటే!

ఎప్పుడో ఎంతో కాలం క్రితం పురాతన గ్రంథాలలో ఉన్న విషయమే ఇది. మనకు ఇప్పుడు కొత్తగా అనిపిస్తుంది. అంతే! మన పాలపుంతకు, మన పొరుగున ఉన్న మరో పాలపుంతకు మధ్య దూరం 1,55,000 కాంతి సంవత్సరాలు. ఆ పాల పుంత వెడల్పు 40,000 కాంతి సంవత్సరాలు. దాన్ని చేరుకోవడానికి 2 మిలియన్ల కాంతి సంవత్సరాలు పడుతుంది.

కాలుష్యం లేని ఒక ప్రాంతంలో చాలా ఎత్తున ఉన్న ఒక కొండ మీదికి ఎక్కి ఆకాశంలోకి దృష్టిని సారిస్తే కనిపించే **'విశ్వరూపం'** ఎంత అద్భుతంగా ఉంటుందో, మరో గెలాక్సీలో ఎత్తయిన ప్రదేశం నుండి వీక్షించినా కూడా విశ్వం అలాగే కనిపిస్తుంది. విశ్వవీక్షణం కోసం భూమి నుండి అంతరిక్షంలో అంతంత దూరం వెళ్లే అవసరం లేదు. ఒక ప్రత్యేక గ్రహాన్ని పరిశీలించేందుకు, విశ్వమర్మాలను కనుగొనేందుకు అంతరిక్షప్రమాణాలు అవసరమైనవి. విశ్వంలోని నక్షత్రాలన్నింటినీ ఒక్కొక్కటి చొప్పున లెక్క కట్టారో లేదో గానీ దాదాపు **'27,000 లక్షల కోట్ల నక్షత్రాలు'** ఉండవచ్చునన్నది మాత్రం చూచాయగా నిర్ధారించబడినది.

విశ్వంలోని గ్రహ నక్షత్రాల గతి, గమనాలకు సూక్ష్మమైన బిందువులోని అణుకణాల గతి, గమనాలకు సారూప్యత ఉంది. బిందు సందర్శనంలో కనిపించే లెక్కలేనన్ని వెలుతురు కణాలను లెక్కించారో లేదో కాని.. **'విశ్వదర్శనం'లో 'బిందు దర్శనం'లో...** ఇన్ని సారూప్యాలున్నాయి. ఆవెలుగు కణాల సంఖ్య కూడా 27,000 లక్షల కోట్లు అయితే ఆశ్చర్యపోనవసరం లేదు. **'బ్రహ్మాండాన్ని కుదించి'** చూసినా, ఒక **'అణువుని విస్తరింపజేసి'** చూపినా కనిపించే **'కాంతి చిత్రం'** ఒక్కటే! కానీ అత్యంత ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే, మన దేహంలోని కణాల సంఖ్య కూడా అదే! 27,000 లక్షల కోట్లు (ఒక యోగి ఆత్మకథ!). ఆ విస్మయం నుండి తేరుకోకుండానే మనం ఎక్కడో, ఎప్పుడో చదివి మెదడులో నిక్షిప్తమైపోయిన భావం ఒకటి జ్ఞాపకాల అట్టడుగు పొరల్లో నుండి స్మృతి పథంలోకి దూసుకు వస్తుంది.

**వచ్చేవారం... 'విశ్వం నిండా గోచరమయ్యేది ఏమిటి? దీనికి వాస్తుకు ఉన్న సంబంధం ఏమిటి?'**



మధుబాబు ⑤

# స్టార్ ఫైటర్

అనబడే ఫైటింగ్ ఫూల్

**'మేడమ్..... ఆలస్యం చేస్తే ఇక్కడే సమాధి అయిపోవటం జరుగుతుంది' ఏదోఒకటి ఆలోచించి ముందు మీరు తప్పించుకోండి' బిగ్గరగా అరిచాడు డ్రైవర్.**

**అప్పటికే తొడల వరకూ దిగబడిపోయాడు అతను ఆ బురదలో... రెండువంతుల వరకూ క్రిందికి వెళ్ళిపోయింది కారు. చిక్కటి బురద తెరచి ఉన్న డోర్స్‌లో నుంచి కారు లోపలి భాగంలోకి ప్రవేశిస్తోంది.**

**చల్లటిగాలి వీస్తోంది చాలాగట్టిగా. అంత చల్లటి వాతావరణంలో కూడా చెమటలతో తడిసి పోయింది మిచిషీ ముఖం.**

'నొక్కు... హారన్‌ని గట్టిగా నొక్కు...' మరో రెండు నిమిషాలు తాత్సారంచేస్తే ఆ పని చేయటానికి కూడా అవకాశం ఉండదని అర్థమై బిగ్గరగా అరిచింది తను కూడా.

గురగురమంటూనే ఉన్నది ఇంజన్. బురద దెబ్బకి ఏ క్షణంలోనైనా ఆగిపోవచ్చు అది. బ్యాటరీ కూడా పనికి రాకుండా పోవచ్చు.

ఎగసుకువస్తున్న భయాందోళనలను ఎంతో ప్రయత్నం మీద బిగపట్టుకుంటూ, లోపలికి చేతిని జాచి స్టీరింగ్ మధ్యలో ఉన్న ఒక బుడిపెను బలంగా అదిమాడు డ్రైవర్.

చెవులు చిల్లులు పడేటట్లు మోగటం మొదలు పెట్టింది హారన్.

***

గోతిలో నుంచి తీసి గంగారాం అందించిన వస్తువును చూడగానే వయసు మళ్ళిపోతున్న పెద్దావిడ కరెంట్ షాక్ కొట్టినట్టు వెనక్కి విరుచుకుపడి పోతుందని గ్రహించి, చేతుల్ని జాచి ఆమెను పట్టుకున్న షాడో పెదవుల మీద ప్రత్యక్షం అయింది చిరునవ్వు.

'కంగారుపడకు తల్లీ... భయపడవలసిన అవసరం ఏమీలేదు' అంటూ ఆమెను అతి జాగ్రత్తగా క్రింద కూర్చోబెట్టాడు.

పట్టెడు లావున్న మానవ కపాలం అది. కళ్ళు ఉండవలసిన చోటులో రెండు రంధ్రాలు... నాసిక స్థానంలో ఇంకో పెద్ద రంధ్రం... చూసీచూడగానే ఒళ్ళు జలదరించే పరిస్థితి.

దుమ్ముధూళితో నిండి ఉన్న దాని నుదుటి చుట్టూ మెలికలు తిరిగి కనిపిస్తోంది మందపాటి బంగారు రేకు. సూర్యుడు అస్తమించిన తర్వాత ఆ ప్రదేశాన్ని చుట్టుముడుతున్న చీకట్లలో కూడా తళతళ మెరిసిపోతూ కనిపిస్తున్నాయి బటానీ గింజల సైజులో ఉన్న మరకత మాణిక్యాలు.

'వీడు ఎవడోగాని, ఇక్కడికి వచ్చిన సైనికుల మీద అధికారం చెలాయించే సేనాపతో, దళపతో అయి ఉంటాడు. వాడి ఒంటిమీద ఉన్న సంపదతో ఇటువంటి బురదనేలలు ఇంకో నాలుగింటిని తేలికగా ఖరీదు చేసేయొచ్చు' అంటూ ఇంకో రెండు పెద్ద పెద్ద ఎముకల్ని బయటికి విసిరాడు గంగారాం.

ముంజేతికి సంబంధించినవి అవి. బరువైన కంకణాలున్నాయి.... అవి కూడా వజ్రవైడూర్యాలతో అలంకరించబడి ఉన్నాయి.

'చాల్లే గంగూ.... ఎప్పుడో ఏనాడో మరణించిన వారి ప్రశాంతతను భగ్నం చేయడం పద్ధతిగా ఉండదు' సిగరెట్ కాల్చుకోవాలన్న కోరిక క్షణక్షణానికి అధికం అయిపోతుండగా, చిరాకుగా అన్నాడు షాడో.

'అప్పుడే ఏమయింది గురూ. ఆవగింజలో అర వయ్యోవంతు కూడా నువ్వు చూడలేదు' అంటూ నవరత్న ఖచితమైన ఒక పొడుగాటి వస్తువును బయటికి విసిరాడు గంగారాం.

భూస్థాపితమై ఎన్నో వందల సంవత్సరాలు గడిచిపోయినందువల్ల కాబోలు – బురద నేల దెబ్బకు అక్కడక్కడా చిల్లులు పడి ఉన్నాయి ఆ వస్తువు మీద. ఆ చిల్లులలో నుంచి షాడోకి కనిపించింది వెంట్రుకను కూడా మధ్యకు చీల్చేంత పదును మీద ఉన్న ఒక మహాఖడ్గం.

'హాంకాంగ్ తీసుకుపోయి నడిబజార్లో వేలానికి పెడితే, ఎంతలేదని అనుకున్నా మూడు లక్షల ధర పలుకుతుంది. మింగ్ చక్రవర్తుల కాలం నాటిదని నిరూపించగలిగితే ఇంకో రెండు లక్షలు కళ్ళు మూసుకుని వచ్చేస్తయ్...' అంటూ గోతి అంచులు పట్టుకుని బయటికి వచ్చాడు గంగారాం. ఈసారి అతని చేతుల్లో ఉన్నది ఆషామాషీ వస్తువు కాదు, ఏడు అడుగుల పొడవున్న పెద్ద బరిశె.



నేలమీద చతికిలబడిన పెద్దమ్మ నోటివెంట మాటలు రావటం లేదు. అంతకుముందు ఏ కపాలాన్ని చూసి తాను భయపడిందో, ఇప్పుడు దాన్నే మరింత గట్టిగా పట్టుకుని గుండెలకు అదుముకుంటోంది.

అటుపక్కకు తిరిగి తన బిడ్డకు చనుబాలు ఇస్తున్న షాన్‌సూ భార్యకు కూడా అంటుకుంది ఆమె ఆశ్చర్యం. బిడ్డను అలాగే తన గుండెలకు హత్తుకుంటూ గోతి దగ్గరికి వచ్చి నిలబడింది.

'ఒక సమస్యను చాలా తేలికగా పరిష్కరించే శాము గురూ' తన తలను మలిన పరుస్తున్న మట్టిని దులుపుకుంటూ అన్నాడు గంగారాం.

'ఏమిటీ సమస్య?' అడిగాడు షాడో.

'ఆర్థిక సమస్య... ఈ పెద్దమ్మని, ఈ బాలింతరాలిని పోషించడం ఎలాగో తెలియక తల పగుల గొట్టుకుంటున్నాను. ఇంకో పది తరాల వరకూ వీళ్ళు ఎవరినీ లెక్కచేయాల్సిన అవసరం లేదు. ఆ హుహుగాడి వంటి ఎదవల దగ్గర వెట్టిచాకిరీ చేయవలసిన అగత్యం కూడా లేదు' తను బయటపడేసిన వస్తువులన్నిటినీ, షాన్‌సూ భార్య పాదాల దగ్గరికి నెడుతూ అన్నాడు గంగారాం.

'అసలు మనిషి ఆ హుహుగాడి దెబ్బకు తల

క్రిందులై ఎక్కడో ఊచలు లెక్కపెడుతున్నాడు. అతను లేకుండా వాళ్ళు ఈ సంపదను అనుభవించటం తేలికకాదు' సాలోచనగా అన్నాడు షాడో.

'చూద్దాం గురూ... నెమ్మదినెమ్మదిగా చూద్దాం. ఉన్న సమస్యలన్నిటినీ ఒకేసారి సాల్వ్ చేయడం దేవుడికి కూడా సాధ్యపడదు. ఒకదాని తర్వాత ఒకటి...' అన్నాడు గంగారాం. అంటూనే అంతకు ముందు షాడో అవతలకు విసిరేసిన పాము తిరిగి తనను వెతుక్కుంటూ వచ్చినట్టు అదిరిపడ్డాడు.

సిగరెట్ మాదిరి నోట్లో పెట్టుకుని సంతోషించడం కోసం ఏదైనా వస్తువు కనిపిస్తుందేమోనని చుట్టూ చూస్తున్న షాడో ఒళ్ళు కూడా ఝల్లుమంది.

కపాలాన్ని గట్టిగా పట్టుకు కూర్చున్న పెద్దమ్మ కూడా కంగారుగా దాన్ని వదిలేసి గావురుమని అరవబోయింది.

చటుక్కున చేతిని జాచి ఆమె నోటిని అదిమాడు గంగారాం. 'అరవకు పెద్దమ్మ... అరిచి మనం ఎక్కడ ఉన్నదీ అందరికీ తేటతెల్లం చేయబోకు' అంటూ షాడో వైపు చూశాడు.

అలలు అలలుగా వినవస్తూనే ఉన్నది వారిని చెదరగొట్టిన శబ్దం.

'ఈ పోలీస్‌గాళ్ళు మనల్ని వదిలిపెట్టేటట్టు లేరు. అది వాళ్ళు చేస్తున్న శబ్దమే. దూరంలో ఉన్న వాళ్ళందర్నీ హెచ్చరించటం కోసం హారన్‌ని మోగిస్తున్నారు' అన్నాడు అతను.

ఆపైన ఆగలేకపోయాడు షాడో. జేబులో ఉన్న ఆఖరి సిగరెట్‌ని తీసి లైటర్‌తో వెలిగించుకుని, గుండెల నిండా పొగను పీల్చి, నెమ్మదిగా బయటికి వదిలాడు.

'అవతల ఆ దొంగనాయాళ్ళు మనల్ని గమనించి, అందరినీ ఎలర్ట్ చేయటానికి అలా కారు హారన్‌ని మోగిస్తుంటే నీకు వినిపించటం లేదా? తాపీగా సిగరెట్టు కాల్చుకుంటున్నావా?' కచ్చగా అడిగాడు గంగారాం.

కనులు చిట్లించి ఒకేసారి చూశాడు షాడో అతనికేసి. చటుక్కున తన చేతిని ఎత్తి నోటికి గట్టిగా అదుముకున్నాడు గంగారాం.

'సమ్‌థింగ్ ఈజ్ రాంగ్ హియర్. తమ జనాన్ని ఎలర్ట్ చేయటానికి వాళ్ళు హారన్‌ని మోగించరు. ఆ శబ్దం మనకి కూడా వినిపిస్తుందని, మనం కూడా ముందు జాగ్రత్తలు తీసుకుంటామని తెలుసుకోలేని

## జరిగిన కథ

జపాన్ వెళ్ళి, కుంగ్‌ఫూ విద్యాపీఠంలో చేరిన షాడో, ఫ్యుజీశాన్‌కు శత్రువుగా మారతాడు. అక్కడి నుంచి తన స్నేహితుడు గంగారాంతో కలిసి హాంకాంగ్ సిటీ కాంటన్ చేరుకుంటాడు. షాన్‌సూ భార్యను రక్షిస్తాడు. ఆ క్రమంలో హుహుశాన్ మనుషులతో గొడవపడతాడు. షాడోని వెతుకుతూ బయలుదేరతారు మిచిషీ, ఫ్యుజీశాన్. బురదనేలల వైపు వెళ్ళాడని తెలుసుకుని అటువైపు వెళతారు. మిచిషీ కారు ఊబిలో దిగబడుతుంది.

ఆ తర్వాత...

మూర్ఖులు కారు వాళ్ళు. కారణం ఏదో ఉంది' అంటూ మూడే మూడు పీల్పులతో సిగరెట్‌ని ఫినిష్ చేసి అవతలకు విసిరేశాడు షాడో.

'కమాన్ లెటజ్ గో' అంటూ మట్టిగుట్ట మీది నించి బురదలోకి అడుగుపెట్టాడు.

'జాగ్రత్తగా కూర్చోండి పెద్దమ్మా... ఇట్లా పోయి అట్లా వచ్చేస్తాం. పాపాయికి చలి ఎక్కువ అయితే నేను తవ్విన ఈ గోతిలోకి దిగి కూర్చోండి. ఎముకలు బొమికలు ఉన్నాయ్. కంగారు పడాల్సిన అవసరం లేదు. వెచ్చగా ఉంటుంది' అంటూ తను ఆఖరిగా బయటికి తీసిన బరిశెను పట్టుకుని షాడో వెనుకే బురదలోకి దిగాడు గంగారాం.

***

మెత్తటి మైదాపిండి వంటి పౌడర్ జల్లిన సర్ఫేస్ మీద నీటిబొట్టు ఎలా దొర్లుకుంటూ పోతుందో, సరిగ్గా అలాగే మెత్తటి బురద మీద అలవోకగా జారుతూ వేగంగా పోతున్న ఫ్యుజీశాన్ కూడా ఉన్నట్టుండి ఆగిపోయాడు.

వేగం మందగించిన మరుక్షణం మోకాళ్ళ వరకు దిగబడిపోయాడు బురదలో.

చెవులు చిల్లులు పడే స్థాయిలో వినబడవలసిన హారన్ శబ్దం, దూరం అధికం అవటం వల్ల, అతి నెమ్మదిగా అలలు అలలుగా వినవస్తోంది.

'నాకు తెలుసు. నాకు మీ సహకారంతో అవసరం లేదని అన్నందుకు మీరు సహాయ నిరాకరణ మొదలుపెట్టారు. కుంగ్‌ఫూ వస్తాదు వస్తున్నాడని ముందుగా పోయిన మీ వాళ్ళకి హెచ్చరికలు పంపుతున్నారు. నేను మనసు కష్టపెట్టుకుని మీ దారికి వస్తానని అనుకోకండి. ఎప్పటికీ జరగని పని అది'. నాసికాపుటాలు విస్తరిస్తుండగా కచ్చనిండిన కంఠంతో తన చుట్టూ ఆ పోలీసు అధికారులు ఉన్నట్టే భావించుకుంటూ చెప్పాడు.

'ఇటువంటి చిన్నచిన్న ఎత్తులు నన్ను నా కర్తవ్యం నుంచి దూరంగా పంపించలేవు. నా వేగాన్ని అవి తగ్గించలేవు' ఫైనల్‌గా మరో మాటచెప్పి, మరో



సారి ముందుకు కదలబోయాడు.

చిక్కటి తుమ్మజిగురు మాదిరి అతని పాదాలను అంటుకుని, అతని కదలికను నిరోధించింది క్రింద ఉన్న బురద. మరో మూడు అంగుళాలు లోపలికి దిగబడ్డాయి అతని పాదాలు.

గుండెల నిండా ఊపిరి పీల్చుకుని, తన నాభి స్థానంలో నిక్షిప్తమై ఉండే ఆత్మశక్తి మీద కాన్‌సన్‌ట్రేట్ చేశాడు ఫ్యుజీశాన్. ఉన్నట్లుండి వెలువడింది చిన్నశబ్దం అతని నోటి నుంచి.

ఉండేలు బద్దలో నుంచి వేగంగా వెలువడే మట్టివుండ మాదిరి మహాస్పీడుగా గాలిలోకి లేచాడు అతను. తను దిగబడిపోయిన ప్రదేశానికి పదిగజాల దూరంలో తిరిగి బురదను తాకాడు. తాకుతూనే తిరిగి గాలిలోకి లేచాడు. ఈసారి ఇరవై గజాల దూరం వెళ్ళిపోయాడు. రెండే రెండు మార్లు అలా గెంతి, గాలి వాలున కారు హారన్ శబ్దం వినబడకముందు ఎలా ప్రయాణం కొనసాగిస్తున్నాడో, అలాగే ముందుకు వెళ్ళిపోయాడు.

***

'జాగ్రత్త గురూ... చిక్కబడుతోంది బురద. కాళ్ళను పట్టుకుందంటే వదిలిపెట్టదు. బంక మాదిరి చుట్టుకుంటుంది. లోపలికి లాగేసుకుంటుంది' బరిశె మొనను క్రిందికి అదిమి, అతి జాగ్రత్తగా అడుగులు వేస్తూ షాడోని హెచ్చరించాడు గంగారాం.

'అదిగో... అటు చూడు...' ఉన్నట్లుండి చెప్పాడు షాడో.

అటుచూసిన గంగారాం కళ్ళకి కనిపించింది హెడ్‌లైట్ల వెలుగులో చుట్టూ ఉన్న ప్రదేశాన్ని కాంతిమంతం చేస్తున్న ఒక కారు.

ముందు భాగంలో నడుము వరకూ దిగబడిపోయిన డ్రైవర్ కూడా కనిపించాడు.

'అతను ఒక్కడే కాదు... అవతలి పక్కన ఇంకా ఎవరో ఉన్నారు. ఆ కారు పని అయిపోయింది' ఒకే ఒక్క చూపుతో అక్కడి పరిస్థితి మొత్తాన్ని అర్థం చేసుకుంటూ చెప్పాడు గంగారాం.

అతని మాటలు పూర్తి అవటం, అతను ప్రిడిక్ట్ చేసినట్టు జరగటం ఒకేసారి జరిగిపోయింది. తుపుక్కున ఆరిపోయాయి హెడ్‌లైట్లు. ఆగి ఆగి మరో రెండు సార్లు మోగి, తనుకూడా మూగ బోయింది హారన్.

బరిశె మొనతో బురద గట్టితనాన్ని టెస్ట్‌చేస్తూ అతి జాగ్రత్తగా అడుగులు వేయాలని అంతకు ముందే షాడోని హెచ్చరించిన మాటను మర్చిపోయినట్టు మహావేగంగా ముందుకు దూకాడు అతను.

'ఆగు గంగూ, ఆగిపో... ఆత్రం వద్దు' అంటూ ఆపటానికి ప్రయత్నం చేశాడు షాడో.

'కారు మునిగిపోతోంది. కారుతో పాటు వాళ్ళెవరో కానీ సజీవసమాధి అయిపోతారు..' అంటూ మరింత వేగంగా పరిగెత్తబోయి, తుపుక్కున తను కూడా దిగబడిపోయాడు అతను.

అడుగులో అడుగు వేసుకుంటూ వచ్చి నాలుగు అడుగుల దూరంలో నిలబడి తన చేతిని అతనికి అందించాడు షాడో.

## కన్యాశుల్కం–విశ్వసాహిత్యంలో స్థానం




"కన్యాశుల్కం" పూర్తిగా సన్నివేశాలకంటే సంభాషణల మీద ఆధారపడిన నాటకం. సంభాషణలు మనల్ని ఆకర్షించినంతగా (ఒకటి రెండు మినహాయించి) సన్నివేశాలు మనల్ని ఆకర్షించవు. అందులోనూ ప్రదర్శన సాధ్యంకాని సన్నివేశాలు చాలా ఉన్నాయి.

పాత్రీకరణలో, భాషలో, సమస్యలో' ఇతివృత్తంలో ఈ నాటకం ఒక ప్రాంతానికి ఒదిగి ఉండిపోవడం చేత విశ్వసాహిత్యం స్థాయికి ఎదగలేకపోయింది" అని 'సాహిత్యకౌముది'లో గుంటూరు శేషేంద్ర శర్మ పేర్కొన్నారు.

**సేకరణ: ఎన్. తారకరామారావు**

'అవతలి వాళ్ళను కాపాడాలని అనుకోవటం చాలా మంచి ఆలోచనే? కాని ఆ పని చేయటానికి నువ్వు వాళ్ళని కాపాడగల స్థితిలో ఉండాలి. వాళ్ళ కంటే ముందుగా నువ్వే తల్లక్రిందులు అయిపోతే, నిన్ను కాపాడేది ఎవరు?' బయటికి లాగి అడిగాడు.

'నువ్వున్నావుగా గురూ... నువ్వు నా పక్కన ఉంటే నాకు ఏమీ జరగదు' ముక్తసరిగా చెప్పి మళ్ళీ వేగంగా కదిలాడు గంగారాం.

'రోజురోజుకి నీకు చాదస్తం ఎక్కువైపోతోంది... నిన్ను భరించటం కష్టం' తనలో తను అనుకుంటూ అతన్ని అనుసరించాడు షాడో.

***

తను కూడా నడుము వరకూ దిగబడిపోయింది మిచిషీ. అంతకుముందు వరకూ ఎంతో కొంత ఆధారంగా నిలిచిన తన వెహికల్ ఏ క్షణంలోనైనా కనిపించకుండా వెళ్ళిపోతుందని అర్థమయ్యేసరికి, బరువెక్కాయి ఆమె గుండెలు.

ఒంటరి మనిషి తను. మొగుడు మొద్దులు పిల్లలు ఎవరూలేని ఫ్రీబర్డ్. తన డ్రైవర్ మాత్రం అలాకాదు. భార్యాపిల్లలు ఉన్నారు అతనికి. అతని మీద ఆధారపడుతున్న ముసలి తల్లిదండ్రులున్నారు. దిక్కుదివాణం లేనట్టు ఆ బురద నేలకు బలి అయిపోవటం నిజంగా దారుణం.

'ఋషిడో వస్తాదుకు ఒక విచిత్రమైన శక్తి ఉండేదని కుంగ్‌ఫూ విద్యాపీఠంలో చెప్పుకునే వారు. తన తల్లి, తాత ఆపదలో ఉన్నవారు ఎవరైనా తనను తలుచుకుని గట్టిగా ఒక కేకపెడితే ఎంత దూరంలో ఉన్నా కూడా వినిపిస్తుందట అతనికి. వెంటనే వచ్చి ఆదుకునేవాడు..' వెన్నెల రాత్రిలో ఒళ్ళో కూర్చోబెట్టుకుని తన తాత చెప్పిన మాటలు వెంటనే గుర్తుకు వచ్చాయి ఆమెకి.

కేకపెట్టిన దానికంటే వంద రెట్లు పెద్దగా వినిపించేటట్టు కారు హారన్‌ని మోగించింది తను. వినిపించకుండా ఉంటుందా?

ఆ మాట మనసులో మెదిలిన మరుక్షణం తన పిచ్చి ఆలోచనల్ని తలుచుకుని తనలో తనే నవ్వుకున్నది ఆమె, అంత ప్రమాదకరమైన పరిస్థితిలో కూడా.

వందల సంవత్సరాల క్రితం ఉండేవాడు ఆ ఋషిడో. మరణించి మట్టిలో కలిసిపోయి దశాబ్దాల మీద దశాబ్దాలు గడిచిపోయాయి.

తనను చూసి తలవంచి నమస్కరించకపోతే, జెముడుకాకి మాదిరి ముఖం ముడుచుకునే అహంకారపూరితులు ఇప్పుడు ఋషిడో స్థానంలో కుంగ్‌ఫూ విద్యాపీఠంలోకి ప్రవేశించారు. ఇక ఎక్కడి నుంచి అందుతుంది తమకు సహాయం?

తనకు తెలియకుండానే కొంచెం పక్కకు జరగటానికి ప్రయత్నించి, వెంటనే వక్షోజాల వరకూ క్రిందికి వెళ్ళిపోయింది ఆమె.

తను ఇంటికి వెళ్ళి తన తాతకు ఎటువంటి వర్తమానం పంపిస్తుందోనని ఆత్రంగా ఎదురు చూస్తూ ఉండే చిలకలు కళ్ళ ముందు మెదిలాయి ఆమెకు.

'రాలేక పోతున్నాను. ఇక మీదట మీకు కనిపించని, కనిపించలేని లోకాలకు వెళ్ళిపోతున్నాను' అనుకుంటూ కళ్ళను గట్టిగా మూసుకున్నది.

ఆమె భుజాల మీది నుంచి కొంచెంగా ముందుకు జరిగి మృదువుగా బుగ్గను తడిమింది చల్లటి కర్రపుల్ల వంటి వస్తువు.

బురదలో సంచరించే విషసర్పం ఏదో తన మీదికి వచ్చేసిందని భ్రమపడి కళ్ళు తెరిచింది ఆమె.

స్పష్టంగా కనిపించలేదు చీకటి మూలంగా... కాని, కొంచెం గట్టిగానే ఆమె బుగ్గని తడిమింది ఆ వస్తువు.

'ఇనుముతో చేసిన బరిశె ఇది... బురద మూలకంగా పట్టుకోవటం కష్టం కావచ్చు. కాని పట్టుకోవాలి' గంభీరంగా వినవచ్చింది ఒక కంఠం.

**ఊబిలో నడుము వరకూ దిగబడిపోయింది మిచిషీ. బయటపడటానికి ఎటువంటి ఆధారమూ కనిపించడం లేదు. తాత చెప్పిన మాటలు గుర్తొచ్చాయి. ఋషిడో వస్తాదు గుర్తొచ్చాడు. ఆపదలో ఉన్న వారు కేక పెడితే చాలు.. పరిగెత్తుకుంటూ వచ్చి వారిని రక్షిస్తాడట. మరి ఇప్పుడు తనను రక్షించటానికి ఎవరు వస్తారు? ఇలా ఆలోచనలతో సతమతమవుతున్న ఆమెను రక్షించటానికి ఎవరైనా వచ్చారా?**

ఒక్కసారిగా వదిలిపోయింది మిచిషీని ఆవరించుకుంటున్న నైరాశ్యం. వచ్చేసింది ఆ సహాయం. తను ఋషిడోని తలుచుకున్న మరుక్షణం దయామయులు ఎవరో తన వెనకే ప్రత్యక్షం అయ్యారు తనను కాపాడటం కోసం.

'డ్రైవర్ ఉన్నాడు. అవతలి పక్కన నా డ్రైవర్ దిగబడిపోతున్నాడు. ముందు అతన్ని బయటికి లాగాలి...' జీరపడుతున్న కంఠంతో అభ్యర్థించింది.

'అతని సంగతి మా గురువుగారు చూసుకుంటాడు. ముందు నువ్వు బరిశెను పట్టుకో' కమాండ్ చేసిందా కంఠం.

ఎదురు చెప్పటం మిచిషీకి చేత కాలేదు. బుర

దలో ఉన్న చేతుల్ని అతి ప్రయత్నం మీద పైకి ఎత్తి ఆ బరిశె చివరి భాగాన్ని గట్టిగా పట్టుకుంది.

అదే సమయంలో ఆమె పక్కనుంచి అతి వేగంగా మునిగిపోతున్న కారుమీదికి దూకింది ఇంకో ఆకారం. ఆ అదటుకు మరింతగా దిగబడిపోతున్న కారును గురించి పట్టించుకోకుండా అవతలి పక్కకు వంగి, మెడల దాకా దిగబడిపోయిన డ్రైవర్‌ని అమాంతం పైకి గుంజింది.

ఎంత వేగంతో కారు మీదికి దుమికిందో, అంతకు రెట్టింపు వేగంతో వెనక్కితిరిగి, ఎగిరి పది గజాల దూరంలో పడింది తాను పట్టుకున్న డ్రైవర్‌తో సహా.

***

'నా పని అయిపోయిందనే అనుకున్నాను. సరయిన సమయంలో దేవతల మాదిరి వచ్చి నన్ను, నా డ్రైవర్‌ని కాపాడారు. మీకు శతకోటి ప్రణామాలు.' అసహ్యకరమైన వాసనలు వెదజల్లుతున్న బురదను వదిలించుకోవటానికి ప్రయత్నం చేస్తూ తన ఎదుట ఉన్న లావుపాటి పొట్టిమనిషికి చెప్పింది మిచిషీ, అరగంట తరువాత.

'మీ కారు ఇంక మీకు కనపడదు. పూర్తిగా దిగబడిపోయింది' అన్నాడు ఆ పొట్టిమనిషి.

'మరేం ఫరవాలేదు. మాకు కార్లు, విమానాల కంటే మనుష్యుల ప్రాణాలు ముఖ్యం. మా డ్రైవర్ లేచి నిలబడితే నేను ఇంకా ఎక్కువగా సంతోషిస్తాను' అంటూ పక్కకు చూసింది ఆమె.

చీలమండల వరకూ దిగబడే బురదలో వెల్లకిలా పడుకోబెట్టబడి ఉన్నాడు డ్రైవర్. అతనికి తెలివి తెప్పించటానికి శక్తివంచన లేకుండా ప్రయత్నం చేస్తున్నాడు పొట్టిమనిషితో పాటు వచ్చిన యువకుడు.

'సమస్య ఏమిటి గురూ?' అతన్ని అడిగాడు పొట్టిమనిషి.

'భయం... ప్రాణాలు పోతున్నాయన్న భయంతో తెలివి తప్పినట్టుంది' తన ప్రయత్నాలు మానకుండా చెప్పాడు యువకుడు.

'అయితే నన్ను ప్రయత్నం చేయమంటావా?' అంటూ మిచిషీకి అర్థం కాని విధంగా నోటిని విశాలంగా తెరిచాడు పొట్టిమనిషి.

'నోరు మూసేయ్... పిడుక్కి బియ్యానికి ఒకే మంత్రం పనికిరాదు' విసురుగా అన్నాడు యువకుడు.

'వారి భావాలు మిచిషీకి తెలుస్తూనే ఉన్నాయ్. వారి మాటలు తెలియటం లేదు. 'మీరు ఎవరు? ఏ దేశం మీది?' సూటిగా అడిగేసింది.

'అయ్యో తల్లీ ఏం చెప్పమంటావ్? మాది ఒక పెద్ద దీనగాథ. మొత్తం చెప్పాలంటే మూడు నెలలు పడుతుంది. మూడు ముక్కల్లో చెప్పటానికి పావు నిమిషం చాలు' అన్నాడు పొట్టిమనిషి.

'ఏదో ఒక విధంగా చెప్పు.... వింటాను' అన్నది మిచిషీ.

'నాకు ఈ కుర్రాడికి ఒక సోదరి. మా బావమరిదికి బోటు మీద సముద్రంలో సరుకులు రవాణా చేసే ఉద్యోగం. ఏదో తేడావచ్చింది. బోటు యజమాని అతన్ని పోలీసులకు పట్టించాడు. అక్కడితో ఆగకుండా ఇంటిమీదపడి రచ్చ చేయమని మనుష్యుల్ని



వ్యాపారవేత్తగా
నటుడిగా
బాధ్యతగల భర్తగా
ఆదరాభిమానాలుగల తండ్రిగా
రాజకీయనాయకుడిగా
ఆయన జీవితం పరిపూర్ణం.
ఆ పరిపూర్ణజీవిత ప్రస్థానమే

# ఓ వారాలబ్బాయి జయభేరి

**మురళీమోహన్ జీవితాలాపన**

డా.చల్లా భాగ్యలక్ష్మి అక్షరార్చన

**వచ్చేవారమే ప్రారంభం**

పంపించాడు. నిండు చూలాలు మా సోదరి. కడుపులో బిడ్డ అడ్డం తిరిగింది. బోటు యజమానికి భయపడి లోపలికి రానీయలేదు డాక్టర్లు. పారిపోయి వస్తుంటే పోలీసులు వెంటపడ్డారు. ఇక్కడికి వచ్చి తల దాచుకున్నాము' కనురెప్ప కూడా కదిలించకుండా కథ చెప్పాడు పొట్టిమనిషి.

అర్థం అయిపోయింది మిచిషీకి. 'మీ సోదరికి కాన్పు జరిగిపోయింది కదా..' అన్నది తను కూడా ఏమి ఎరుగనట్టు.

'పాపాయి పుట్టింది. మా బావమరిది అదృష్టవంతుడు. సంపదలకు రాణి అయిన సుచిషీ దేవత కరుణించింది' హుషారుగా అన్నాడు పొట్టిమనిషి.

'మీ బావమరిదిని పోలీసులు వదిలి పెట్టారా?' అడిగింది మిచిషీ.

'అబ్బే... కాంటన్ నగరంలో ఉన్న పోలీసులకు స్వంతంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవటం చేతకాదు. ఆ మరబోటు యజమాని అడుగులకు మడుగులు ఒత్తే రకం. వదిలిపెట్టలేదు' అన్నాడు పొట్టిమనిషి.

'నువ్వు వాగుడు కట్టేస్తావా లేదా?' డ్రైవర్ బుగ్గల్ని తడుతున్న యువకుడు ఉన్నట్టుండి కోరగా అడిగాడు.

'కట్టేయకపోతే నువ్వు వచ్చి కట్టేస్తావా?' తాచుపాము మాదిరి తల తిప్పిచూస్తూ అడిగాడు పొట్టిమనిషి.

'నేను రావాల్సిన అవసరం లేదు... ఆ మేడమ్ కాంటన్ నగర పోలీసులకు చెందిన మనిషే. తనే నీ బుర్ర రామకీర్తన పాడించి నోరు మూయిస్తుంది' అన్నాడు యువకుడు.

'ఏమ్మా.... చీకట్లో సరిగ్గా కనిపించటం లేదు. నిజంగా నువ్వు పోలీసు మేడమ్‌వేనా?' అమాయకంగా అడిగాడు పొట్టిమనిషి.

తమ పీఠానికి ఏదో అపచారం చేసి పారిపోయి వచ్చిన వారిని అనామకులు అంటూనే, వారిని పట్టుకోవడానికి ఫ్యుజీశాన్ తీవ్రంగా ఎందుకు ప్రయత్నిస్తున్నాడో అవగతమై పోయింది మిచిషీకి.

ఆవులించకుండానే ప్రేవులు లెక్కబెట్టే రకం మాదిరి ఉన్నది వారిద్దరి వాలకం. అవసరం అయితే ఎంతకైనా తెగించగల ధైర్యం వారి కదలికల్లో కనిపిస్తోంది.

'శభాష్...శభాష్... నిజంగా మనం చాలా అదృష్టవంతులం' ఉన్నట్లుండి ఆ యువకుడు కామెంట్ చేయటంతో, ఆశ్చర్యంగా అటు చూసింది మిచిషీ.

ఇంకా తెలివిలోకి రాని డ్రైవర్ పాంటు జేబులో నుంచి, బురదలోని చెమ్మ తగిలి నాశనం అయిపోవటానికి సిద్ధంగా ఉన్న సిగరెట్ పాకెట్‌ని బయటికి తీశాడు అతను.

అందులో నుంచి సగం తడిసిన సిగరెట్‌ని తన లైటర్‌తో వెలిగించుకుని గుండెల నిండా పొగను పీల్చుకున్నాడు.

'నీ పాడు అలవాటు ఎప్పుడో మనకొంపల్ని ముంచుతుంది. అనుమతి లేకుండా అవతలి వాళ్ళ సిగరెట్లు తీసుకోవటం, అందులోను ఒక పోలీసు మనిషి దగ్గర్నించి... చాలా తప్పు. మేడమ్‌కి కోపం వస్తే అరెస్టుచేసి మన బావమరిదిని కూర్చోబెట్టిన గదిలోనే కూర్చో బెడుతుంది. అప్పుడు నీ తిక్క వదిలిపోతుంది' కోపంగా అన్నాడు పొట్టిమనిషి.

ఎందుకో తెలియదు గాని, మిచిషీకి మళ్ళీ గుర్తుకువచ్చాయి తన తాత మాటలు.

'పాదరసం మాదిరిగా నిశ్శబ్దంగా కదులుతాట్ట ఋషిడో వస్తాడు. ఈదురుగాలి మాదిరి చాలా వేగంగా సంచరిస్తూ ఉంటాట్ట. కాళ్ళు చేతులు కట్టేసి చిన్‌చున్ నదిలో పడేసినా, పది క్షణాల్లో ఆ కట్లు

విప్పుకుని నీటికి ఎదురు ఈదుకుంటూ వచ్చేస్తాట్ట..'

తన ఎదుట ఉన్న ఇద్దరికీ తన తాత చెపుతున్న ఋషిడో వస్తాదుకు గానీ, కుంగ్‌ఫూ విద్యా పీఠానికి గానీ ఏమైనా సంబంధం ఉన్నదో లేదో మిచిషీకి తెలియలేదు. కాని వారి వాలకం చూస్తున్న కొద్దీ ఏదో అనుమానం ఆమెను ఎగ్జయిట్ చేయటం మొదలు పెట్టింది.

బావమరిది బావమరిది అంటూ పొట్టిమనిషి చెపుతున్నది మాత్రం ఖచ్చితంగా షాన్‌సూనే సూచిస్తోంది. మరబోటు యజమాని డెఫినెట్‌గా హుహు శాన్ సారే అయి ఉంటాడు.

అంతకుముందు కాంటన్ నగరంలో ఏ పోలీస్ అధికారి చెయ్యని ఒక విచిత్రమైన ఆలోచన ఆమె మనసులోకి ఎంటర్ అయింది. వెంటనే ఆచరణలో పెట్టటానికి నిర్ణయం తీసుకున్నది.

'మా ప్రాణాలు కాపాడి మాకు పూజనీయులు అయినారు. మా ఇంటికి వచ్చి మా ఆతిథ్యం స్వీకరిస్తే మేము సంతోషిస్తాము' అన్నది.

అమాంతంగా నోరు తెరిచి ఆశ్చర్యం నటించాడు పొట్టిమనిషి. 'తల్లీ నువ్వు మాట్లాడుతున్నది ఏమిటో నీకు అర్థం అవుతున్నదా?' అని అడిగాడు.

'అర్థం కాకపోవటానికి ఏముంది?' అడిగింది ఆమె కూడా.

'నీకు కనిపిస్తున్నది మేము ఇద్దరిమే. మా సోదరి, మా పెద్దమ్మ, మా పాపాయి మొత్తం వచ్చి కూర్చోవాలి. మరబోటు యజమానికి తెలిస్తే వాళ్ళు ఇంకో పాతికమంది వచ్చి ఇంటి ముందు గుమికూడతారు. పోలీసుల మాట వేరే చెప్పాల్సిన అవసరం లేదు' అన్నాడు పొట్టిమనిషి.

'మరేం ఫరవాలేదు. వచ్చి చూడండి. మీకే తెలుస్తుంది' క్షణాలు గడిచినకొద్దీ తను తీసుకున్న నిర్ణయం సరైనదే అనిపిస్తుండగా మరింత నమ్మకంగా చెప్పింది మిచిషీ.

'ఏమంటావు గురూ? నమ్మకంగా తీసుకుపోయి తలస్నానాలు చేయించవచ్చని నీకు ఏమయినా అనిపిస్తోందా?' తన జతగాడిని అడిగాడు పొట్టిమనిషి.

'నువ్వు అదేపనిగా చెపుతూ ఉంటావు ఒక మాట... అదేమిటి?' సిగరెట్ పొగను ఆప్యాయంగా ఎంజాయ్ చేస్తూ అడిగాడు అతను.

'అదే గురూ... రోట్లో తలపెట్టి రోకటి పోటుకు భయపడటం' అన్నాడు పొట్టిమనిషి.

'తను పోలీసుమనిషి.. మాటలు మాత్రం విచిత్రంగా ఉన్నాయ్. తన యూనిఫామ్‌కి ఆ మాటలకి పొంతన కుదరటం లేదు' అన్నాడు జతగాడు.

ఆ భాష ఏమిటో మిచిషీకి కొంచెం కూడా అర్థం కాకపోయినా, వారి చూపుల్ని బట్టి భావాల్ని తేలికగా గ్రహించగలిగింది.

'మీ బావమరిదికి సంబంధించిన బాధలు బరువులు మిమ్మల్ని తరుముకుంటూ వస్తాయని భయపడాల్సిన పనిలేదు. మా తాత మీద ప్రమాణం చేసి చెపుతున్నాను. నిరభ్యంతరంగా రావచ్చు మీరు మా ఇంటికి' అన్నది.

ఆమె ఊహించినట్టే వెంటనే వినవచ్చింది ప్రశ్న.

'ఎవరు మీ తాత?'

ఉప్పొంగి పోయాయి మిచిషీ గుండెలు. తనకు తెలియకుండానే బురదనేలలో నిఠారుగా లేచి నిలబడింది. 'మా తాతా... కుంగ్‌ఫూ విద్యాపీఠంలో తోటమాలిగా పనిచేసి చాలాకాలం క్రితం పదవీ విరమణ చేశాడు' సగర్వంగా చెప్పింది.

'వద్దువద్దని అనుకున్నా వదిలిపెట్టకుండా వెంట వస్తోంది ఈ విద్యాపీఠం. ఏం చేద్దాం గురూ?' జతగాడిని అడిగాడు పొట్టిమనిషి.

'రమ్మని అంటున్నది కదా. పోయిచూద్దాం. ఒక పని అయిపోతుంది. పాపాయికి కొంచెం రక్షణ కావాలి. పసిగుడ్డుని ఆరుబయట తిప్పటం మంచిది కాదు' సాలోచనగా అన్నాడు జతగాడు.

'దారి చూపించు తల్లీ' అంటూ అచేతనంగా పడి ఉన్న డ్రైవర్‌ని అమాంతం తన భుజాల మీదికి ఎత్తుకున్నాడు పొట్టిమనిషి.

అతని జతగాడి వైపు చూసింది మిచిషీ.

'మా సోదరిని వెంటబెట్టుకు వస్తాడు. మనం ముందుగా నడుద్దాము' అంటూ తిరిగి నగరం వైపు నడక మొదలు పెట్టాడు పొట్టిమనిషి.

***

మూడు నాలుగు పనులు ఒకేసారి చేసింది మిచిషీ తల్లి.

ముందుగా పొట్టిమనిషి జతగాడి చేతుల్లో ఉన్న పాపాయిని తాను అందుకుని, మందంగా ఉన్న ఒక పరిశుభ్రమైన వస్త్రంలో చుట్టి మెత్తటి దిళ్ళ మధ్యలో పడుకో బెట్టింది. ముందు గదిలో ఉన్న వాటర్ కూలర్‌లోని చల్లటినీళ్ళను తెచ్చి డ్రైవర్ ముఖం మీద చిలకరించి, లావుపాటి ఉల్లిపాయని గట్టిగా నలిపి అతని నాసిక దగ్గర పెట్టి పట్టుకుంది.

పెద్దగా తుమ్మాడు డ్రైవర్. గబుక్కున కనులు తెరచి లేచి కూర్చున్నాడు. నడిచి నడిచి నీరసంగా ఒక గోడకు ఆనుకుని నిలబడిన పాపాయి తల్లిని ఒక కుర్చీలో కూర్చోబెట్టి, ఆమెకు, ఆమెతోపాటుగా వచ్చిన వృద్ధురాలికి వేడి వేడి బార్లీ జావను తెచ్చి ఇచ్చింది.

'అరగంటలో ఆహారం సిద్ధం అవుతుంది. ఈ లోపల మీరిద్దరూ మీ ఒంటి మీది బురదను వదిలించుకోండి' అని పొట్టిమనిషికి, అతని జతగాడికి చెప్పింది.

'వచ్చావా మిచిషీ? ఆఫీసునుంచి తిరిగి వచ్చావా?' తను కూడా బురదను వదిలించు కోవటానికి బయలుదేరిన మిచిషీని పలుకరించాయి చిలుకలు.

'మీరు ఎలా ఉన్నారు?' ఆప్యాయంగా అడిగింది ఆమె వాటి దగ్గరకి పోతూ.

'అబ్బో... దుర్వాసన... భరించటం బహుకష్టం' దూరంగా జరుగుతూ వెక్కిరించింది ఒక చిలుక.

**(ఇంకా వుంది)**



## తనా పిచ్చిపని చేయదట!

ఈ మాటలు అన్నది కత్తిలాంటి కత్రినా. కత్రినా నోటి వెంట ఇలాంటి మాటలు వింటే కచ్చితంగా అదేదో ప్రేమ వ్యవహారానికి సంబంధించిందే అన్న అనుమానం రాక మానదు. అయితే కత్రినా మాట్లాడింది ప్రేమకు సంబంధించికాదు. సినీ నిర్మాణం గురించి. 'జగ్గా జాసూస్' సినిమా సందర్భంగా నిర్మాత కష్టసుఖాలు తనకు తెలిసి వచ్చాయట! సినీ నిర్మాణం గురించి తెలియకుండా అందులో అడుగు పెడితే నిండా మునగడం తప్ప తేలడం అంటూ ఉండదని అంటోంది. అన్నీ తెలుసుకోకుండా నిర్మాణానికి పూనుకుంటే అంతకన్నా పిచ్చి పని మరొకటి ఉండదనీ, తను మాత్రం అలాంటి పిచ్చిపని చేయననీ చెబుతోంది. అయితే ఆ మాటలు అనుష్క శర్మను ఉద్దేశించే అన్నదంటూ ఓ వార్త బాలీవుడ్‌లో బాగా హల్‌చల్ చేస్తోంది.




**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych),
P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ
ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి


# వెరికోస్ వీన్స్‌కు చికిత్స ఉంది

కొందరు వ్యక్తులను గమనించినట్లయితే కాలి పిక్కల భాగంలో నరాలు మెలిపడిపోయి, ఉబ్బి, నీలం రంగులో కనిపిస్తుంటాయి. ఈ సమస్యను వెరికోస్ వెయిన్స్ అంటారు. సిరలు మెలిపడటం వల్ల ఈ సమస్య ఉత్పన్నమవుతుంది. సాధారణంగా రక్తం ఉపరితల సిరల నుంచి డీప్ వెయిన్స్‌కు, అక్కడ నుంచి గుండెకు సరఫరా అవుతుంది. అయితే ఈ ప్రక్రియ విఫలమైనప్పుడు రక్తం ఉపరితల సిరల్లోనే నిలిచిపోతుంది. ఫలితంగా సిరలు ఉబ్బిపోతాయి. సిరల్లో కవాటాలు ఉంటాయి. ఆ కవాటాల్లో లోపం ఏర్పడినపుడు లేక ఏదైనా అవరోధం ఏర్పడినపుడు ఈ సమస్య తలెత్తుతుంది.

ఎవరిలో ఎక్కువ

ఈ సమస్య వయసు పైబడిన వారిలోనే కనిపిస్తుంది. స్త్రీలలో, స్థూలకాయుల్లో, వ్యాయామం చేయని వారిలో ఎక్కువగా కనిపిస్తుంది. కుటుంబ సభ్యుల్లో ఎవరికైనా ఈ సమస్య ఉంటే పిల్లలకు వచ్చే అవకాశం ఉంటుంది. రక్తనాళాల్లో కొవ్వు ఎక్కువగా పేరుకుపోవడం మూలంగా సిరల్లో రక్తం సాఫీగా ప్రవహించదు. ఫలితంగా వెరికోస్ వెయిన్స్‌కు దారితీస్తుంది. ఎక్కువ సార్లు గర్భం ధరించిన వారిలో ఈ సమస్య కనిపిస్తుంది. ఎక్కువ సేపు నిలబడటం వల్ల కాలి పిక్కల దగ్గర ఉన్న కండరాలు పనిచేయడం మానేస్తాయి. పంపింగ్ మెకానిజం తగ్గి రక్తాన్ని పైకి పంపించలేకపోతుంది. ఫలితంగా వెరికోస్ వెయిన్స్ సమస్య ఉత్పన్నమవుతుంది.

లక్షణాలు ఇలా ఉంటాయి

సిరలు ముదురు నీలం రంగులో, చర్మం కింద ఉబ్బిపోయి, మెలిపడి కనిపిస్తుంటాయి. కాలు బరువుగా ఉంటుంది. కాలి పిక్కల దగ్గర నొప్పి ఉంటుంది. ముఖ్యంగా ఎక్కడైతే వెరికోస్ వెయిన్స్ సమస్య ఉందో అక్కడ నొప్పి ఉంటుంది. నడుస్తున్నప్పుడు నొప్పి తీవ్రత చాలా ఎక్కువగా ఉంటుంది. వెరికోస్ వెయిన్స్ ఉన్న ప్రాంతంలో దురద, చర్మం రంగు మారుతుంది.

హోమియో చికిత్స

చాలా మంది ఈ సమస్యకు చికిత్స లేదని భావిస్తుంటారు. కానీ హోమియో వైద్యంతో ఈ సమస్య సమూలంగా తొలగిపోతుంది. హోమియోలో మూలకారణాన్ని తొలగించే విధంగా చికిత్స ఉంటుంది. కాబట్టి వ్యాధి నుంచి పూర్తిగా విముక్తి లభిస్తుంది.

# హెపటైటిస్, హెర్పిస్‌ల భయం ఇంకెన్నాళ్లు?

**హెపటైటిస్** వల్ల కాలేయ పనితీరు మెల్లగా తగ్గి ప్రాణాంతకంగా మారుతుంది. సురక్షితంగాని శృంగారం, హెపటైటిస్ వైరస్ ఉన్న రక్తాన్ని ఎక్కించడం, స్వలింగ సంపర్కం, తల్లి నుంచి శిశువుకు, సురక్షితం కాని సిరంజిలను వాడటం వల్ల హెపటైటిస్ వచ్చే అవకాశం ఉంటుంది. వైరస్ సోకిన వెంటనే రోగనిరోధక శక్తి మీద దాడి చేస్తుంది. ఈ సమయంలో ఆకలి లేకపోవడం, వాంతి వస్తున్నట్లుగా ఉండటం, ఒళ్లంత నొప్పులు, మూత్రం పచ్చగా రావడం జరుగుతుంది. తరువాత నెమ్మదిగా కామెర్లు మొదలవుతాయి. దీంతో పాటు చర్మంపై దద్దుర్లు కనిపిస్తాయి. హెపటైటిస్ బీ వ్యాధి చాలా ఆలస్యంగా బయటపడుతుంది. కొన్ని సందర్భాలలో ఏళ్ల తర్వాత బయటపడవచ్చు.

**హెర్పిస్ సింప్లెక్స్**

ఒక గుండు సూది గుండుమీద కోటి వైరస్‌ల దాకా ఇమిడిపోయేంత సూక్ష్మమైన వైరస్ ఇది. హెర్పిస్ వైరస్ లైంగిక సమయంలో వ్యాప్తి చెందుతుంది. ఈ వైరస్ కొద్ది రోజుల్లోనే ప్రభావం చూపిస్తుంది. నిద్రాణస్థితిలో ఎలాంటి లక్షణాలు చూపించకుండా అవసరమైనపుడు తన ప్రతాపాన్ని చూపించి అతలాకుతలం చేస్తుంది. రోగిలోని రోగనిరోధక వ్యవస్థ బలహీనపడినపుడు, వాతావరణ పరిస్థితులు మారినపుడు సునామి లాగా విజృంభిస్తుంది. లైంగిక భాగాలపై చిన్న చిన్న నీటిపొక్కులు కనిపిస్తాయి. రెండు, మూడు రోజులలో పగిలి పుండ్లలాగా తయారవుతాయి. తొలిసారి లక్షణాలు కనిపించినపుడు సరియైన చికిత్స తీసుకుంటే ప్రారంభదశలోనే సత్వరనివారణ జరుగుతుంది. కానీ చాలా మందిలో వైరస్ ఉండిపోవడం వల్ల నిదానంగా ఉంటూ తిరిగి బయటపడుతూ ఉంటుంది. దీన్ని హెర్పిస్ రికరెంట్ అటాక్ అని అంటారు.

**హోమియో చికిత్స**

హెపటైటిస్ బి, సి వైరస్‌లు కాలేయంనకు ఎక్కువగా ఆకర్షితమవుతుంటాయి. ఎందుకంటే ఈ వైరస్‌లు కాలేయంలో మల్టిపుల్ అయ్యే అవకాశం ఎక్కువగా ఉంటుంది. దీన్ని రెప్లికేషన్ అంటారు. ఈ రెప్లికేషన్ అయ్యే పద్ధతిని హోమియోపతి మందుల ద్వారా అడ్డుకోవచ్చు. హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. శాస్త్రీయతను సంతరించుకున్న హోమియో చికిత్స మూలకారణాన్ని గుర్తించి దాన్ని తొలగిస్తుంది.

# హెచ్‌ఐవి ఉన్నా హోమియోతో జీవితం

**హెచ్‌ఐవి** పేరు వింటనే తెలియని భయం. ఎందుకంటే చికిత్స లేని వ్యాధి అది. నిజమే. కానీ ఇప్పుడు అద్భుతమైన మందులు అందుబాటులోకి వచ్చాయి. వైరస్ పూర్తిగా శరీరంలో నుంచి తొలగిపోకపోయినా ఆ వైరస్ ఎటువంటి ప్రభావం చూపకుండా చేసే హోమియో మందులు అందుబాటులో ఉన్నాయి. హెచ్‌ఐవి అంటే ఒక వ్యాధి అని చెప్పడం కన్నా వ్యాధులు రావడానికి కారణమయ్యే వాతావరణాన్ని శరీరంలో కలగజేస్తుందని చెప్పవచ్చు. అంటే చిన్న వాతావరణ మార్పులకే జలుబు చేయడం, జ్వరం రావడం, టీబీ సోకడం, విరేచనాలు కావడం జరుగుతుంది. ఫలితంగా మృత్యువు చేరువవుతుంది. అంటే రోగనిరోధక వ్యవస్థ బలహీనపడితే వ్యాధులు వచ్చిపడతాయి. సరిగ్గా హోమియో చికిత్స రోగనిరోధక వ్యవస్థను శక్తివంతం చేయడం పైనే దృష్టి పెడుతుంది.

**లక్షణాలు :** హెచ్‌ఐవి శరీరంలోకి ప్రవేశించగానే ఎటువంటి మార్పులు కనిపించవు. కొన్ని సంవత్సరాల తరువాత అంటే సీడీ 4 కణాల సంఖ్య తగ్గిపోయిన తరువాత వ్యాధి లక్షణాలు కనిపిస్తాయి. కొందరిలో ఐదారేళ్లకే సీడీ 4 కణాలు బాగా తగ్గిపోయి ఇన్‌ఫెక్షన్లు మొదలవుతాయి. మరికొందరిలో పదేళ్ల పడుతుంది.

**హోమియో చికిత్స :** హోమియో మందుల వల్ల రోగనిరోధకవ్యవస్థ తిరిగి బలపడుతుంది. సీడీ 4 కణాల సంఖ్య గణనీయంగా పెరుగుతుంది. అవకాశవాద ఇన్‌ఫెక్షన్లకు చోటు లేకుండా పోతుంది. ఆకలి బాగా పెరగడంతో బరువు పెరగడం ప్రారంభిస్తారు. హోమియో చికిత్స తీసుకోవడం ద్వారా అందరిలాగే సాధారణ జీవితం గడిపే అవకాశం లభిస్తుంది. హోమియో మందులు సక్రమంగా తీసుకుంటే హెచ్‌ఐవి ఎప్పటికీ ఎయిడ్స్‌గా మారదు.


మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్, విజయవాడ,
కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106


V6లో ప్రతి మంగళవారం మధ్యాహ్నం 2:30కి
సాక్షిలో ప్రతి శనివారం మధ్యాహ్నం 2:30కి
10టీవీలో ప్రతి ఆదివారం మధ్యాహ్నం 4:30కి
డాక్టర్‌గారి లైవ్ కార్యక్రమం ఉంటుంది.



31

# హరివంశం

**కాళీయుని బంధనంలో నిస్సహాయంగా ఉన్న కృష్ణుని చూసి, పదిమందీ పదిరకాలుగా ఆందోళన చెందారు. బాధపడ్డారు. వారి బాధనూ, ఆందోళననూ గ్రహించిన బలదేవుడు ఆలోచించాడిలా. తానూ, కృష్ణుడూ దివ్యావతారులు. తనకి తెలుసు ఆ సంగతి. కృష్ణుడే తెలుసుకోలేకపోతున్నాడు. తెలియజెప్పాలతనికి అనుకున్నాడు బలదేవుడు. ఎలుగెత్తి కృష్ణుణ్ణి హెచ్చరించాడిలా.**

కృష్ణా! నువ్వు మహనీయుడవు. లోకోద్ధరణకోసం జన్మించావు. అలాంటివాడివి, కాళీయుని బంధనంలో చిక్కుకుని, అలమటించడం వింతగా ఉంది. అందరూ నిన్ను చూసి కంటికీమంటికీ ఏకధారగా రోదిస్తున్నారు. నీ మహిమ నీకే కాదు, వీరికీ తెలియడం లేదు. నీ లీలలు చాలుగాని, విజృంభించు! కాళీయుని గర్వోద్ధతి అణగార్చు. అందరికీ ఆనందాన్ని కలిగించు.

బలరాముని హెచ్చరికతో ఆత్మస్వరూపాన్ని తెలుసుకున్నాడు కృష్ణుడు. తనని తాను నిండుగా చూసుకున్నాడు. సన్నగా నవ్వుకున్నాడు. అప్పుడు వేయి ఏనుగులబలంతో విజృంభించాడు. బంధనం నుంచి తప్పించుకున్నాడు. పైకెగిరి, కాళీయుని అయిదు పడగలనూ అధిరోహించాడు. తోకను అందుకున్నాడు. దాన్ని మెలిపెట్టాడు. శిరస్సులను కాలితో గట్టిగా మర్దించాడు. పిడికిటిపోట్లు పొడిచాడు. అటు యమునా తరంగమృదంగఘోష.. ఇటు గట్టు మీది పెద్దలూ పిల్లల కరతాళధ్వనులు. కృష్ణుడు తాండవం చేశాడు. ప్రళయభయంకరంగా ఉంది ఆ తాండవం. దేవతలది చూసి ఆందోళన చెందారు. కాసేపటికి కాళీయుని అయిదుపడగలూ వాడి వత్తలైనాయి. పడగలమీది మణులన్నీ మడుగులో రాలిపడినాయి. పడగలయిదూ రక్తాన్ని స్రవించాయి. రక్తం ధారలు కట్టింది. కాళీయుడు నీరసపడ్డాడు. ఉస్సురని నిట్టూర్చాడు. ప్రళయకాలరుద్రునిలా పరమభయంకరంగా తాండవిస్తున్న కృష్ణుణ్ణి చూసి, ఆకాశంలోని దేవతలూ, గట్టుమీది మనుజులూ జయజయధ్వానాలు చేశారు.

స్పృహకోల్పోతున్న కాళీయుడు, కృష్ణుని పాదాల కింది పడగలను కుంచించి వణికిపోతూ అన్నాడిలా.

పురుషోత్తమా కృష్ణా! నువ్వు సర్వలోకాధీశ్వరుడివన్న విషయం తెలియక ప్రవర్తించాను. నీచాతినీచుణ్ణయి నా కోరలతో నిన్నెంతో బాధించాను. నీ తాండవంతో నా గర్వోద్ధతి అణగిపోయింది. నన్ను క్షమించు. నీ తాండవనృత్యంతో నాలోగల విషం కూడా విరిగిపోయింది. ఇక నువ్వు ఏది చెబితే అది చేస్తాను. అమరేంద్రునికి కూడా దుర్లభమైన నీ పాదయుగళి నా శిరోలంకారమైంది. ఇంతకన్నా నాకు కావాల్సింది లేదు. నీ ఆగ్రహమే, నాకు అనుగ్రహం అయింది. కరుణించిక. నాకు ప్రాణదానాన్ని ప్రసాదించు.

కాళీయుని గర్వం అణగిపోవడంతో, అతను బేలగా మాట్లాడడంతో అతని పత్నులు, నాగాంగనలు భయభక్తులతో దోసిలొగ్గి కృష్ణునికి నమస్కరించారు. వేడుకున్నారిలా.

కృష్ణా! దీనజనశరణ్యా! ఎవరిపట్లా విద్వేషం లేని నువ్వు, జగద్రక్షణకోసమే దుష్టశిక్షణ చేస్తున్నావు. అభినందనీయం. మహామహులకు కూడా లభ్యంకాని నీ సాక్షాత్కారం మా భర్తకు అవలీలగా లభించింది. అది అతని పుణ్యఫలం. దయచేసి మాకు పతిభిక్షపెట్టు.

నాగాంగనల ప్రార్థన ఆలకించి, అభయం ప్రసాదించాడు కృష్ణుడు. కాళీయుడుకి ప్రాణం తిరిగి వచ్చినట్టైంది. కృతజ్ఞతగా కృష్ణుని చూశాడతను.

కాళీయా! నువ్వు నీ పరివారంసహా ఈక్షణమే ఈ మడుగు విడిచిపెట్టి, సముద్రమధ్యానికి తరలిపో! నీ కారణంగా ఈ మడుగునీరు విషతుల్యమైపోయింది. నువ్వు తరలిపోయిన మరుక్షణం ఈ నీటికి అమృతోదకం అన్న సార్థకనామధేయం ఏర్పడుతుంది. నీ పడగలమీద నా పాదముద్రలు కనిపించడంతో గరుత్మంతునితో నీకెలాంటి ప్రమాదమూ రాదు. వరం అనుగ్రహిస్తున్నాను.

కరుణామయుడు కృష్ణుడి అనుగ్రహానికి ఎంతగానో సంతోషించాడు కాళీయుడు. వెంటనే బంధుమిత్రసపరివారంసహా మడుగు విడిచిపెట్టి, సముద్రమధ్యానికి చేరుకున్నాడు. స్థిరనివాసం ఏర్పరచుకున్నాడక్కడ.

కాళీయుని నిష్క్రమణతో కళకళలాడుతున్న ఆ జలాశయంలో కృష్ణుడు తనివితీరా జలకాలాడాడు. అలసి ఒడ్డుకు చేరుకున్నాడు. ఒడ్డుకి చేరిన కృష్ణుణ్ణి యశోదానందులు గట్టిగా కౌగలించుకున్నారు. దీవించి అభినందించారు. గోపవృద్ధులు కృష్ణుణ్ణి ప్రేమగా నిమిరి విన్నవించుకున్నారిలా.

కృష్ణా! నీలా ఇంతింత గొప్ప పనులు చేసినవారిని మేము ఇంతవరకూ చూడలేదయ్యా! ఇన్నాళ్ళకు గోపకులకు గొప్ప సంరక్షకుడు దొరికాడు. ఇకనుంచి నువ్వే మా రాజువి. నేటి నుండి ఈ ప్రాంతంలో పశువులూ, ప్రాణులూ, మునులూ హాయిగా సంచరించగలరు. నీకిది అంతులేనిపుణ్యాన్ని కలిగిస్తుంది.

గోపకాంతలు చుట్టుముట్టారు కృష్ణుణ్ణి. చేతులు జోడించి నమస్కరించి వేడుకున్నారిలా.

పామరులం. నీ శక్తి తెలియనివాళ్ళం. నిన్ను తెలిసో తెలియకో నిందిస్తే మమ్మల్ని కరుణించి కాపాడు.

అంతా కృష్ణునికి ప్రదక్షిణనమస్కారాలు చేశారు. పువ్వులతో పూజించారు. పూజలూ, ప్రశంసలూ అందుకున్న కృష్ణుడు, తల్లిదండ్రులు, మిత్రులసహా బృందావనానికి చేరుకున్నాడు అని వైశంపాయనుడు ఆగాడు. ఆ మహాముని అలా ఆగడమే కావాలనుకున్నాడు జనమేజయుడు. అడిగాడిలా.

కాళీయునికి కృష్ణుడు వరం ప్రసాదించడానికి కారణం ఏమిటి? అలాగే కాళీయుని పూర్వజన్మ వృత్తాంతం ఏమిటి?

ఏమిటంటే...అంటూ వైశంపాయనుడు కాళీయుని పురాతనగాథను వివరించాడిలా.

కాళీయుని పూర్వనివాసం రమణకద్వీపం. గరుత్మంతునికి అతడు చేసిన ఓ చిన్న తప్పిదం కారణంగా ప్రాణాలను కాపాడుకునేందుకు ఆ మడుగునకు చేరాడు. జరిగింది ఏమిటంటే...

పూర్వకాలంలో పాములకి భయపడి, ప్రజలంతా ప్రతినెలా పుట్టలలో పంచభక్ష్యపరమన్నాదులు ఉంచి, వాటి అనుగ్రహం సంపాదించుకునేవారు. పాములు కూడా ఆ పంచభక్ష్యపరమన్నాదులలో సగభాగాన్ని గరుత్మంతునికి అందజేసి, ఓ కట్టడి చేసుకున్నాయి. అతని వల్ల ప్రాణాపాయం లేకుండా చూసుకున్నాయి. అయితే కాళీయుడు గర్వోద్ధతితో గరుత్మంతునికి సగభాగం ఈయక, సమర్పించిందంతా తానే భక్షించేవాడు. చూసి చూసి సహించలేకపోయాడు గరుత్మంతుడు. కాళీయుని అయిదు పడగలనూ చీల్చి చెండాడాలనుకున్నాడు. అతని మీదికి లంఘించాడు. కాళీయుడు కూడా తక్కువేం తినలేదు. గరుత్మంతుణ్ణి సమఉజ్జీగా తలచి, అతనితో యుద్ధానికి సిద్ధమయ్యాడు. కత్తుల్లాంటి బలమైనకోరలతో కరచి కరచి గరుత్మంతుణ్ణి హింసించాడు. కాళీయుని కాట్లు తింటూ ఇంకా రెచ్చిపోయాడు గరుత్మంతుడు. కాలిగోళ్ళతో అతన్ని చీల్చిపెట్టాడు. తట్టుకోలేకపోయాడు కాళీయుడు. ప్రాణాన్ని కాపాడుకునేందుకు పరుగుదీశాడు. వచ్చి ఆ మడుగును ఆశ్రయించాడు. అక్కడ ఆ మడుగును కాళీయుడు ఆశ్రయించడం వెనుక ఓ కారణం ఉంది. అదేమిటంటే...

## ధేనుకాసురసంహారం

**గోపాలకులూ, ఆలమందలుసహా బలరామకృష్ణులు గోవర్ధనగిరి ఉత్తరప్రదేశంలోకి ప్రవేశించి యథేచ్ఛగా తిరిగారు. తమ్ముడి కోరిక తీర్చేందుకు తాటిపళ్ళచెట్ల మొదళ్ళు బలంగా పట్టి ఊపి తాటిపండ్లను రాల్చాడు బలరాముడు. ఆ ఫలాలు కిందపడుతోంటే మిత్రబృందం చప్పట్లు చరిచింది. చెవులు చిల్లులుపడేలా వినవస్తున్న ఆ పెనుశబ్దాలను తట్టుకోలేక పోయాడు ధేనుకాసురుడు. అప్పుడతను ఏం చేశాడు?**

పూర్వకాలంలో సౌభరి అని ఒక ముని ఉండే వాడు. అతను ఆ మడుగులో నిలచి, తపస్సు చేసు కునేవాడు. అతను తపస్సు చేసుకుంటున్న సమ యంలో గరుత్మంతుడు ఓసారి ఏం చేశాడంటే...ఆకలికి అల్లాడుతూ ఆ మడుగులోని ఓ చేపను ముక్కున కరచి పైకి లేచాడు. మిగిలిన చేపలు అది గమనించి, భయంభయంగా సౌభరిచుట్టూ ప్రదక్షిణలు చేశాయి. చేపలు తనచుట్టూ ప్రదక్షిణలు చేయడం, అవి భయం భయంగా ఉండడం చూసి జాలి చెందాడు సౌభరి. పైకి చూశాడు. చేపను పట్టుకుని ఎగురుతున్న గరుత్మంతుణ్ణి చూశాడు. శపించాడిలా.

ఇకపై ఈ మడుగులోనికి గరుత్మంతుడు ప్రవే శిస్తే, మరుక్షణం మరణిస్తాడు.

–ఈ శాపగాథ కాళీయునికి ఎలా తెలిసిందో తెలిసింది. దాంతో అతను పరివారంసహా ఆ మడు గును ఆశ్రయించాడు. అదీకథ. శ్రీకృష్ణుడు అందుకే కాళీయుణ్ణి పరివారంసహా అక్కణ్ణుంచి వెళ్ళగొట్టాడు అదీకథ అని ఆ సంగతిని ముగించాడు వైశంపాయ నుడు. తర్వాత మిగిలిన కథను చెప్పసాగాడిలా.

కొంతకాలం గడిచింది.

పశువులకు మేత లభ్యం కాకుండాపోయింది. ఎద్దడి ఏర్పడింది. పెద్దలంతా అది గమనించి, నంద గోపుని సమీపించారు. బలరామకృష్ణులుసహా కూర్చున్న అతనికి సమస్యను వివరించారిలా.

నందగోపాలా! గోవర్ధనపర్వతానికి ఉత్తరదిశలో, యమునానదికి కాస్తంతదూరంలో విశాలమైన సమ ప్రదేశం ఉన్నది. ఆ ప్రదేశం రేగడిమట్టితో, పచ్చని పచ్చికలతో, చల్లనిచెట్లతో, తాటితోపులతో చూడ ముచ్చటగా ఉంటుంది. అయితే గాడిదరూపు ధరిం చిన ధేనుకాసురుడు అన్న రాక్షసుడు, పరివారం సహా యథేచ్ఛగా ఆ ప్రదేశంలో సంచరించడంతో పశుజాతి అక్కడకి వెళ్ళలేకపోతున్నది. భయపడు తున్నది. ఫలితంగా మేతకి తీవ్ర ఎద్దడిని ఎదుర్కొం టోంది. పశువులే వెళ్ళేందుకు భయపడుతుంటే మేంవెంత? మాకూ భయంగానే ఉన్నది. వెళ్ళలేక పోతున్నాం. కాయా కసురూ మాకు కరువైపోయింది. ఈ విషయమై మీరూ, బలరామకృష్ణులూ ఆలో చించి ఒక నిర్ణయం తీసుకుంటే బాగుంటుంది.

ఆ మాటకి ఒకరిని ఒకరు చూసుకుని బలరామ కృష్ణులు నవ్వుకున్నారు. నందగోపుని అనుమతితో అన్నారిలా.

ధేనుకాసురుడే కాదు, వాడి జేజమ్మ కూడా మనల్ని ఏమీ చెయ్యలేదు. పశువులను తీసుకుని మీరు ధైర్యంగా అక్కడికి బయల్దేరండి. మిమ్మల్ని వెన్నంటి మేముంటాం. పదండి!

గోపాలకులూ, ఆలమందలుసహా బలరామ కృష్ణులు గోవర్ధనగిరి ఉత్తరప్రదేశంలోకి ప్రవేశించారు. అంతా యథేచ్ఛగా తిరిగారు. కాసేపటికి అలసి పోయారేమో! చెట్లనానుకుని నిల్చున్నారంతా. అప్పుడు తాటిపళ్ళమీద కృష్ణునికన్నుపడింది. బల దేవుణ్ణి అడిగాడిలా.

అన్నా! అటు చూడు! మిగలమగ్గిన తాటిపళ్ళ నుండి రసం స్రవిస్తోంది. ఆ రసానికి పశువులన్నీ పోటీపడుతున్నాయి. నాకు కూడా ఆ రసాన్ని స్వీక రించాలని ఉంది. పెద్దవాడివి. చెట్లంటే చాలు, చక



చకా ఎక్కేసేవాడివి. నాకోసం ఓ నాలుగుచెట్లెక్కి పళ్ళను రాల్చరాదూ?

అంతేకదా? అడిగాడు బలదేవుడు.

అంతేనన్నా! నాకోరిక నెరవేర్చు అన్నాడు కృష్ణుడు. ఆలోచించాడు బలదేవుడు. తమ్ముడుసహా మిత్రబృందానికి చెప్పాడిలా.

నేను చెట్లెక్కి పళ్ళను రాల్చడం పెద్దపని. అంత పని దేనికి? ఓ చిన్నపని చేస్తాను. మొదలుపట్టుకుని బలంగా తాటిచెట్లను ఊపుతాను. పళ్ళు రాలిపడ తాయి. ఏరుకుని తినండి.

సరేనంటే సరేనన్నారంతా.

సిద్ధం అంటే సిద్ధం అన్నారు.

బలదేవుడు చెట్టు మొదళ్ళుపట్టుకుని గజగజ వణకించి, గట్టిగా ఊపాడు. తాళఫలాలు రాల్చాడు. తాళఫలాలు పడుతోంటే...రెచ్చిపోయి బలదేవుడు చెట్లను ఊపుతోంటే మిత్రబృందం అంతా చప్పట్లు చరిచారు. ఒకవైపు చప్పట్లు, మరొకవైపు పెనుశబ్దా లతో కింద పడుతున్న తాళఫలాలు...మారు మోగింది ఆ ప్రదేశం.

చెవులు చిల్లులుపడేలా వినవస్తున్న ఆ శబ్దా లను తట్టుకోలేకపోయాడు ధేనుకాసురుడు. ఏమిటి దంతా? ఏమై ఉంటుంది? అని ఆలోచించాడు. వేల కొలది అనుచరగణంతో బయల్దేరాడు. బలరామ కృష్ణుల్ని చేరుకున్నాడు. వారి మీద విజృంభించాడు. అన్నీ గార్దభాలే! ఆ రూపంలో ఉన్న రాక్షసులను చూసి గోపాలకులంతా చెట్ల వెనుక దాగున్నారు. గిట్టల తాకిడికి రేగిన అక్కడి ధూళి ఆకాశాన్ని కమ్మేసింది. సూర్యుడు కనిపించకుండాపోయాడు. చీకట్లుకమ్ము కున్నాయి. బలరామకృష్ణులను చూసి గార్దభాలన్నీ ఒక్కపెట్టుగా ఓండ్రపెట్టాయి. ఆ ధ్వనికి దిగ్గజాలే భయకంపితులయ్యాయి. తెరచిన వాటినోళ్ళు మృత్యు ముఖాలను తలపించాయి. ఎర్రటికళ్ళతో చూస్తే చాలు! ఆ చూపుకే అక్కడి చెట్లు కాలిపోయాయి. అయినా బలరామకృష్ణులు చెక్కుచెదరలేదు. పైగా ఒకరిని ఒకరు ఉత్సాహపరచుకుంటున్నట్టుగా కర చాలనం చేసుకుని ముందుకు ఉరికారు. ధేనుకుణ్ణి ఎదుర్కొన్నాడు బలరాముడు. వెనకకాళ్ళతో బలంగా తన్నాడు ధేనుకుడు. బలరాముని వక్షస్థలాన్ని బీటలు వార్చాననుకున్నాడు. అయితే అందుకు భిన్నంగా జరిగిందంతా. ఏ కాళ్ళతో తనని ధేనుకుడు తన్నాడో ఆ కాళ్ళను పట్టుకుని, దగ్గరగా ఉన్న తాటిచెట్టుకేసి పదేపదే కొట్టాడతన్ని బలరాముడు. దాంతో తలపగిలి ధేనుకుడు మరణించాడు. అదే విధంగా మిగిలిన రాక్షసులను కూడా చంపసాగాడు బలరాముడు. అన్నను చూసి కృష్ణునికి కూడా రాక్షసులను ఆ విధం గానే చంపాలనిపించింది. తానూ అలాగే గార్దభాల వెనుకకాళ్ళు పట్టుకుని తాటిచెట్లకేసి కొట్టికొట్టి చంపాడు కృష్ణుడు. కాసేపటికి రక్కసి మూకంతా ముక్కముక్కలై చెల్లాచెదురయ్యాయి. తాటిపండ్లతోనూ, రాక్షసుల మృతదేహాలతోనూ ఆ ప్రదేశం అంతా అడుగు పెట్టేందుకే కష్టమనిపించే రీతిలో తయారైంది.

అనుచరులసహా ధేనుకాసురుడు మరణించడంతో చెట్ల వెనుక దాగున్న గోపాలురంతా బతుకుజీవుడా అని బయటపడ్డారు. యోధాగ్రేసరులు బలరామ కృష్ణులను చూసి కరతాళధ్వనులు చేశారు. అభి నందించారు వారిని. పెద్దగా అరచి, నర్తించారు. తర్వాత అనుకున్నారిలా.

ఈ బలరామకృష్ణులు సాధారణమానవులు కారు. వీరిద్దరూ గోపాలకస్వరూపాలతో సంచరిస్తున్న దేవ తలు. ఇందులో అనుమానం లేదు.

–అరణి



# సం గతులూ! సం దర్భాలూ! ③



-ఇంద్రగంటి శ్రీకాంతశర్మ సెల్:98480 78079

# కవుల వాసనలు

**వాసనలంటే పరిమళాలనే కాదు; మనిషి కుండే సంస్కారాలని కూడా అర్థం.**

**శ్రీశ్రీ గారనుకుంటాను ఒక సందర్భంలో వ్రాస్తూ– "ప్రపంచంలో ప్రతిమనిషికీ జీవించే హక్కున్నట్టే భాషలో ప్రతిపదానికీ సాహిత్యంలో జీవించే హక్కుందని" ఇంకు దులిపి మరీ ప్రక టించారు.**

**ఈ సూత్రం కవుల వాసనలకు కూడా వర్తి స్తుంది.**

పూలచెట్టుకే కాదు; వరి పొలానికీ వాసన ఉంది.

మంచి గంధానికేకాదు; మట్టికీ వాసన ఉంది.

హోమకుండాలలోనే కాదు; శ్మశానాలలోనూ వాసన ఉంది.

పుట్టుభోగులకే కాదు; పూరి గుడిసెల్లో వాళ్లకీ వాసనలున్నాయి.

పల్లెలోకానీ, పట్నంలోకానీ, జీవితం సంక్లిష్ట మయ్యే కొద్దీ వాసనలూ సంకరమవుతాయి.

ఇంతెందుకు? వేలసంవత్సరాల మానవనాగరి కతలో అనేక వాసనా వైభవాలనీ, వైరాగ్యాలనీ, కవులు అంది పుచ్చుకోకుండా వదలలేదు.

ఇక్కడొక విశేషం చెప్పాలి. చాలామంది చదు వరులు ఏమనుకుంటారంటే– "వర్ణన" అంటే, లేనిది ఉన్నట్టుగా అతిశయోక్తిగా చెప్పడమని– ఇది తప్పు. వర్ణన అంటే విస్తరించి చెప్పడం. ఈ చెప్పడంలో రకరకాల చమత్కారాలు, పోలికలు, వివరణలు ఉంటే ఉండవచ్చు. సాహిత్యంలో వర్ణన అంటే, నాటకాల్లో చేసినట్టు 'మేకప్' వేసుకోవడం వంటిది. దుస్తులు, నగలు వగైరా. అయ్యా, కవి అయిన వాడు వర్ణన చేస్తాడు. మనం వాసనల గురించి కదా మాట్లాడుకుంటున్నాం? అంటే మన సంస్కా రాల గురించి కూడా మాట్లాడుకుంటున్నామన్న మాట. సంస్కారమనేది ఒక్కవర్గంలో, ఒక్క ప్రాంతంలో, ఒక్క మనిషిలో, రకరకాలుగా బయట పడుతూ ఉంటుంది.



చదువూ–సంస్కారమూ అన్నారు, గమనిం చండి. చదువే సంస్కారం కాదు. సంస్కారమనేది మన సహజ స్పందన లకు సంబంధించినది. ఇది, వెల్లడిగా మనచుట్టూ అల్లుకొని ఉన్న ప్రకృతితో, ఋతువులతో, మానవ సంబంధా లతో, అతుకుకొని ఉంటుంది. ఏ కాలపు కవి అయినా ఈ రహస్యం గ్రహించగలిగినప్పుడే గొప్పవాసనా వైభవంతో జీవించగలడు.

గట్టిగా మాట్లాడితే – ప్రతి ఋతు వుకీ ఒక ప్రత్యేక వాసన ఉంటుంది. ఇది బాగా స్పష్టంగా పల్లె వాతావరణంలో అనుభ వానికి వచ్చినంతగా, నగర వాతావరణంలో అందిరాదు. అనేక ఇతర దుర్గంధాల సాంకర్యం కమ్ముకుని ఉంటుంది.

వసంత ఋతువులో మామిడిపూతవాసన, గ్రీష్మఋతువులో మల్లెపూల వాసన, వర్ష ఋతువు తొలకరిజల్లుతో ఆవిర్లులేచే మట్టివాసన, శరదృతు వులో చెరువుల్లో తామరపూలవాసన, హేమంత శి రాలలో దేవాలయాల పచ్చకర్పూర వాసన, శృంగా రపు గదుల్లో అగరు పొగల వాసన...ఇవన్నీ ఒక యెత్తు, మనిషికి మనిషివాసన ఒకటీ ఒక యెత్తు. ఈ వాసన – నీ హోదానీ, నీ సంస్కారాన్నీ, నీ వైభ వాన్నీ, నీ పేదరికాన్నీ, నీ వీడని వ్యసనాలనీ– ఒక్కొక్కసారి అలవిమాలిన వృథల్నీకూడా పట్టి– ముక్కున పెడుతుంది. జాగ్రత్తగా ఎప్పుడైనా గమ నించండి: మనిషి యౌవనానికీ, వార్ధక్యానికీ కూడా శరీర వాసనలున్నాయి. జబ్బుల గబ్బుల గురించి చెప్పేదేముంది?

ఇవన్నీ సహజ వాసనలు.

మనుషులు వ్యాపారాలపేరిట, పరిశ్రమల పేరిట, వాహనాలపేరిట, మారణాయుధాలపేరిట, యంత్రాలపేరిట, విలాసాలపేరిట – కృత్రిమంగా కల్పించే వాసనల మాటేమిటి?–

మనం మనుషులం. నాగరికతపేరిట, అభ్యు దయం పేరిట, పురోగమనం పేరిట, శాస్త్ర సాంకేతిక సౌకర్యాలపేరిట వెల్లడిగా, సహజంగా ఉండే ప్రకృ తికి చాలాదూరమైపోయాం. అడవులు, కొండలు, నదులు, సముద్రాలు, ఎడారులు... అన్నింటినీ ఎంతగా వీలైతే అంతగానూ వాడేస్తున్నాం. మురికిలోకి తోసేస్తున్నాం.

వెనక్కి చరిత్రలోకి వెళ్లి చూస్తే –మన తెలుగు కవులు ఎంతటి అపురూప వాసనల్ని అనుభవిం చారో! వాటిని కలలుకన్నారో! జీవితాన్ని ఎంత పరి మళభరితం చేసుకున్నారో! వాళ్ల కావ్యాల వర్ణనలు మనకి చెపుతాయి.

అసలు సాహిత్యమనే మాటకీ, జనం హితం కోరేదని అర్థం కదా!–

అలవోకగా – మన్మథుడనే ఒక రూపంలేని సుందరుణ్ణి సృష్టించి, సౌందర్యానికి పరాకాష్ఠగా ప్రకటించి, అతగాడి చేతిలో అయిదు పరిమళ భరిత మైన పూలబాణాలుంచారు. అవి: తెల్లని కలవ పువ్వు, అశోక పుష్పం, మామిడిపూత, కొత్తమల్లెపువ్వు, నల్ల కలవ పువ్వూను.

అలాగని ఊరుకోకుండా అతడికి వసంతుడనే చెలికాడిని తోడిచ్చి, తోటలవెంట, ప్రేయసీ ప్రియుల వెంట తిప్పితిప్పి విడిచిపెట్టారు.

ప్రబంధకవి నందితిమ్మన్నగారైతే, బ్రహ్మచారి నారదుడి చేతిలో ఒక పారిజాత పుష్పంపెట్టి–

"ఒయ్యోయ్. ఇది సామాన్యం పువ్వుకాదు. దీని పరిమళం చెడిపోదు; ఇది వాడిపోదు; దీని వికాసం తగ్గదు; దీని నిండుగా మెత్తనిపుప్పొడి ఉంటుంది. ఎల్లప్పుడూ అందరి మనస్సులూ దోచుకుంటూనే ఉంటుంది" అని కృష్ణుడి జనానాలో గొప్ప కలకలా నికి తెరతీశాడు.

అవతల తిక్కనగారేమో, గంధ మాదనపర్వత

జీవనాధారమైన ఆశ!

***

ఆ రోజు శనివారం. ఊరూవాడా అంతటా భక్తి వాతావరణం విరాజిల్లుతున్న ధనుర్మాసకాలం. మంగళకరమైన వాయిద్యాలకు ఆలవాలమైన శుభ వేళ. చంద్రమోహన్, గోపాలకృష్ణ ఇద్దరూ లోగిలి గదిలో కూర్చుని అంతకంతకూ ఆకాశాన్నంటుతున్న ఇంటిఖర్చుల లెక్కల్లో తలమునకలై ఉన్నారు. అలా లెక్కలు చూసుకుంటూనే అప్పుడప్పుడు తలలుచాచి ఆంజనేయులువచ్చే అలికిడికోసం చెవులు రిక్కించి చూస్తున్నారు. అతడు వీధి గుడివైపు వెళ్ళి గంట పైనే దాటిపోయింది. ఆంజనేయులుకది మామూలే. స్వతహాగా కాస్తంత ఉద్వేగపూరిత మనస్తత్వం కావడంవల్ల మనసుకి మబ్బులు కమ్ముకున్నప్పుడల్లా అతడలాగే ఒంటరిగా దుర్గమ్మ గుడికెళ్ళిపోతుంటాడు. నిరాశా నిస్పృహలకు లోనైనప్పుడు అతడిని అల్లల్లా డించే ఆవేశం అణగారిపోయేవరకూ ఆలయప్రాంగ ణంలో ఉంచిన మృదంగాన్ని శివుడి చేతిలోని ఢమరు కంలా హోరెత్తిస్తుంటాడు. ఆ మృదంగనాదానికి సమ్మోహితులైన కొందరు భక్తజనం పళ్లూ కొబ్బరి ముక్కలూ అతడి ముందుంచి వెళ్ళిపోతుంటారు. ఆకలి జ్వాల రేకెత్తడం వల్ల వాళ్ళప్పటికే విస్తర్ల ముందు కూర్చోవడానికి సిద్ధపడుతూ మిరియాల చారుని రెండుసార్లు వేడిచేసి ఉంచారు. వాళ్ళకెందుకో ఉన్నపళాన ఒక అనుమానం వచ్చింది. ఇంతకూ ఆంజనేయులుకేమైంది? ఈసారీ గుడికే వెళ్ళాడా లేక మరింకెక్కడికైనా వెళ్ళిపోయాడా? ఆవేశపరులు ఎప్పుడేమి చేస్తారో దేనికెలా స్పందిస్తారో చెప్పడం కష్టమేమరి. ఎందుకంటే మొన్నమొన్ననే మూడో వీధిలో జరిగిన ఒక అనుకోని సంఘటన ఇద్దరి మనసులలో మెదిలి కలవరం రేపింది.

విశాఖపట్నం సోల్జర్‌పేటకు చెందిన ఒకవ్యక్తి టీచర్ ఉద్యోగానికి ఎంపికయ్యాడు. రెండేళ్ళ నుండి నియామక ఉత్తర్వుల కోసం ఎదురు చూస్తున్నాడు. కాని సెలెక్షన్ లిస్టు పూర్తికాలేదు. అతను నియామక ఉత్తర్వులు అందుకోలేకపోయాడు. నిరాశా నిస్పృహల్ని ఇక తట్టుకోలేకపోయాడతను. తెలిసిన అధికారులకీ, తెలియని అధికారులకీ నోటీసులిచ్చి టౌను వాటర్ స్టోరేజీ ట్యాంకు ఎక్కేసి అక్కణ్ణించి కిందకు దూకేశాడు. రెండు కాళ్ళూ విరిగి ఇప్పుడు ప్రాణాపాయస్థితిలో ఆస్పత్రిలో పడున్నాడు. ఆ జ్ఞాపకాల ప్రకంపనలతో ఇక ఇద్దరూ కుదురుగా కూర్చోలేకపోయారు. పద్దు పుస్తకం పక్కనపెట్టి అతనికేసి చూశారు. మరొకమారు ఆంజనేయులు బ్రాడ్ స్మయిల్ చేశాడు. "ఊరు నుంచి వచ్చిన ఉత్తరం చదివి, మనసుచెదరి, తిన్నగా ఊడలమర్రి చెట్టు క్రిందకెళ్ళిపోయి, కూర్చుండిపోయాను. అప్పుడు ఒకాయన గొప్ప భగవద్గీత ఆరాధకుడిలా ఉన్నాడు, అక్కడకొచ్చి, నాకు కుడివైపు కూర్చొని కంఠతాపట్టిన భగవద్గీత శ్లోకాలను మననం చేసుకోసాగాడు. అప్పుడేమైందంటే, యతో యతో నిశ్చరతి మనశ్చం

**యూనివర్సిటీ చదువుకోసం మూడు ప్రాంతాల నుండి వచ్చిన ముగ్గురు విద్యార్థులు. గాఢ స్నేహితులయ్యారు. చదువు పూర్తయ్యాక కూడ ఉమ్మడిగా ఉంటూ పోటీ పరీక్షలు రాస్తూ, ఉద్యోగవేట చేసేవారు. కానీ ఏ పరీక్షలోనూ వాళ్ళు నెగ్గలేకపోయారు. కాలం వాళ్ళని వెక్కిరించింది. వయసుకూడా ముదురుతోంది. ఖర్చుల సమస్య వారిని వెంటాడింది. అప్పుడు ఏం జరిగింది? ఆ ముగ్గురూ ఏకతాటిపై నిలబడ్డారా?**

అసహనంగా ఆరుబయటకొచ్చారు. అదే సమయంలో ఆంజనేయులు చెక్కగేటు తీసి లోనికి ప్రవేశిస్తున్నాడు. ఇద్దరూ ఆశ్చర్యంగా అతనివైపే చూశారు. చేతిలో పువ్వులో కొబ్బరిముక్కలో మరింకేవో పట్టుకొస్తాడ నుకున్న ఆంజనేయులు కుడిచేతిలో, ఒక పొడవాటి కారియర్తో వస్తున్నాడు. ఘుముఘుమలాడే పదా ర్థాల కమ్మటి వాసనలతో ఇంటి ఆవరణ నిండి పోయింది. సర్వర్ సుందరంలా నవ్వుతూ నిల్చున్న ఆంజనేయుల్ని చూసి గోపాలకృష్ణకు రాకూడని అనుమానం తన్నుకొచ్చింది. "ఎక్కడిదిరా ఆంజనేయా! కొంపదీసి ఎక్కణ్ణుంచైనా.." అంటూ అర్థోక్తిలో ఆగి పోయాడు. "నాకు కాస్తంత జిహ్వాచాపల్యం ఉందన్న మాట కాదననుగానీ, విషయం అదికాదు, నన్నీ రోజు భగవద్గీత కరుణతో దీవించింది".

"ఏమిటేమిటీ! పైనుంచి శ్రీకృష్ణుడు క్రిందకి దిగొచ్చి నీకిదిచ్చి వెళ్ళాడంటావా!" అన్నారు స్నేహితులు. వేదాంతిలా నవ్వాడు ఆంజనేయులు. "టెన్షన్ పడ కండి. ముందు నన్ను చెప్పనివ్వండి. అసలు విషయం నేనీరోజు గుడికెళ్ళ లేదు" దానితో మిత్రులిద్దరూ మరె క్కడికెళ్ళినట్టు అన్నట్టు సూటిగా



చలం.... అని శ్లోకం చదువుతూ మధ్యలోనే ఆగిపోయాడు. జ్ఞాపకం తెచ్చుకోవడానికి పదేపదే ప్రయత్నించాడు గాని తదుపరి వాక్యాన్ని అందుకోలేకపోయాడు. ఆయనలా గింజుకోవడం చూడలేక, నేనుగా లేచి వెళ్ళి ఆ శ్లోకంలోని మిగతా భాగం పూర్తిచేశాను. దానికి ఆయన ఎంతగా ఉబ్బితబ్బిబ్బైపోయాడనుకు న్నారు? నన్ను అమాంతం కౌగలించుకుని ఎంతవ ద్దన్నా వినకుండా ఇంటికి తీసుకెళ్ళి, తనతోబాటు నాకు కూడా భోజనం పెట్టమని వాళ్ళావిడకు పుర మాయించాడు. నేనప్పుడాయన్ను వారించాను. నేనొక్కణ్ణీ తినలేననీ, నా కోసం మరో ఇద్దరు ఎదు రుచూస్తుంటారని నచ్చచెప్పి వెనుదిరగబోయాను. అప్పుడా సహృదయుడు నన్ను నామానాన వెళ్ళని వ్వకుండా అడ్డుకుని, ఈ స్టీల్ క్యారియర్‌లో మనంద రికీ భోజనం కట్టి పంపించాడు".

అంతా విని గోపాలకృష్ణ చాలాసేపు మౌనంగా ఉండిపోయాడు. తర్వాత క్యారియర్‌ను గది లోపల పెట్టి వస్తున్న ఆంజనేయులువైపు తిరిగి, "రేపు క్యారియర్ ఇవ్వడానికి వెళ్తున్నప్పుడు ఆ పెద్దాయన ఇంటికి నన్ను కూడా తీసుకెళ్ళు" అన్నాడు. ఎందుకు? అన్నట్టు కళ్ళు మిటకరించి చూశాడు ఆంజనేయులు. "నేను రచించుకున్న పథకం ప్రకారం నేనొక చిన్న పాటి వ్యాపారం స్టార్టు చేయాలనుకుంటున్నానని ఓసారి చెప్పాను, జ్ఞాపకం ఉంది కదూ! దానికి కావల్సిన పెట్టుబడికోసం బల్కంపేట కో-ఆపరేటివ్ సొసైటీ వాళ్ళనడిగాను. వాళ్ళు నా ప్రపోజల్ని తోసి పుచ్చారు. ఈ చుట్టుప్రక్కల ఎవరైనా పెద్దమనిషి షూరిటీ ఉంటేగానీ లోను ఇవ్వనన్నారు. నిన్నాద రించి మనందరకూ భోజనం పంపించిన ఆ పెద్ద మనిషి షూరిటీ ఇస్తాడేమో" ఆ మాట విని ఆంజనే యులు అదోలా ముఖం పెట్టాడు. "ఇంత కొద్ది పాటి పరిచయంతో గోవిందరాజులుగారు నా మాటపైన నమ్మకముంచి నీకు షూరిటీ ఇస్తాడను కోను" అన్నాడు. అది విని గోపాలకృష్ణ నిరుత్సాహ పడలేదు. చిన్నగా నవ్వి అన్నాడు "అవును. ఇవ్వక పోవచ్చుగానీ ప్రయత్నించడంలో తప్పులేదుగా!" ఆంజనేయులు ఇక మాట్లాడలేదు. బుర్రూపుతూ భోజనాలకు త్వరగా తెమలమని మిత్రులిద్దరికీ

# కృషి

**-పాండ్రంకి సుబ్రమణి**

**గోపాలకృష్ణ రాయలసీమ సరిహద్దున ఉన్న గంగవరం నుండి భాగ్యనగరం వచ్చి గ్రాడ్యుయేషన్ కోసం ఉస్మానియా యూనివర్సిటీలో చేరాడు. శ్రీకాకుళం వంశధార ప్రాంతమైన గవ్వలూరు నుండి చంద్ర మోహన్, ముమ్మడివరం నుండి అర్చక కుటుంబానికి చెందిన ఆంజనేయులు కూడా దూర ప్రదేశం అనే ఆలోచనలకు తావివ్వకుండా, అదే విశ్వవిద్యాలయంలో ప్రవేశం పొందారు. మండే ఎండల్లో ఎదురుచూడకుండా చిమ్మే తొలకరి చినుకుల్లాంటివి కొన్ని పరిచయాలు.**

ఒకరోజు ముగ్గురూ లైబ్రరీ హాలులో పుస్తకాలు వెతుక్కుంటున్నప్పుడు, ఒకరికొకరు పరిచయమయ్యారు. ఊరూ పేరూ చెప్పుకుని దగ్గరయ్యారు. ఏకాకితనాన్ని ఆమడదూరం నెట్టి, చిన్ననాటి ముచ్చట్లు చెప్పుకుని ఊరట పొందారు.

కాలక్రమాన వాళ్ళ స్నేహతీవెలెంతగా పెనవేసుకుపోయాయంటే ముగ్గురూ గ్రాడ్యుయేషన్ ముగించుకుని హాస్టల్ విడిది నుండి బయటకొచ్చిన తర్వాత కూడా ఒకరినుండి మరొకరు దూరం కాలేకపోయారు. ముగ్గురూ కూడబలుక్కుని ఉమ్మడి పోర్షన్‌లో మకాం పెట్టారు. వంటావార్పూ కలిసి చేసుకుంటూ సాధ్యమైనంత మేర ఖర్చులు మిగుల్చుకుంటూ ఉద్యోగాలవేటలో పడ్డారు. పోటీ పరీక్షలకి ఉమ్మడిగా సన్నద్ధం కాసాగారు.

అదేం విచిత్రమో వాళ్ళ తలరాతలెంత వక్రమో మరి ఎన్ని ప్రయాసలకోర్చి చదివినా పోటీ పరీక్షల్లో విజయం సాధించలేకపోతున్నారు. మొదట మడమ తిప్పని విక్రమార్కుల్లా సివిల్‌సర్వీసు పరీక్షలు రాస్తే అందులో నెగ్గలేకపోయూరు. రాష్ట్రస్థాయి పోటీ పరీక్షల్లో కూడా విజయం సాధించలేకపోయారు. ఇంకా ఏవేవో గ్రూప్ పరీక్షలు రాసినా వాటిలోనూ చుక్కెదురైంది. ఊపులోఊపుగా బ్యాంకు పోటీపరీక్షలకు కూడా హాజరయ్యారు. ఫలితం షరా మామూలే అయింది. ఎట్టకేలకు ఊరిస్తూ ఉసిగొల్పుతూవచ్చే పోటీ పరీక్షలకు ఎగ్జామ్ ఫీజులు కట్టడానికి ఊరు నుంచి వచ్చే డబ్బులు కూడా సరిపోవడం లేదన్న వాస్తవాన్ని గుర్తించిన మిత్రులు ముగ్గురూ కాస్తంత డీలాపడ్డారు. తర్జనభర్జనలు పడ్డారు. ఇక తీరిగ్గా ఖర్చుల లెక్కలు చూసుకుని తమ సుఖాలను సౌఖ్యాలను తాత్కాలికంగా త్యాగం చేయడానికి పూనుకున్నారు. ప్రతిరోజు రివాజుగా వండుకునే రెండురకాల కూరల్ని ఒకటికి తగ్గించారు. పెచ్చరిల్లిపోయిన పప్పుధాన్యాల ధరలకు దిమ్మతిరిగిపోయి జిహ్వాచాపల్యం అణచుకున్నారు. మిరియాలచారుతో, ఉల్లిపాయ పులుసుతో సరిపుచ్చుకోవాలని తీర్మానించారు. వారానికొకసారి గుంపుగా వెళ్ళి ఉత్సాహం పుంజుకువచ్చే సినిమాహాలునీ విడిచి పెట్టేశారు. మొత్తానికి తాము ప్రయోజకులమయ్యామని నిరూపించుకోవడానికి ఆ ముగ్గురూ అన్నీ చేశారు ఒక్కటితప్ప! అదే పరీక్ష పాసవడం.

ఈ లోపల వాళ్ళను వాళ్ళు చూసుకునే తీరిక దొరకపుచ్చుకునేలోపు ఇంటి పెద్దలు దూరపుచూపుతో కొండగుహంతటి వాస్తవం పసిగట్టారు. ఈలవేస్తూ, కాలమూ, వయసూ చెట్టాపట్టాలేసుకుని పరువులు తీయడం. ఆ కారణాన గుర్రపు కళ్ళాన్ని వెనక్కి లాగుతున్నట్టు మిస్సైల్స్‌లాంటి లేఖలు సంధించనారంభించారు పెద్దవాళ్ళు. ఉన్నగూటికొచ్చి ఉన్న ఊళ్ళోనే ఉపాధి వెతుక్కుని బాగుపడమన్నారు. ఎంతైనా వాడీవేడీ ఉన్న వయసుకదా అంత త్వరగా వెనక్కి తగ్గరు. పొంగు కూడా చల్లారదుమరి. దెబ్బతిన్న అహంతో, రెట్టింపువేగంతో ఉవ్వెత్తున పొంగే ఉద్వేగంతో ఉద్యోగ ప్రయత్నాలు ముమ్మరం చేశారు. జల్లెడపట్టి కుదిపినట్లు భాగ్యనగరం శివార్ల వరకూ ఉద్యోగాల వేట సాగించారు. అయినా పెదవి విరుపే ఎదురైంది. అయితే ఒకటి. ఇంత జరిగినా ఇంతటి ప్రతికూల పరిస్థితులు బండ రాళ్లలా ఎదురైనా వాళ్ళలో కానవచ్చే సకారాత్మక గుణాంశం ఒకటే మిగిలి ఉంది. అదే వాళ్ళలో పూర్తిగా సన్నగిల్లని విశ్వాసం ఇంకా మిణుకుమిణుకుమంటూ వెలుగుతున్న



జీవనాధారమైన ఆశ!

***

ఆ రోజు శనివారం. ఊరూవాడా అంతటా భక్తి వాతావరణం విరాజిల్లుతున్న ధనుర్మాసకాలం. మంగళకరమైన వాయిద్యాలకు ఆలవాలమైన శుభ వేళ. చంద్రమోహన్, గోపాలకృష్ణ ఇద్దరూ లోగిలి గదిలో కూర్చుని అంతకంతకూ ఆకాశాన్నంటుతున్న ఇంటిఖర్చుల లెక్కల్లో తలమునకలై ఉన్నారు. అలా లెక్కలు చూసుకుంటూనే అప్పుడప్పుడు తలలుచాచి ఆంజనేయులువచ్చే అలికిడికోసం చెవులు రిక్కించి చూస్తున్నారు. అతడు వీధి గుడివైపు వెళ్ళి గంట పైనే దాటిపోయింది. ఆంజనేయులుకది మామూలే. స్వతహాగా కాస్తంత ఉద్వేగపూరిత మనస్తత్వం కావడంవల్ల మనసుకి మబ్బులు కమ్ముకున్నప్పుడల్లా అతడలాగే ఒంటరిగా దుర్గమ్మ గుడికెళ్ళిపోతుంటాడు. నిరాశా నిస్పృహలకు లోనైనప్పుడు అతడిని అల్లల్లాడించే ఆవేశం అణగారిపోయేవరకూ ఆలయప్రాంగణంలో ఉంచిన మృదంగాన్ని శివుడి చేతిలోని ఢమరుకంలా హోరెత్తిస్తుంటాడు. ఆ మృదంగనాదానికి సమ్మోహితులైన కొందరు భక్తజనం పళ్ళూ కొబ్బరి ముక్కలూ అతడి ముందుంచి వెళ్ళిపోతుంటారు. ఆకలి జ్వాల రేకెత్తడం వల్ల వాళ్ళప్పటికే విస్తర్ల ముందు కూర్చోవడానికి సిద్ధపడుతూ మిరియాల చారుని రెండుసార్లు వేడిచేసి ఉంచారు. వాళ్ళకెందుకో ఉన్నపళాన ఒక అనుమానం వచ్చింది. ఇంతకూ ఆంజనేయులుకేమైంది? ఈసారీ గుడికే వెళ్ళాడా లేక మరింకెక్కడికైనా వెళ్ళిపోయాడా? ఆవేశపరులు ఎప్పుడేమి చేస్తారో దేనికెలా స్పందిస్తారో చెప్పడం కష్టమేమరి. ఎందుకంటే మొన్నమొన్ననే మూడో వీధిలో జరిగిన ఒక అనుకోని సంఘటన ఇద్దరి మనసులలో మెదిలి కలవరం రేపింది.

విశాఖపట్నం సోల్జర్‌పేటకు చెందిన ఒకవ్యక్తి టీచర్ ఉద్యోగానికి ఎంపికయ్యాడు. రెండేళ్ళ నుండి నియామక ఉత్తర్వుల కోసం ఎదురు చూస్తున్నాడు. కాని సెలెక్షన్ లిస్టు పూర్తికాలేదు. అతను నియామక ఉత్తర్వులు అందుకోలేకపోయాడు. నిరాశా నిస్పృహల్ని ఇక తట్టుకోలేకపోయాడతను. తెలిసిన అధికారులకీ, తెలియని అధికారులకీ నోటీసులిచ్చి టౌను వాటర్ స్టోరేజీ ట్యాంకు ఎక్కేసి అక్కణ్ణించి కిందకు దూకేశాడు. రెండు కాళ్ళూ విరిగి ఇప్పుడు ప్రాణాపాయస్థితిలో ఆస్పత్రిలో పడున్నాడు. ఆ జ్ఞాపకాల ప్రకంపనలతో ఇక ఇద్దరూ కుదురుగా కూర్చోలేకపోయారు. పద్దు పుస్తకం పక్కనపెట్టి అసహనంగా ఆరుబయటకొచ్చారు. అదే సమయంలో ఆంజనేయులు చెక్కగేటు తీసి లోనికి ప్రవేశిస్తున్నాడు. ఇద్దరూ ఆశ్చర్యంగా అతనివైపే చూశారు. చేతిలో పువ్వులో కొబ్బరిముక్కలో మరింకేవో పట్టుకొస్తాడనుకున్న ఆంజనేయులు కుడిచేతిలో, ఒక పొడవాటి కారియర్తో వస్తున్నాడు. ఘుమఘుమలాడే పదార్థాల కమ్మటి వాసనలతో ఇంటి ఆవరణ నిండిపోయింది. సర్వర్ సుందరంలా నవ్వుతూ నిల్చున్న ఆంజనేయుల్ని చూసి గోపాలకృష్ణకు రాకూడని అనుమానం తన్నుకొచ్చింది. "ఎక్కడిదిరా ఆంజనేయా! కొంపదీసి ఎక్కణ్ణుంచైనా.." అంటూ అర్థోక్తిలో ఆగిపోయాడు. "నాకు కాస్తంత జిహ్వాచాపల్యం ఉందన్న మాట కాదననుగానీ, విషయం అదికాదు, నన్నీ రోజు భగవద్గీత కరుణతో దీవించింది".

"ఏమిటేమిటీ! పైనుంచి శ్రీకృష్ణుడు క్రిందకి దిగొచ్చి నీకిదిచ్చి వెళ్ళాడంటావా!" అన్నారు స్నేహితులు. వేదాంతిలా నవ్వాడు ఆంజనేయులు. "టెన్షన్ పడకండి. ముందు నన్ను చెప్పనివ్వండి. అసలు విషయం నేనీరోజు గుడికెళ్ళలేదు" దానితో మిత్రులిద్దరూ మరెక్కడికెళ్ళినట్టు అన్నట్టు సూటిగా అతనికేసి చూశారు. మరొకమారు ఆంజనేయులు బ్రాడ్ స్మయిల్ చేశాడు. "ఊరు నుంచి వచ్చిన ఉత్తరం చదివి, మనసుచెదిరి, తిన్నగా ఊడలమర్రి చెట్టు క్రిందకెళ్ళిపోయి, కూర్చుండిపోయాను. అప్పుడు ఒకాయన గొప్ప భగవద్గీత ఆరాధకుడిలా ఉన్నాడు, అక్కడకొచ్చి, నాకు కుడివైపు కూర్చొని కంఠతాపట్టిన భగవద్గీత శ్లోకాలను మననం చేసుకోసాగాడు. అప్పుడేమైందంటే, యతో యతో నిశ్చరతి మనశ్చంచలం.... అని శ్లోకం చదువుతూ మధ్యలోనే ఆగిపోయాడు. జ్ఞాపకం తెచ్చుకోవడానికి పదేపదే ప్రయత్నించాడు గాని తదుపరి వాక్యాన్ని అందుకోలేకపోయాడు. ఆయనలా గింజుకోవడం చూడలేక, నేనుగా లేచి వెళ్ళి ఆ శ్లోకంలోని మిగతా భాగం పూర్తిచేశాను. దానికి ఆయన ఎంతగా ఉబ్బితబ్బిబ్బైపోయాడనుకున్నారు? నన్ను అమాంతం కౌగలించుకుని ఎంతవద్దన్నా వినకుండా ఇంటికి తీసుకెళ్ళి, తనతోబాటు నాకు కూడా భోజనం పెట్టమని వాళ్ళావిడకు పురమాయించాడు. నేనప్పుడాయన్ను వారించాను. నేనొక్కణ్ణీ తినలేననీ, నా కోసం మరో ఇద్దరు ఎదురుచూస్తుంటారని నచ్చచెప్పి వెనుదిరగబోయాను. అప్పుడా సహృదయుడు నన్ను నామానాన వెళ్ళనివ్వకుండా అడ్డుకుని, ఈ స్టీల్ క్యారియర్‌లో మనందరికీ భోజనం కట్టి పంపించాడు".



యూనివర్సిటీ చదువుకోసం మూడు ప్రాంతాల నుండి వచ్చిన ముగ్గురు విద్యార్థులు గాఢ స్నేహితులయ్యారు. చదువు పూర్తయ్యాక కూడ ఉమ్మడిగా ఉంటూ పోటీ పరీక్షలు రాస్తూ, ఉద్యోగవేట చేసేవారు. కానీ ఏ పరీక్షలోనూ వాళ్ళు నెగ్గలేకపోయారు. కాలం వాళ్ళని వెక్కిరించింది. వయసుకూడా ముదురుతోంది. ఖర్చుల సమస్య వారిని వెంటాడింది. అప్పుడు ఏం జరిగింది? ఆ ముగ్గురూ ఏకతాటిపై నిలబడ్డారా?

అంతా విని గోపాలకృష్ణ చాలాసేపు మౌనంగా ఉండిపోయాడు. తర్వాత క్యారియర్‌ను గది లోపల పెట్టి వస్తున్న ఆంజనేయులువైపు తిరిగి, "రేపు క్యారియర్ ఇవ్వడానికి వెళ్తున్నప్పుడు ఆ పెద్దాయన ఇంటికి నన్ను కూడా తీసుకెళ్ళు" అన్నాడు. ఎందుకు? అన్నట్టు కళ్ళు మిటకరించి చూశాడు ఆంజనేయులు. "నేను రచించుకున్న పథకం ప్రకారం నేనొక చిన్నపాటి వ్యాపారం స్టార్టు చేయాలనుకుంటున్నానని ఓసారి చెప్పాను, జ్ఞాపకం ఉంది కదూ! దానికి కావల్సిన పెట్టుబడికోసం బల్కంపేట కో-ఆపరేటివ్ సొసైటీ వాళ్ళనడిగాను. వాళ్ళు నా ప్రపోజల్ని తోసిపుచ్చారు. ఈ చుట్టుప్రక్కల ఎవరైనా పెద్దమనిషి షూరిటీ ఉంటేగానీ లోను ఇవ్వనన్నారు. నిన్నాదరించి మనందరకూ భోజనం పంపించిన ఆ పెద్దమనిషి షూరిటీ ఇస్తాడేమో" ఆ మాట విని ఆంజనేయులు అదోలా ముఖం పెట్టాడు. "ఇంత కొద్దిపాటి పరిచయంతో గోవిందరాజులుగారు నా మాటపైన నమ్మకముంచి నీకు షూరిటీ ఇస్తాడనుకోను" అన్నాడు. అది విని గోపాలకృష్ణ నిరుత్సాహపడలేదు. చిన్నగా నవ్వి అన్నాడు "అవును. ఇవ్వకపోవచ్చుగానీ ప్రయత్నించడంలో తప్పులేదుగా!" ఆంజనేయులు ఇక మాట్లాడలేదు. బుర్రూపుతూ భోజనాలకు త్వరగా తెమలమని మిత్రులిద్దరికీ

చెప్పి లోపలకు నడిచాడు.

***

కొన్ని విషయాలలో కొన్ని అనుకున్నట్టు జరగవు. అయితే ఈసారి మాత్రం, ఈ ఒక్కసారి మాత్రం అనుకున్నది అనుకున్నట్లు జరిగింది గోపాలకృష్ణ విషయంలో. స్టేట్‌బ్యాంక్ బ్రాంచ్ మేనేజరుగా రిటైరైన గోవిందరాజులుగారు గోపాలకృష్ణ సమర్పించిన ప్రాజెక్టు ప్లాను చూసి ముఖ్యంగా గోపాలకృష్ణలోని ఉత్సాహానికి ఉత్తేజానికి ముచ్చటపడి సహృదయంతో షూరిటీ ఇచ్చి తక్కువ వడ్డీతో లోను వచ్చేలా మార్గం సుగమం చేశారు. ఈ ప్రపంచంలో నిస్వార్థజీవులు ఇంకా మిగిలేవున్నారని నిరూపించాడు.

వారంరోజుల గడువు తర్వాత, మంజూరైన లోను చెక్కుతో గోపాలకృష్ణను చూసి ఆంజనేయులూ, చంద్రమోహనూ ముక్తకంఠంతో వేసిన మొదటి ప్రశ్న "ఈ డబ్బుతో ఏ వ్యాపారం చేయదల్చుకున్నావు?" అని. జనరల్ స్టోర్సా, సైబర్ కేఫ్, లేదా ఏదైనా డీటీపీ కమ్ జెరాక్సు మిషను" మిత్రులిద్దరూ అడ్వాన్సు గట్రా ఇచ్చి పని ప్రారంభిద్దాం".

"మరి ఇవన్నీ అమ్ముకోవడానికి షాపు ఎక్కడ పెడ్తున్నావు?"

"షాపు నేను కాదు. మనమందరమూ కలిసి పెట్టబోతున్నాం. ఎక్కడంటారా? బల్కంపేట రోడ్డు జంక్షన్ వద్ద దాబా టైపులో షాపు పెట్టబోతున్నాం".

"మేం కూడానా!" ఒకరిముఖాలొకరు చూసుకుంటూ అడిగారు మిత్రులిద్దరూ ముక్తకంఠంతో. "ఏం స్వంతకాళ్లపై నిలబడి స్వయం ఉపాధి పొందడం మీకిష్టంలేదా?" "అబ్బే అది కాదురా గోపాలా! ఇదంతా మాకు అనుభవం లేని వ్యవహారంకదా మరి. అంతేకాక..." అంటూ ఆగిపోయాడు చంద్రమోహన్. చెప్పి ముగించమన్నట్లు సూటిగా చూశాడు గోపాలకృష్ణ. "అదేరా ఊరు నుండి ఇటువేపు ఎవరైనా వచ్చి చూస్తే ఈ విషయం మా ఊరువాళ్ళకి జేరేస్తే మన గతేమవుతుందో ఆలోచించు. పట్టభద్రులైన కొడుకులు ఉద్యోగాలు సంపాదించుకోలేక వీధుల వెంబడి తిరుగుతూ ఇడ్లీలు, పెసరట్లు అమ్ముకుంటూ రహదార్లమ్మట తిరుగుతున్నారని గుండెలు బాదుకోరూ! అంతదూరం ఎందుకు మనతోబాటు చదువుకున్న ఫ్రెండ్సుగానీ, క్లాస్‌మేట్స్‌గానీ మనల్ని ఇక్కడ చూస్తే మన పరువు ఏమవుతుందో కొంచెం ఆలోచించి చూడు" దాదాపు బిక్కముఖం వేసుకుని అన్నాడు చంద్రమోహన్.

స్నేహితుల మాటలకు తొణక్కుండా బెణక్కుండా స్పందించాడు గోపాలకృష్ణ. "లేదు. అలా అనుకోరు. ఒకవేళ అనుకున్నా నవ్విపోదురుగాక మనకేటి సిగ్గు అన్నధోరణితో సాగిపోవాలి. ఎందుకంటే మనం సాధించిన డిగ్రీలు మనల్ని సమయానికి ఆదుకోలేనప్పుడు దేవుడిచ్చిన మన రెండు చేతులపైనా ఆధారపడటంలో తప్పేముంది? ఎదుటివాళ్ళ ముందు బేలగా చేతులు చాచి నిలబడకూడదుగానీ, మన కాళ్లపై మనం నిలబడటానికి పాటుపడుతుంటే, అది దిగజారుడుతనం ఎలా అవుతుందిరా! సరే ఇక అసలు విషయానికి వద్దాం. ఆప్త మిత్రులుగా నాతో కలిసి వస్తే సరేసరి. భుజాలు కలిపి ముందుకి సాగిపోదాం. మనమేమిటో మన సత్తా ఏమిటో అందరికీ నిరూపిద్దాం.

సుత్తికొడ్తున్నాను అనుకోకపోతే ఒక మాట చెప్తాను. మనిషి జీవితం ఎక్కడో కొండచరియల మాటున పుట్టి, సన్నటిధారగా, అటు పిమ్మట ప్రవాహంలాపారే సెలయేరు లాంటిది. అంటే అది ఆరంభ షైనచోట ఆ ధార పల్చగానే ఉంటుంది. ఆ తర్వాతనే దాని ప్రభావమేమిటో అది చూపిస్తుంది. ఇక మరొక పాయింటుకి వస్తే ప్రపంచంలో, ఇప్పటి లెక్కల ప్రకారం అత్యధిక సంపన్నుడెవరో మీకు తెలుసనుకుంటాను." ఇద్దరూ తెలియదన్నట్టు అడ్డంగా తలలాడించారు. "సరే నేనే చెప్తాను. ఆయనొక అమెరికన్. పేరు వారెన్ బఫెట్. బిల్‌గేట్స్ కన్నా అధిక సంపన్నుడన్న పేరు పొందినవాడు. ఈయన జన్మతః నోట్లో సిల్వర్‌స్పూనుతో పుట్టలేదు. స్కూలు రోజుల్లోనే వ్యాపార అనుభవం గడించనారంభించాడు. ఎలాగంటారా? అంత చిన్నవయసులోనే ఇంటింటికీ వెళ్ళి వారపత్రికలతో బాటు, చూయింగ్ గమ్, కోకాకోలా వంటివి అమ్ముతుండేవాడు. ఆదిలో ఇప్పటి భారతదేశ వ్యాపారదిగ్గజాలు ముఖేష్ అంబానీ, అనిల్‌అంబానీల తండ్రి ఎటువంటి వ్యాపకం చేసేవాడో తెలుసా? బ్రిటీష్ సైనిక శిబిరాల నుండి ఇనుపస్క్రాప్ కొనుక్కుని ఇతర కార్ఖానాలకు అమ్ముతుండేవారు. దీనివల్ల మనకేం తెలుస్తుంది ప్రపంచవ్యాపార దిగ్గజాలెవరూ ఒక్కసారిగా ఆకాశం నుండి ఊడిపడలేదని, ఎనీహౌ మీకటువంటి ఉపాధి చేసుకోవడంలో ఇబ్బందిగా ఉంటే నేను మరొకర్ని..." అని ఆగిపోయాడు గోపాలకృష్ణ. "వాళ్ళెవరు?" అని ప్రశ్నించాడు ఆంజనేయులు. అతని గొంతు ఎక్కడో నూతిలోంచి వచ్చినట్టుంది. "ఎవరైతేనేం మనబోటి వాళ్ళు, మనలాగే ఉపాధి దొరక్క ఊళ్ళూ వీధులూ తిరిగే పట్టభద్రులు. ఇక ఆఖరి మాట, ఇప్పటి నా దురవస్థకు ఎన్నో కారణాలుండవచ్చు. ఎంతటి భగీరథ ప్రయత్నం చేసినా ముందుకుపోనివ్వని ఎన్నో అడ్డంకులు నన్ను డీకొని ఉండవచ్చు. ఆలాగని ఒకటి తరువాత ఒకటిగా కారణాలు చెప్పుకుంటూ వయసు మళ్ళుతున్న మా అమ్మానాన్నల భుజస్కందాలపై గుదిబండలా కూర్చోలేను. అదే సమయాన ఎదుటివారి సహానుభూతి కోసం కాలమంతా ఆక్రోశిస్తూ నన్ను నేను దిగజార్చుకోలేను. ఈజిట్ క్లియర్? అంచేత ఇగోక్లేష్‌కి తావివ్వకుండా కామ్‌గా ఆలోచించి నిర్ణయానికి రావటానికి ప్రయత్నించండి. ఆ తర్వాత మీ ఇష్టం, నా తలరాత" అని గోపాలకృష్ణ అక్కణ్ణుంచి వెళ్ళిపోయాడు.




అలా ఏవేవో చెప్పుకుపోతుంటే, కుడిచేతి సైగతో కొట్టి పడేశాడు. "ఇప్పటికిప్పుడు అంత పెద్దరిస్కు తీసుకోకూడదురా! ముఖ్యంగా నన్ను నమ్మి లోను ఇప్పించిన ఆ పెద్దమనిషి మర్యాదపోకుండా చూసుకోవాలిరా! అందుకని..." అంటూ ఆగాడు గోపాలకృష్ణ, మిత్రులిద్దరూ ఆసక్తిగా ముఖాలుపెట్టి చూడసాగారు. "అందుకని చిన్నపాటి వ్యాపారం ఆరంభించబోతున్నాను, మీరేమంటారు?" అని అడిగాడు.

"అందుకే అడుగుతున్నాం, అదేం వ్యాపారం అని?"

"అదే చెప్పబోతున్నాను. మూడు రోజుల్లోపల ఇడ్లీలు పట్టడానికి, గారెలు చేయడానికి, సాంబారు కాచడానికి, కొబ్బరికోరు తరగటానికి అనువుగా మోడ్రన్ కుంపట్లూ, సామాగ్రి వగైరావన్నీ ఇక్కడికి రాబోతున్నాయి. మన వంటింటిని మరింత విశాలంగా మార్చడానికి, పదార్థాలన్నింటినీ వండి పెట్టడానికి హాస్టల్ మెస్సులో మునుపు పనిచేసిన ఇద్దరు వంటగాళ్ళను, ఒక వంటగత్తెను కుదిర్చాను. వాళ్ళందరూ రేపు సాయంత్రం వస్తారు, వాళ్ళకు

ఇద్దరూ నోరు మెదపకుండా కనురెప్పలు అల్లార్చుతూ నిల్చున్నారు.

అందరి విషయంలోనూ కాకపోయినా కొందరి జీవితంలో ఏదో ఒకసారి అనుకోనివిధంగా అటువంటి సందిగ్ధావస్థ ఎదురవుతూనే ఉంటుంది. అటువంటి పరిస్థితి అవును, కాదు అని తేల్చుకుండా మనల్ని ఉక్కిరిబిక్కిరి చేస్తుంటుంది. ఇక అంతిమ నిర్ణయం వాళ్ళవాళ్ళ జీవితానుభవ నేపథ్యం ప్రకారం తీర్మానించి, నిదానంగా ముందుకు సాగాల్సిందే!

# మోకాలు నొప్పి ఇక బాధించదు

**మోకాళ్ల** నొప్పులు ముఖ్యంగా మోకాలు కీలు అరగడం వల్ల వస్తాయి. దీనిని వైద్యపరిభాషలో మోకాలి ఆస్టియోఆర్థరైటిస్ అంటారు. ఈ మోకాళ్లనొప్పులు ఎక్కువగా 45 సంవత్సరాల తరువాత అధికంగా కనిపిస్తాయి.

**ఎవరికి వచ్చే అవకాశం ఉంది? :** మోకాళ్ల నొప్పులు రావడానికి మొదటి కారణం అధిక బరువు అని చెప్పవచ్చు. శరీర బరువు వివిధ దశల్లో కీళ్ల మీద పడుతుంది. నడిచేటప్పుడు నాలుగురెట్లు అధికమై మోకాళ్ల మీద పడుతుంది. మెట్లు ఎక్కుతున్నప్పుడు 6 నుంచి 7 రెట్లు అధికంగా పడుతుంది. కీళ్లు ఆరోగ్యంగా ఉన్నప్పుడు ఎటువంటి ఇబ్బంది ఉండదు. కానీ కీలు దెబ్బతిన్నప్పుడు మాత్రం సమస్యలు వస్తాయి. బరువు పెరుగుతున్న కొద్దీ నొప్పి అధికమయ్యే అవకాశం ఉంటుంది.

**కీళ్లలో ఎటువంటి మార్పు వస్తుంది :** మెకాలు కీలు నిర్మితం కావడంలో మూడు ఎముకల పాత్ర ఉంటుంది. అవి ఫీమర్, టిబియా, పటెల్లా. ఈ ఎముకల మధ్యలో మెత్తటి స్పాంజిలాంటి పదార్థం ఉండి రాపిడి లేకుండా చేస్తుంది. దీన్ని మృదులాస్థి అంటారు. అలాగే మోకాళ్ల చుట్టూ కవచాల మాదిరిగా లిగమెంట్స్ ఉంటాయి. ఆస్టియోఆర్థరైటిస్ ఉన్న వారిలో ఈ మృదులాస్థి దెబ్బతినడం జరుగుతుంది. ఎముకలు అరగడాన్ని, దెబ్బతిన్న కార్టిలేజ్‌ను బట్టి వైద్యులు వ్యాధి తీవ్రతను గుర్తిస్తారు.

**హోమియో చికిత్స :** మోకాలి నొప్పులను దూరం చేయడంలో హోమియో మందులు అద్భుతమైన పాత్రను పోషిస్తాయి. హోమియో వైద్యంతో శాశ్వత పరిష్కారం లభిస్తుంది. పైగా ఎటువంటి దుష్ఫలితాలు ఉండవు. అనుభవజ్ఞులైన హోమియో వైద్యుని పర్యవేక్షణలో చికిత్స తీసుకుంటే మోకాలు నొప్పి మళ్లీ వేధించదు.

# పార్శ్వపు నొప్పికి ఉత్తమ చికిత్స

**ప్ర**తి ఒక్కరు ఎప్పుడో ఒకప్పుడు తలనొప్పితో బాధపడే ఉంటారు. అయితే తలనొప్పి చాలా రోజులుగా ఉన్నా, తరచుగా వస్తున్నా, తీవ్రంగా ఉన్నా నిర్లక్ష్యం చేయడం మంచిది కాదు. సరియైన కారణం తెలుసుకుని చికిత్స తీసుకోవాలి.

**మైగ్రేన్:** దీనిని పార్శ్వపు నొప్పి అని కూడా అంటారు. ఈ తలనొప్పి ఒక భాగంలో రావడం జరుగుతుంది. ఈ నొప్పి కొన్ని గంటల నుంచి కొన్ని రోజుల వరకు ఉంటుంది. వికారం వాంతి వంటి లక్షణాలుంటాయి. శబ్దాన్ని, కాంతిని భరించలేరు. ఘాటైన వాసనను భరించలేరు. పార్శ్వపు నొప్పి ఎక్కువగా ఆడవాళ్లలో వస్తుంది. ఈ నొప్పికి ఖచ్చితమైన కారణం తెలియదు. కానీ మెదడులోని రక్తనాళాలు, నరాలు ప్రేరేపితమై వాటి నుంచి వెలువడే కొన్ని రసాయన పదార్థాల వల్ల తలనొప్పి వస్తుందని భావిస్తుంటారు.

**మైగ్రేన్ ట్రిగ్గర్స్ :** సరియైన సమయానికి భోజనం చేయకపోయినా, నిద్ర తక్కువైనా, ఎండలో తిరిగినా, ఎక్కువ చలికి ఎక్స్‌పోజ్ అయినా, బాగా అలసిపోయినా, పగలు ప్రయాణం చేసినా ఈ మైగ్రేన్ వస్తుంది. చాక్‌లెట్స్, ఐస్‌క్రీమ్స్, రెడ్‌వైన్ లాంటివి మైగ్రేన్ తలనొప్పిని అధికం చేస్తాయి. స్త్రీలకు బహిష్టు సమయంలో మైగ్రేన్ తలనొప్పి ఎక్కువ కావచ్చు. కానీ చాలా మందికి స్త్రీలకు గర్భం ధరించినపుడు మైగ్రేన్ తగ్గుతుంది. మెదడుకు సంబంధించిన సమస్యలు మెనింజైటిస్, ఎన్‌కెఫలైటిస్ వంటి వ్యాధులలో కూడా తలనొప్పి ఉంటుంది.

**చికిత్స :** మైగ్రేన్‌కు, ఇతర తలనొప్పులకు హోమియోలో మంచి చికిత్స అందుబాటులో ఉంది. ముందుగా లక్షణాలు పరిశీలించి కారణాలు తెలుసుకోవాలి. ఏ సమయంలో తలనొప్పి ఎక్కువవుతోంది. లక్షణాలు ఎలా ఉంటున్నాయి. వీటితోపాటు మనస్తత్వం, ఒత్తిడి,ఆలోచనా విధానం తెలుసుకుని చికిత్స ఇవ్వడం వల్ల ఫలితం ఉంటుంది.

# కీళ్లనొప్పులకు తత్వచికిత్స

శరీరంలో రెండు లేక అంతకన్నా ఎక్కువ ఎముకలు కలిసే చోటును కీళ్లు అంటారు. కీళ్లకు సంబంధించి తలెత్తే సమస్యను ఆర్థరైటిస్(కీళ్లనొప్పులు)అంటారు. కీళ్లనొప్పుల్లో వందకుపైగా రకాలున్నాయి. ప్రతి కీళ్లనొప్పికి ప్రత్యేకమైన లక్షణాలుంటాయి. కీళ్లనొప్పులు శరీరంలోని చిన్న కీళ్లను, పెద్దకీళ్లను ప్రభావితం చేసి ఇబ్బందికి గురిచేస్తాయి. కీళ్లనొప్పుల్లో ఎముకల్లో గానీ, కీళ్లలో గానీ, కార్టిలేజ్‌లో గానీ, సైనోవియల్ ద్రవంలో గానీ, లిగమెంట్స్‌లోగానీ సమస్యలు ఉత్పన్నమవుతాయి.

**లక్షణాలు ఇలా ఉంటాయి**

చిన్న, పెద్ద కీళ్లలో నొప్పులు, కీళ్లవాపులు రావడం, నడవడానికి ఇబ్బంది పడటం, ఉదయం లేచినపుడు కీళ్లు పట్టేసినట్లుగా ఉండి మామూలు స్థితి రావడానికి కొన్ని నిమిషాల నుంచి గంటల సమయం పట్టడం జరుగుతుంది. త్వరగా అలసిపోవడం, కీళ్లు వంకరపోవడం వంటి లక్షణాలుంటాయి.

**కీళ్లనొప్పుల రకాలు**

**ఆస్టియోఆర్థరైటిస్ :** ఇది కీళ్లనొప్పుల్లో చాలా ఎక్కువగా కనిపించే సమస్య. ఈ సమస్య రావడానికి బరువు పెరగడం, కీళ్లను ఎక్కువగా ఉపయోగించే పనులు చేయడం, 40 ఏళ్లు పైబడటం వంటివి కారణం కావచ్చు. ఈ సమస్య ముఖ్యంగా మోకాళ్లు, తుంటి కీళ్లలో వచ్చి కార్టిలేజ్‌ను దెబ్బతీసి నడవడానికి ఇబ్బంది పడేలా చేస్తుంది. మోకాళ్లు, తుంటిలో నొప్పి రావడం, లేచేటప్పుడు కీళ్లు బిగుసుకుపోయి ఉండటం, నిలబడలేకపోవడం, మెట్లు ఎక్కేటప్పుడు, దిగేటప్పుడు నొప్పి రావడం, కీళ్లలో శబ్దాలు రావడం జరుగుతుంది.

**రుమటాయిడ్ ఆర్థరైటిస్ :** రోగి శరీరంలోని ఇమ్యూన్ వ్యవస్థ(రక్షణ వ్యవస్థ) పొరబాటుగా శరీరంలోని కీళ్ల మీద దాడిచేసినపుడు ఈ సమస్య వస్తుంది. చేతి, కాలి వేళ్లు, మోచేయి, భుజం, మోకాళ్లు లాంటి కీళ్లలో నొప్పి రావడం, ఉదయంపూట తీవ్రమైన నొప్పితో లేవడానికి చాలా ఇబ్బంది పడటం జరుగుతుంది. ఈ సమస్య వల్ల కళ్లు కూడా దెబ్బతినే అవకాశం ఉంది. దీనితోపాటు జ్వరం, అలసట, బరువు తగ్గడం, ఆకలి లేకపోవడం, నీరసం రావడం జరుగుతుంది.

**గౌట్ :** ఇది యూరికాసిడ్ అనే పదార్థం శరీరంలో ఎక్కువ విడుదల కావడం లేక శరీరం నుంచి బయటకు పోలేకపోవడం వల్ల యూరికాసిడ్ అనే పదార్థం కీళ్లలో చేరి కీళ్లనొప్పులు కలగచేస్తుంది. కీళ్లనొప్పులు ముఖ్యంగా కాలి బొటనవేలు, కాళ్ల వేళ్లలో ఎక్కువగా కనిపిస్తాయి.

**రుమాటిక్ ఆర్థరైటిస్ :** చిన్నప్పుడు గొంతునొప్పి లేక టాన్సిల్స్ వాపు ఉన్నప్పుడు దానికి సరియైన చికిత్స తీసుకోలేకపోతే హీమోలైటిక్ స్ట్రెప్టోకాకై అనే బ్యాక్టీరియా కీళ్లలోకి ప్రవేశించి కీళ్లనొప్పులను కలగజేస్తుంది. దీనిలో ఏఎస్ఓటైటర్ అనేది పాజిటివ్ వస్తుంది.

**వెన్నెముక సమస్యలు :** వెన్నెముక సమస్యలో డిస్క్ అనే రబ్బర్ లాంటి మృదువైన పదార్థం దెబ్బతిని, వెన్నుపూసలు దెబ్బతింటాయి. దీనిని స్పాండిలోసిస్ అంటారు. మెడభాగంలో, నడుము భాగంలో కూడా ఇటువంటి మార్పులు జరిగి మెడనొప్పి, నడుమునొప్పి వచ్చి ఇబ్బంది పడతారు.

**హోమియో చికిత్స :** కీళ్లనొప్పుల చికిత్సలో హోమియో వైద్యానికి విశిష్టస్థానం ఉంది. ముందుగా కీళ్లనొప్పి ఏ రకానికి చెందినదో తెలుసుకోవడం జరుగుతుంది. తరువాత రోగి మానసిక, శారీరక లక్షణాలు, పరిగణలోకి తీసుకుని మందులు ఇవ్వడం జరుగుతుంది. దీనిని తత్వ చికిత్స అంటారు. వ్యాధి మూలాలకు చికిత్స చేయడానికి ఈ చికిత్స చాలా తోడ్పడుతుంది.


**డాక్టర్ గోరంట్ల చంద్రశేఖరరావు**
ఎం.డి, పీహెచ్‌డీ (హోమియో)
డి.ఎస్‌సి. హోమియో (అమెరికా)
మేనేజింగ్ డైరెక్టర్, హోమియో ట్రెండ్స్
హైదరాబాద్, సికింద్రాబాద్, విజయవాడ, వైజాగ్
ఫోన్స్: 77 3000 3000, 77 3000 4000






# విజయ విలాసం-2

## స్టెప్స్ టు సక్సెస్

9

-ఎం. వెంకటేశ్వరరావు, సెల్: 90307 07037

**"చదువు అంటే మెదడులో దట్టించే సమాచార రాశి కాదు. జీవితకాలమైనా అర్థం కాని, జీర్ణంకాని కలగూరగంప కాదు. మనకు కావలసింది ఉజ్జీవనతరం. ధైర్యవీర్య జనకం. శీల నిర్మాణానికి సమర్థమైన భావాలు. వీటిని అందించేదే నిజమైన చదువు. అటువంటి ఐదు భావాలను గ్రహించి వాటిని జీవితంగా, వ్యక్తిత్వంగా మలచుకోగలిగితే, ఒక పెద్ద గ్రంథాలయాన్ని కంఠస్థం చేసిన వాడికంటే విశేషమైన విద్యావంతులనదగ్గవారుగా దీప్తిస్తారు"**

—వివేకానంద

# చదువుకుంటే... చదువు'కొంటే'..!?

ఈ రోజుల్లో ఏ న్యూస్‌పేపర్ చూసినా, ఏ టీవీ ఛానెల్ చూసినా కార్పొరేట్ విద్యా సంస్థల ఊదరే. దేశంలో జరిగే ప్రతి పరీక్షలోనూ 'నెంబర్ వన్' మేమే అని చెప్పే ర్యాంకుల ప్రకటనలే.

విచిత్రం ఏమిటంటే, రాన్రానూ... ఈ పైత్యం పరాకాష్టకి చేరింది. టెన్త్ పరీక్షలకు ముందే కాలేజీ లెక్చరర్లు విద్యార్థుల ఇళ్ళకు వెళుతున్నారు. 'మూడు వేలుకట్టి మా కాలేజీలో మీ పిల్లలకి సీటు రిజర్వు చేసుకోండి' అని వేధిస్తున్నారు. ఫోన్‌చేసి గుర్తు చేస్తారు. ఫలితాలు వచ్చాక ఇంకా వెంటబడతారు. "ఫలానా కాలేజీలో అడ్వాన్సు కట్టేశాం" అని చెబితే, దానికి రెట్టింపు అమౌంట్ తగ్గిస్తాం, మా కాలేజీలో చేర్చండి అనే స్థాయికి దిగజారుతున్నారు. గాలి, వెలుతురు లేని తరగతి గదిలో 70–80 మంది విద్యార్థుల్ని కుక్కి రుబ్బుడు కార్యక్రమం మొదలెట్టేస్తున్నారు.



తీరా ఫలితాలు చూస్తే, ఆర్థిక వనరులు లేని కుటుంబాల్లోంచి వచ్చిన ఏ వసతులులేని స్కూళ్ళల్లో చదివిన మారుమూల పల్లె విద్యార్థులకే ర్యాంకులు దక్కుతున్నాయి. సోకాల్డ్ కార్పొరేట్ విద్యాసంస్థలు వాళ్ళను తమ విద్యార్థులుగా ప్రమోట్ చేసుకుంటున్న ఉదంతాలు అందరికీ విదితమే. ఈ వెర్రి ఎంతవరకూ వెళ్ళిందంటే, ఇటీవల సివిల్ సర్వీసెస్‌లో ఎంపికైన ఓ గ్రామీణ టీచరు గురించి దినపత్రికల్లో ఊదర మొదలైంది. అతను ఏ పేపరుకి ఇంటర్వ్యూ ఇస్తే "ఆ పేపర్నే రెగ్యులర్‌గా చదివి తెలుగుభాషా పరిజ్ఞానం సంపాదించి, సివిల్స్ కల నెరవేర్చుకున్నాను" అని చెప్పటం చోద్యాతి చోద్యం.

ఏకాగ్రతతో అభ్యసించాల్సిన విద్య అంగడి వ్యాపారమైంది. చదువు "కొనే" వాళ్ళ సంఖ్య పెరిగిపోతోంది.

"తిలాపాపం తలాపిడికెడు" అన్నట్టు ప్రభుత్వాలు కూడా విద్యను విమానం ఎక్కించి సామాన్యుడికి అందలంలో తాయిలంలా చూపుతున్నాయి.

### చదువుకోవడం

రాజుల కాలంలో రాకుమారులు అడవుల్లో ఉండే ఆశ్రమ గురుకులపాఠశాలలకు తరలివెళ్ళేవారు. కఠోర నియమాలు పాటిస్తూ గురుకృపతో విద్య నేర్చుకునేవారు.

వేదాలు, పురాణాలు, ఆటలు, విలువిద్యవంటి అస్త్ర, శస్త్ర విద్యలతో బాటు విలువలు నేర్చుకునేవారు. విద్యార్థిగా పరిపూర్ణత్వం సాధించిన తర్వాతే బాహ్య ప్రపంచంలోకి అడుగు పెట్టేవారు. అలాంటి విద్యవల్ల మంచితనం, దయ, దాన గుణం, మంచి నడవడిక, జ్ఞానం అబ్బుతాయి.

అరవై డెబ్బై ఏళ్ళక్రితం కొన్ని గ్రామాలకు కలిపి ఒక పాఠశాలే ఉండేది. విద్యార్థులు మైళ్ళదూరం నడిచివెళ్ళి చదువుకునేవారు. తర్వాతికాలంలో గ్రామ గ్రామాన బడి వెలిసింది. నేడు వీధికో ప్రైవేట్ పాఠశాల పుట్టుకొచ్చింది.

రాన్రానూ విద్య నాణ్యత దిగజారింది. విలువలు తగ్గి, విద్యార్థుల్ని విలాసాలకి అలవాటు చెయ్యటం మొదలైంది. ఎ.సి. తరగతిగదులు, ఇంటి నుంచి స్కూలుకి ఎ.సి బస్సులు, పుస్తకాలకు తరగతి గదిలోనే లాకర్లు, డిజిటల్ డిస్‌ప్లే, ల్యాప్‌టాప్, ట్యాబ్ కల్చర్ వచ్చేసింది.. విద్యార్థులు, ఉపాధ్యాయుల వేషభాషల్లో, విలువలు తగ్గాయి. బద్ధకం, సోమరితనం మొదలైంది. ఉదాహరణగా ఇక్కడొక కథ చదువుదాం.



"ఒక జమీందారుకి ఒక రైతు అందమైన రామచిలుకని బహుమానంగా ఇచ్చాడు. ఆయన దాన్ని అల్లారుముద్దుగా బంగారు పంజరంలో పెంచుతూ, దానికి సహజంగా తినే తిండికంటే ఖరీదైన తిండి పెట్టేవాడు. పంజరం చుట్టూ చెట్లు పెంచి సహజసిద్ధమైన వాతావరణం కల్పించాడు.

చిలకమ్మ మాటలు నేర్చింది. జమీందారు పొంగిపోతూ అందరికీ గొప్పగా చెప్పేవాడు. అయితే

రాత్రానూ చిలక కూచున్నచోటు నుంచి కదలడం మానేసింది. సహజసిద్ధమైన ఎగిరే విద్య మరచి పోయింది. ఎంతోమంది నిపుణులు, వైద్యులు ప్రయత్నించినా ఫలితం లేకపోవడంతో జమీం దారులో విచారం మొదలైంది.

చిలుకను బహుమానంగా ఇచ్చిన రైతు ఒక సారి జమీందారు ఇంటికి వచ్చాడు. మాటల మధ్య జమీందార్ చిలకతీరును ప్రస్తావించి విచారపడ్డాడు. వెంటనే రైతు చిలుకని పంజరం లోంచి బయటికి తీసి ఇంట్లో అమర్చిన చెట్టుకొమ్మమీద ఉంచాడు. అయినా చిలుక ఎగరలేదు. రైతు ఓ కత్తి తెప్పించి చిలుక కూచున్నకొమ్మ నరికేశాడు. చిలుక చెంగున మరో కొమ్మమీదకు ఎగిరి కూచుంది. ఇలా ఒకటొ కటిగా చెట్టు కొమ్మలు నరికేశాడు రైతు. చిలుక ఇల్లంతా ఎగురుతూ కనువిందు చేసేసరికి జమీం దార్‌లో విచారం పోయింది".

అదేవిధంగా....

"విద్యార్థికి ముందు చదువు విలువ తెలియాలి. కష్టపడి చదువుకున్న విద్యార్థి ఆ చదువునేర్పిన సంస్కారాన్ని వృథా చేయడు".

విద్యావంతుడిలో సృజనాత్మకశక్తి ఉంటుంది. ప్రత్యక్షంగా, పరోక్షంగా అది సమాజానికి ఉపయోగ పడుతుంది.

"యాపిల్ కంపెనీ సృష్టికర్త స్టీవ్‌జాబ్స్. ఆ మధ్య ఆ కంపెనీ ఐఫోన్-4 తయారు చేసి స్టీవ్ జాబ్స్‌కి డెమో చూపించింది. "ఇంకా చిన్నదిగా, కొంచెం సన్నగా ఉంటే బావుండేది, ట్రై చెయ్యండి" అన్నాడట జాబ్స్.

"లేటెస్ట్ టెక్నాలజీనే ఉపయోగించాం, ఇంత కంటే చెయ్యలేం" అన్నారు ఉద్యోగులు.

వెంటనే స్టీవ్‌జాబ్స్ ఆ ఐఫోన్‌ను ఫిష్ ఎక్వే రియంలో పడేశాడు. అందులోంచి ఏర్ బబుల్స్ రాసాగాయి. "చూశారా ఆ ఫోన్లో గాలిదూరే సందు ఉంది. దానిని పూరించండి" అన్నాడట. అలా చేసిన నూతన ఆవిష్కరణే ఐఫోన్-5.

### చదువు "కొనడం"

కష్టపడి చదవాలి. కానీ ఇప్పుడు చదువు "కొనడం" మొదలెట్టాం.

"ఈ మధ్య ఓ తల్లి తన కొడుకుని అడ్మిషన్ కోసం కార్పొరేట్ కాలేజీకి తీసుకెళ్ళింది. మంచి రంగు, రూపానికి తగ్గ దుస్తుల్లో కుర్ర హీరోలా ఉన్నాడు ఆ అబ్బాయి. ప్రిన్సిపాల్‌తో వాళ్ళ సంభాషణ ఇలా సాగింది.

"ఎం.పి.సి.లో చేరుస్తారా?"

"లేదు, బైపి.సి.లో చేరుస్తా"

"కానీ లెక్కల్లో మంచి మార్కులొచ్చాయి గదా!



మెడిసిన్ చదివిస్తారా?"

"అవును"

"బాబూ నువ్వు మెడిసిన్ చదువుతావా?"

"ఊహు, మెడిసిన్ చదవను, ఎం.పి.సి.లోనే చేరతా!"

"నోర్మూయ్, మళ్ళీ మొదట కొస్తావేం"

"అబ్బాయిని చెప్పనివ్వండమ్మా!"

"వాడు చెప్పేదేంలేదు. వీడు డాక్టరవ్వాలన్నది వాళ్ళ నాన్న ఆశయం. ఆయన పోయారు. ఆయన ఆశ నెరవేర్చడం నా బాధ్యత" అంది తల్లి.

"నిజమేగానీ, అబ్బాయి ఇంట్రెస్ట్ లేదంటున్నాడు!"

"మెడిసిన్‌లో సీటువచ్చేలా వాణ్ణి చదివించే బాధ్యత మీదే. ఎంత ఖర్చు అయినా పరవాలేదు. వాడిలో ఆసక్తి క్రియేట్ చేసి చదివించండి. మీరు కాదంటే వేరే కాలేజీలో చేరుస్తా" అందామె దర్పంతో.

ఆమె మూర్ఖత్వం గ్రహించి మౌనం వహించి అడ్మిషనిచ్చాడు ప్రిన్సిపాల్. కానీ ఫలితం గురించి మీకు చెప్పక్కర్లేదు కదా!

### తల్లిదండ్రుల కర్తవ్యం:

- తమలా పిల్లలు కష్టాలు పడకూడదని, తమ పిల్లలు ఉన్నత స్థితిలో ఉండాలని తల్లిదండ్రులు కలలు కనడం తప్పుకాదు.
- పిల్లలకి అవసరమైనవి సమకూర్చండి. అనవస రాలకు వారిని దూరంగా ఉంచండి.
- మీ పిల్లల చదువుని మరొకరితో పోల్చకండి.
- పరీక్షల్ని, ర్యాంకుల్ని భూతద్దంలో చూపకండి.
- చక్కని ప్లానింగ్‌తో మొదట్నుంచీ చదువుకునేలా అవగాహన కల్పించండి.
- బట్టీపట్టటం మాన్పించి, విశ్లేషిస్తూ అవగాహన చేసుకోవడం నేర్పండి.
- పదే పదే మార్కులు, ర్యాంకుల ప్రస్తావన వల్ల వారిలో ఒత్తిడి పెరుగుతుంది.

ఆశించిన ఫలితం రాకపోతే ఆత్మన్యూనతతో పిల్లలు ఆత్మహత్యలకు కూడా సాహసిస్తున్నారని మరువకండి.

చదువుకున్నవాడూ, చదువు"కొన్న"వాడూ కూడా చరిత్రలో మిగిలిపోతున్నారు. చదువుకున్నవాడి "విజ్ఞానం" సమాజ హితానికి, చదువు "కొన్న" వాడి "అజ్ఞానం" వ్యవస్థ విధ్వంసానికి సహకరిస్తున్నాయి. వీటికి ఉదాహరణలు కోకొల్లలు.

## హేట్సాఫ్ డాక్టర్ ప్రకాష్ ఆమ్టే



"ఈ మధ్య ఆరోగ్యంపట్ల జాగ్రత్త పెరి గింది. ఉదయం నాలుగ్గంటలకే పార్కులు, బీచ్‌లు వెంట స్త్రీ పురుషులు పరుగులు తీస్తు న్నారు. ఎందుకంటే తలనొప్పికి కూడా ఖరీదైన టెస్టులు చేసి వేలకువేలు వసూలుచేసే సోకాల్డ్ వైద్యుల ధనదాహం తట్టుకోలేక జనం హడలెత్తి పోతున్నారు. కార్పొరేట్ ఆస్పత్రులు సరేసరి. లోప లికి అడుగు పెట్టాక ప్రతి కదలికకీ అణువణువునా డబ్బే. ఇదీ చదువు'కొన్న' వైద్యులు చేసే పని. మరి చదువుకున్న వైద్యుడు చేసే పని ఎలా ఉంటుందో చదవండి.

"మహారాష్ట్రకి చెందిన ప్రముఖ సంఘ సంస్కర్త, మెగసెసె అవార్డు గ్రహీత బాబా ఆమ్టే తనయుడు ప్రకాష్ ఆమ్టే. ఆయన, సతీమణి డా.మందాకినీ ఆమ్టే కలిసి 'లోక్ బిరదరీ ప్రకల్ప్ ప్రాజెక్ట్' కింద మహారాష్ట్రలోని గచ్చిరోలి జిల్లాలోని మదియాగోండ్ గిరిజన తెగ వారికి గొప్ప వైద్య సేవలు అందించారు.

అందుకే 2008లో 'కమ్యూనిటీ లీడర్ షిప్' క్రింద ఈ డాక్టర్ దంపతులకు మెగసెసె అవార్డు లభించింది.

1948 డిసెంబరు 26న జన్మించారు ప్రకాష్ ఆమ్టే. నాగపూర్ ప్రభుత్వవైద్య కళాశాలలో చది వారు. ఎం.బి.బి.ఎస్ తర్వాత ఎం.ఎస్. చదువు తుండగా మదియాగోండ్‌తెగ అభివృద్ధికోసం "లోక్ బిరదరీ ప్రకల్ప్ ప్రాజెక్ట్'ను రూపొందిం చారు. మహారాష్ట్ర ప్రభుత్వం ఈ ప్రాజెక్టు కోసం 'హేమల్ కాస'లో స్థలం కేటాయించింది.

ప్రకాష్ ఆమ్టే సోదరుడు వికాస్ ఆమ్టే కూడా డాక్టరే. దాంతో సోదరుడితో కలిసి ప్రకాష్ ఆమ్టే దంపతులు విద్యుత్తు, టెలిఫోన్ వంటి కనీస వస తులు లేని ఆ అటవీ ప్రాంతంలో గోండ్ తెగ వారికి వైద్య సేవలు అందించారు. అనేక శస్త్ర చికిత్సలు నిర్వహించారు.

ఆ ప్రాజెక్టులో భాగంగా లోక్‌బిరదరీ ప్రకల్ప దవాఖానా, రెసిడెన్షియల్ స్కూలు, గాయపడిన వన్యమృగాలకు జంతు సంరక్షణశాల నెలకొల్పారు. గోండ్ తెగవారి కోసం పాటుబడ్డారు. సంవత్స రానికి 4,000 మంది గోండ్ తెగవారి ఆరోగ్యం, అభివృద్ధికి పాటుబడ్డారు. ఏటా 600 మందికి పైగా గిరిజన విద్యార్థులు ఆ రెసిడెన్షియల్ స్కూలులో విద్యాభ్యాసం చేస్తున్నారు.

డా. ప్రకాష్ ఆమ్టే నిస్వార్థ సేవలకు గాను రామన్ మెగసెసె అవార్డుతో బాటు, మదర్ థెరిసా అవార్డు, లోకమాన్య తిలక్ అవార్డు, గాడ్‌ఫ్రే ఫిలిప్స్ లైఫ్ టైం అవార్డులతోపాటు 2002లో 'పద్మశ్రీ' అవార్డు పొందిన చదువుకున్న వైద్యుడు ప్రకాష్ ఆమ్టే.



5

# నిధి

-వక్కంతం సూర్యనారాయణరావ్ సెల్: 98662 67287

**"నాన్నా, ఉదయం నుండీ సాయంకాలం దాకా తీవ్రంగా ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చాను.." నిధి తండ్రి వైపు చూస్తూ అన్నాడు.**

**"ఏ విషయంలో నిధీ?" కర్దముడు ప్రశ్నించాడు.**

**"నవనిధులను సాధించే విషయంలో.."**

**"ఉదయం మనందరం మాట్లాడుతున్నప్పుడు మా అభిప్రాయాలకు అనుగుణంగా నిర్ణయించుకున్నావనుకున్నామే..." నిధి తల్లి అరుంధతి అంది.**

**"లేదమ్మా... ఆలయానికి వెళ్ళి వస్తూ, పర్వతపాదం వద్ద నిర్ణయం తీసుకున్నాను. నిధి సాధించడానికి వెళ్ళాలనుకుంటున్నాను."**

కర్దముడూ, అరుంధతీ, నవనీత నోళ్ళు వెళ్ళబెట్టి చూశారు.

ముందుగా అరుంధతి స్పందించింది. "సింహం గుహలోకి వెళ్తున్నావని తెలుసా నీకు?"

"అమ్మా, లాభనష్టాల గురించీ, ప్రమాదం గురించీ మనందరం చర్చించుకున్నాం. రాజ్యానికి సంబంధించిన ముఖ్యవిషయాలలో పాలకులకు ఉన్నట్టే పాలితులకూ బాధ్యత ఉంటుంది. మహారాజు నన్ను కోరిన సహాయం ఆయన వ్యక్తిగత ఉపయోగానికి ఉద్దేశించింది కాదు. రాజ్యమంతటికీ, రాజ్యంలో ప్రజలందరికీ సంబంధించిన అంశం. కప్పం చెల్లించకపోతే యుద్ధం తప్పదు. యుద్ధంతో నష్టపోయేది రాజూ, ఆయన ఆధీనంలోని సైనికులూ మాత్రమే కాదు. ప్రజలందరూ నష్టపోతారు. కష్టాల పాలవుతారు. ఈ విశ్లేషణ నాకు నా బాధ్యతనూ, ధర్మాన్నీ గుర్తుచేసింది..."

"అంగీకరిస్తాను.... కానీ..." కర్దముడు ఏదో చెప్పే ప్రయత్నం చేశాడు.

"ఇవాళ రెండు సంఘటనలు జరిగాయి నాన్నా. ఆ రెండూ నేను గానీ, మీరు గానీ ఊహించలేనివి. ఆ రెండింటిలో ఒకటైతే, మానవ మాత్రుడు ఎవ్వడూ ఊహించలేనిది.."

"ఏమిటి నాయనా అది?" అరుంధతి ప్రశ్నతో అడ్డు తగిలింది.

"సమయం వచ్చినప్పుడు చెప్తాను. ఆ సంఘటనలు రెండూ సుభిక్ష సామ్రాజ్యం కోసం సాహసం చేయమని ప్రబోధించాయి. నా క్షేమం గురించి ఆందోళన పడకండి. నవనిధులను సాధించే ప్రయత్నం చేస్తాను. అయితే తల్లిదండ్రులు ప్రసాదించిన ఈ శరీరాన్ని, నా ప్రాణాలను పణంగా పెట్టికాదు! ప్రాణాలకు ప్రమాదం ఏర్పడితే, పునరాలోచన చేయకుండా తిరిగి వచ్చేస్తాను. దానిని ఓటమిగా నేను భావించను. నేను వెళ్ళేది ఎవరో ప్రత్యర్థితో ద్వంద్వయుద్ధం చేయడానికి కాదు. నేను చేయబోయే సాహసం మహావీరహారం కోసం చేసే వీరదశమి స్పర్ధ కాదు.."



"అన్నాయ్, నీ నిర్ణయం మమ్మల్ని భయంతో, ఆందోళనతో నింపే దుస్సాహసం. నువ్వు వెళ్ళటానికి అమ్మా, నాన్నా ఒప్పుకున్నా నేనొప్పుకోను!" నవనీత కంఠంలో ఆవేశం ధ్వనించింది.

నిధి చెల్లెలి దగ్గరగా వెళ్ళాడు. రెండుచేతుల్తో ఆమెను దగ్గరగా తీసుకున్నాడు. నవనీత తలను అతని భుజం మీద వాల్చింది.

"నిన్ను ఎవరో రెచ్చగొట్టారు. ఎవరు?" నవనీత ప్రశ్నించింది, ముఖంపైకెత్తి తన అన్న ముఖం లోకి చూస్తూ.

నిధి చిరునవ్వుతో తల వాల్చి, చెల్లెలి కళ్ళల్లోకి చూశాడు.

"బలే కనిపెట్టావ్ నవనీ, రెచ్చగొట్టిందెవరో చెప్తే నమ్ముతావుగా?"

నవనీత తలాడించింది. నిధి రెండు చేతులూ పైకి జరిపి, చెల్లెలు తలను పట్టుకున్నాడు. సున్నితంగా నొక్కాడు. "నన్ను రెచ్చగొట్టింది కలశం?"

"కలశమా?!"

నిధి చిరునవ్వుతో తలాడించాడు.

"ఓహ్... ఆలయ గోపురం మీదున్న బంగారు కలశమన్న మాట!"

నవనీత ఉద్రేకంతో అంది. ఆమెది ప్రశ్న కాదు. అంచేత నిధి సమాధానం చెప్పలేదు. కొండమీద కోవెల, కోవెలలో వాలీశ్వరస్వామి లింగం, ధ్వజస్తంభం, గోపురం మీద కలశం, బిల్వ వృక్షం – ఏది ఏ విధంగా 'స్పందించినా' – నవనీత ఇట్టే నమ్మేస్తుంది. లింగంమీద నుంచి పుష్పం రాలితే అదొక సూచన. శివుడి అనుజ్ఞ. శివుడి వరం. శివుడి ఆమోదం! ధ్వజస్తంభాన్ని ఊపగానే గంట మోగితే శుభసూచన! గోపురం మీద కలశం తళుక్కుమంటే శుభసూచన. బిల్వవృక్షం వద్దకు వెళ్ళగానే గాలికి ఒక ఆకురాలితే శుభసూచన! ఆలయంలో అంబికేశ్వరుడంటే నవనీతకు ఆరోప్రాణం.

"కలశం మెరిసిందా? అయితే శుభసూచనే!" నవనీత ఆవేశంగా అంది.

నిధికి అర్థమైపోయింది. వెళ్ళమని నోరారా అనకపోయినా చెల్లాయి ఇంక అడ్డుచెప్పదు. భగవంతుడు సర్వశక్తిమంతుడు.

ఇలాంటి కార్యాలు జరిపిస్తూ ఉంటాడు!

"నీ కొడుకు 'నిధి సంపాదన సాహస యాత్ర మీద బయలుదేరతాడని స్వయంగా మహారాజుగారికి తెలియజేయి నాన్నా!" నంది ఉత్సాహంగా అన్నాడు.

కర్దముడూ, అరుంధతీ ముఖాలు చూసుకున్నారు.

***

"మహారాజు నందికేశ్వరుడూ, మహా మంత్రి సత్యసంధుడూ మంత్రాలోచన మందిరంలో ఎవరి కోసమో ఎదురు చూస్తున్నట్లు కూర్చున్నారు. చిరుగంటల సవ్వడితో తలుపులు తెరచుకున్నాయి. ద్వారపాలకుడు గడపదాటి వినయంగా తల వాల్చాడు.

"ఆస్థాన జ్యోతిష్కులు ముక్కంటిగారు తమ దర్శనార్థం వచ్చారు ప్రభూ..."

"తీసుకురా!" నందికేశ్వరుడు ఆజ్ఞాపించాడు.

ద్వారపాలకుడు వెలుపలికి వెళ్ళాడు. ముక్కంటి లోపలికి వచ్చాడు. అతని ఎడమచేతి క్రింద కవిలె ఇరుక్కుని ఉంది. మహారాజు ఏ క్షణాన ఏ విషయం అడుగుతాడో తెలీదు. పంచాంగమూ, రాజ కుటుంబసభ్యుల జాతకాలూ, సుభిక్ష రాజ్య భవితవ్యం గురించి తాను రూపొందించిన జాతక చక్రమూ అన్నీ కవిలెలో ఎప్పుడూ ఉంటాయి. కవిలె తన చేతిక్రింద ఉంటుంది.

"విజయోస్తు మహారాజా!" అన్నాడు ముక్కంటి.

"విజయోస్తు" అని నవనిధుల కోసం వెళ్ళే వీరుడు నిధిని ఆశీర్వదించండి!" నందికేశ్వరుడు నవ్వుతూ అన్నాడు.

"ఓహ్! అయితే, ఆ యువకుడు సానుకూలంగా స్పందించాడన్నమాట! శుభం!" ముక్కంటి ఉత్సాహంగా అన్నాడు.

"ఎందుకు స్పందించడు ఆచార్యా? ప్రభువులు ఆశ చూపిన పారితోషికం చీమకు బెల్లం లాంటిది కదా!" సత్యసంధుడు చిరునవ్వుతో అన్నాడు.

ముక్కంటి తల అటూఇటూ ఊగింది. "మహామంత్రిగారి అభిప్రాయంతో విభేదిస్తున్నాను. కేవలం పారితోషికం కోసం ఎవ్వరూ ప్రాణాంతకమైన సాహసం చేయరు..."

"అతను అంగీకరించాడు. స్వయంగా అతని తండ్రి కర్దముడు వచ్చి, ప్రభువుల దర్శనం చేసుకుని విన్నవించాడు. మార్గ దర్శనం కోసం మిమ్మల్ని కలుసుకొమ్మన్నాం. పారితోషికం ఆశ లేకపోతే ఆ ముసలి తండ్రి దేనికి వస్తాడు?" సత్యసంధుడు అన్నాడు.

**జరిగిన కథ**

**సు**భిక్ష రాజ్యంలో వీరదశమి సందర్భంగా జరిగిన తుది స్పర్థలో నిధిని విజయం వరించినా, అతడు క్షత్రియుడు కానందున పోటీని విరమిస్తున్నట్టు ప్రకటిస్తారు. చక్రవర్తి విజయానందులు బాకీపడ్డ కప్పం చెల్లించాలని, లేనిపక్షంలో వియ్యమందాలని లేఖ పంపిస్తాడు. పరిష్కారమార్గంగా జ్యోతిష్కుడు నవనిధుల గురించి చెబుతాడు. నవనిధులను సాధించి తీసుకురావాల్సిందిగా నిధిని కోరతాడు మహారాజు. ఆలయానికి వెళ్ళిన నిధి ముందు అశ్వత్థామ బహిర్గతమవుతాడు. యువరాణి ఉత్పల నిధిని కలిసి నవనిధుల సాధనకు వెళ్ళాల్సిందిగా అభ్యర్థిస్తుంది. **ఆ తర్వాత...**

"యువకుడు నిధి తనను వీరాధివీరుడుగా నిరూపించుకున్నాడు. నవనిధి సాధన తన శౌర్య పరాక్రమాలకూ, శక్తిసామర్థ్యాలకూ పరీక్షగా స్వీకరించి ఉంటాడు. వీరుల లక్షణం అది. మహావీరులైన మన మహారాజుగారికి తెలిసిన సత్యమే అది!" ముక్కంటి నందికేశ్వరుడి వైపు చూస్తూ అన్నాడు.

"ఔనౌను! అది వీరలక్షణమే!" నందికేశ్వరుడు సగర్వంగా అన్నాడు.

"అది అలా ఉంచుదాం... సమ్ముఖానికి రమ్మన్నారట" ముక్కంటి వినయంగా అన్నాడు.

"ఔను. ఆ యువకుడు నిధి మార్గదర్శనం కోసం మిమ్మల్ని కలుసుకుంటాడు. నవనిధుల వివరాలు అడుగుతాడు. అన్నీ వివరించండి. ఒక్క అంశం తప్పించి..." నందికేశ్వరుడు అన్నాడు.

"ఏమిటా అంశం ప్రభూ?"

"నవనిధుల్ని తొమ్మిది సర్పాలు సంరక్షిస్తున్నాయన్న విషయం!" నందికేశ్వరుడు అన్నాడు.

ముక్కంటి కళ్ళు చిట్లించాడు. "అవి భయంకరమైన విష సర్పాలు. జాగ్రత్త చెప్పకపోతే ఎలా?"

"అపాయం ఎదురైనప్పుడు ఆత్మరక్షణ చేసుకోవడం ప్రతీ



ప్రాణికీ జన్మసిద్ధమైన సహజమైన లక్షణం! ఒకరు జాగ్రత్త చెప్పినా, చెప్పకపోయినా మనిషి నిప్పులకు దూరంగా ఉంటాడు" సత్యసంధుడు అన్నాడు.

"నిజమే ఆచార్యా!" నందికేశ్వర మహారాజు కల్పించుకుంటూ అన్నాడు. "నేను మహావీరుడినే! మీకు తెలుసు! పాము బుసకొడితే పారిపోతాను. అది పుట్టుకతో వచ్చిన ఆత్మరక్షణ చర్య. సహజమైన స్పందన! విషసర్పాల గురించి వివరించి భయ పెట్టడం దేనికి? వెళ్ళనివ్వండి. ప్రయత్నించనివ్వండి. సర్పాల దర్శనం అయినప్పుడు తనను తాను సంర క్షించుకుంటాడు!"

"మహారాజుగారు అలా అంటే..."

"అనడం కాదు ఆచార్య... ఆజ్ఞాపించడం అను కోండి!" నందికేశ్వర మహారాజు గంభీరంగా అన్నాడు. "మా ఆజ్ఞను మీరు శిరసావహిస్తారని మాకు తెలుసు!"

"ప్రభువులు 'ఆహా!' అంటే ఆస్థానజ్యోతిష్కుడు "ఊహూ!" అనలేరు కదా! అనలేడు! అనకూడదు! అనడు!" ముక్కంటి చిరునవ్వుతో అన్నాడు. యువ కుడు నిధికి ఎంత చెప్పాలో అంతే చెప్తాను."

"నిధిని ఉత్సాహపరచండి! నవనిధి సాధన అతని లాంటి మహావీరుడికి నల్లేరుమీద నడకే అని చెప్పండి!" సత్యసంధుడు అన్నాడు.

"ఆచార్యా..."

"ప్రభూ?"

"జ్యోతిష జ్ఞాననేత్రంతో నవనిధులను దర్శించి, మమ్మల్ని నమ్మించి ఉత్సాహపరిచారు. అదే విధంగా ఆ యువకుడిని ఉత్సాహపరచండి!"

"ఆజ్ఞ..."

"ప్రస్తుతానికి అతనికి సంబంధించినంతవరకూ, నవనిధుల్ని కాపుకాసే సర్పాలు లేవు!"

"చిత్తం ప్రభూ! ఒక్కసారి ఆజ్ఞాపిస్తే చాలు. అతని ముందు ఆ సర్పాల ప్రస్తావన రాదు!" ముక్కంటి అన్నాడు.

"కర్దముడికి చెప్పడం మరిచాం. మన అశ్వ శాలకు వెళ్ళి, తనకు నచ్చిన జవనాశ్వాన్ని తీసు కొమ్మని నిధికి చెప్పండి ఆచార్యా" మహామంత్రి అన్నాడు.

"అలాగే".

***

"రా నాయనా, రా! నువ్వు వస్తావని నాకు తెలియచేయబడింది!" గుమ్మంలో నిలుచున్న నిధిని ఆహ్వానిస్తున్నాడు ముక్కంటి.

"ఇది తమకు మా నాన్నగారి నమస్కారం. ఇది నా నమస్కారం!" నిధి రెండుసార్లు వినయంగా చేతులు జోడిస్తూ అన్నాడు.

**అశ్వశాల మధ్యనున్న సువిశాలస్థలంలో వందలాది అశ్వాలు తిరుగుతున్నాయి. కొన్ని అశ్వాలు పరుగెడుతున్నాయి. కొన్ని సోమరిపోతుల్లా నిలుచున్నాయి. వాటికి ఆటవిడుపు సమయంలా ఉంది. లోపలికి ప్రవేశించి చుట్టూ చూస్తున్నాడు నిధి. చివరిగా అతని చూపు కక్ష్యలో పాలనురుగులా తెల్లగా మెరిసి పోతున్న శ్వేతాశ్వంపై పడింది. కానీ దాన్ని తీసుకెళ్ళడానికి అశ్వపాలకుడు అడ్డు పడ్డాడు. ఎందుకని?**

"దీర్ఘాయుష్మాన్ భవ!" ముక్కంటి దీవించాడు. "నీ తండ్రి నీలాగే మహాసాహసి నాయనా. ప్రభు వులకు స్వయంగా అంగీకారం తెలియజేసుకున్నాడట కదా!".

"ఔను ఆర్యా! నా నిర్ణయానికి తల్లిదండ్రుల అనుమతి కూడా ఉందని మహారాజుగారికి తెలి యాలి కదా!"

"సముచితమైన స్పందన!" ముక్కంటి కూర్చుంటూ అన్నాడు. "కూర్చోనాయనా. ఇది సావధానంగా విని గుర్తుంచుకోవాల్సిన విషయం!"

"నాకు మీరు మార్గదర్శనం చేస్తారని నాన్న చెప్పారు..." నిధి ఆసనం మీద కూర్చుంటూ అన్నాడు.

"ఔను. అది రాజుగారి ఆజ్ఞ. పౌండ్రక పర్వతం మన సుభిక్ష సామ్రాజ్యానికి ఉత్తరదిశలో ఉన్న పొలిమేర. అయినప్పటికీ పర్వతం పూర్తిగా మన రాజ్యానికే చెందుతుంది. పొరుగు రాజ్యమైన కర వీర రాజ్యానికి ఆ పర్వతం మీద ఎలాంటి అధికారం లేదు. అది అలా ఉంచితే, నవనిధులు పర్వత గర్భంలో ఉన్నాయి. 'పర్వతగర్భం' అంటే గుహ అని అనుకోవద్దు. మన వద్ద ఉన్న ఆధారాలనుబట్టి నువ్వు నిధులు నిక్షేపించబడిన స్థానాన్ని కని పెట్టాలి. కరవీర రాజ్యానికీ, మన రాజ్యానికీ మధ్య గోడలాగా వందల యోజనాల పొడవుతో ఉంది మన పౌండ్రక పర్వతం. నవనిధుల సన్నిధికి చేర్చే మార్గం కొన్ని కొండగుర్తులతో పరోక్షంగా సూచించ బడింది. అవన్నీ వివరిస్తాను; ఏకాగ్రతతో ఆల కించు..." తాళపత్ర గ్రంథాన్ని అందుకుంటూ అన్నాడు ముక్కంటి.

***

ముక్కంటి చేతిలోని పాత తాళపత్రాలను పరిశీ లిస్తూ చెప్పిందంతా నిధి మౌనంగా విన్నాడు. ఆయన వివరించిన చెట్లూ, పుట్టలూ, రాళ్ళూరప్పలూ అన్నీ తను చక్కగా గుర్తుపెట్టుకోవాలి.

ముక్కంటి తాళపత్ర గ్రంథాన్ని జాగ్రత్తగా మూస్తూ, నిధివైపు చూశాడు. "ఈ గుర్తుల ఆధా రంగా నువ్వు పౌండ్రక పర్వతప్రాంతంలోని గమ్యం చేరుకోవాలి. ఉదాహరణకి– 'శివార్జున వృక్షం' అని ఉంది. అంటే ఏమిటి? అర్జునవృక్షం అంటే మద్దిచెట్టు. ఎక్కడో ఉన్న ఏదో మద్ది చెట్టుని ఎవరో వేదాంతో, భక్తుడో, తపస్వి అయిన సాధకుడో– 'శివార్జున వృక్షం' అని ఉంటాడు. ఇదే విధంగా ఇతర ఆధా రాలు... అర్థమైందిగా నాయనా?"

"చక్కగా అర్థమైంది ఆర్యా".

"మరచిపోకుండా గుర్తుపెట్టుకోవాలి సుమా!"

"అలాగే, ఆర్యా.. నాదొక సందేహం..." నిధి అన్నాడు.

"సందేహాలు తీర్చడమే జ్యోతిష్కుడిగా నా వృత్తి నాయనా! అడుగు" ముక్కంటి సగర్వంగా అన్నాడు.

"నిధులనూ, నిక్షేపాలనూ నాగేంద్రుడు రక్షిస్తూ కాపలా ఉంటాడనీ, ఆ నాగేంద్రుడికి ఏడు పడగ లుంటాయనీ చెబుతూ ఉంటారు. మీరు చెప్తున్న నవనిధులను కాపాడుతూ ఎందరు నాగేంద్రులు ఉంటారు; ఆ నాగేంద్రులకు పడగలు ఎన్నెన్ని – అనే విషయం మీరు చెప్పలేదు.." నిధి చిరునవ్వు నవ్వాడు.

ముక్కంటి నిర్ఘాంతపోతూ చూశాడు. తాను ఊహించని ప్రశ్న. తాళపత్ర గ్రంథం మీద ఉంచు కున్న చెయ్యి కొద్దిగా వణికింది. నాలుకతో పెదవులు తడుపుకుని, చిరునవ్వు నవ్వే ప్రయత్నం చేశాడు.

"ఆ విషయం నేను చెప్పలేను నాయనా..."

నిధి తల పంకించాడు. "కొండగుర్తులూ, బండ గుర్తులూ అంటూ అన్ని వివరాలు చెప్పిన ఆ గ్రంథం నిధిని కాపాడే సర్పాల గురించి చెప్పకపో వడం ఆశ్చర్యంగా ఉంది. ఒకవేళ... ఆ నిధులకు కాపలాగా సర్పాలు లేవేమో!"

తలను నిలువుగా కానీ, అడ్డంగా కానీ ఊపే సాహసం చేయలేని ముక్కంటి చిరునవ్వు నవ్వే ప్రయత్నం చేశాడు. కూర్చున్న చోటునుండి పైకిలేచి నిలుచున్నాడు. నిధిని త్వరగా పంపించి వేయడం మంచిది.

నిధి పైకి లేచాడు. "నాకు చెప్పాల్సింది ఇంతేనా, ఇంకా ఏమైనా ఉందా ఆర్యా?"

"అబ్బే... ఇంకేమీలేదు నాయనా...." ముక్కంటి వెంటనే అన్నాడు. "ఆ...ఆ... అన్నట్టు మరచాను. దివాణం అశ్వశాలకు వెళ్ళు. నీకు నచ్చిన అశ్వాన్ని



తీసుకెళ్ళు. మహారాజుగారి అనుజ్ఞ అయ్యింది.”.

“ఆర్యా...”

“ఏం నాయనా?”

“పర్వతగర్భంలో నిధులున్నాయని, ఆ గ్రంథం ఆధారంతో మీరు నిర్ణయించారా?”

“అవును”.

నిధి చిరునవ్వు నవ్వాడు. “అయితే నా గురించి ఒక విషయం చెప్పండి... నిధి సాధన సాహసంలో నేను జయిస్తానా?”

ముక్కంటి నిధి ముఖంలోకి నిదానించి చూశాడు. “ఆ ఘనకార్య సాధనకు తగిన యోధుడు నువ్వే అని నేను లెక్క తేల్చాను. తప్పక జయిస్తావు నాయనా! వెళ్ళిరా! విజయోస్తు!”

***

కోట ప్రాకారానికి దగ్గరగా ఉన్న అశ్వశాల వైపు వెళ్ళాడు నిధి. వెడల్పాటి కటకటాల ద్వారం తెరచి ఉంది. గున్నయేనుగుల్లా ఉన్న దున్నపోతులు లాగుతున్న పెద్ద బండి లోపలికి వెళ్తోంది. బండి మీద ఎత్తుగా జంబు మోపులు పేర్చి ఉన్నాయి. లావుపాటి జంబు పరకలు ఆకుపచ్చరంగులో మెరుస్తున్నాయి. ఏనుగుల మేత! నలుగురు సేవకులు పెద్దపెద్ద గంగాళాల కావిళ్ళు లోపలికి మోసుకెళ్తున్నారు. గుగ్గిళ్ళ వాసన గాలిలో వ్యాపిస్తోంది. గుర్రాల దాణా!

చేతబల్లెంతో ద్వారం ముందు నిలుచున్న లావుపాటి వ్యక్తి నిధి వైపు ప్రశ్నార్థకంగా చూశాడు. బానలాగ ఉన్న బొజ్జకి అతని అంగీ అతుక్కుపోయి ఉంది. నంది అతని ముందు ఆగాడు.

“అశ్వపాలకుడి కోసం వచ్చాను..” అన్నాడు నిధి. “నా పేరు..”

“నిధి! నాకు తెలుసు. వీరదశమినాడు చూశానుగా!” బొజ్జ వ్యక్తి చిరునవ్వుతో అన్నాడు. “లోపలికెళ్ళు. ఎడమ వైపు ద్వారందాటితే, అశ్వశాలలో ఉంటావు!”

నిధి తల ఊపి కటకటాల ద్వారం దాటి లోపలికి వెళ్ళాడు. కుడివైపు వరసగా అరలు అరలుగా కక్ష్యలున్నాయి. ఒక్కొక్క అరలో ఒక్కొక్క ఏనుగు.. కుడివైపున గజశాల. ఎడమ వైపున అశ్వశాల. నిధి ఎడమ వైపు తిరిగాడు. కొంచెం దూరంలో కటకటాల ద్వారం. అది మూసి ఉంది.

నిధి ముందుకు నడిచాడు. కటకటాల ముందు నిలుచుని లోపలికి చూశాడు. చాలా విశాలంగా ఉన్న ప్రాంగణం. ప్రాంగణం రెండు వైపులా అశ్వశాలలున్నాయి. మధ్య ఉన్న సువిశాల స్థలంలో వందలాది అశ్వాలు తిరుగుతున్నాయి. కొన్ని గుర్రాలు పరుగెడుతున్నాయి. కొన్ని సోమరిపోతుల్లా నిలుచున్నాయి. అశ్వాలకు ఆటవిడుపు సమయంలా ఉంది. వాటికి కళ్ళేలు లేవు.

నిధిని చూసిన ఒక వ్యక్తి ఠీవీగా గుర్రాల మధ్య నడుస్తూ కటకటాల దగ్గరగా వచ్చాడు. నిధి వైపు ప్రశ్నార్థకంగా చూశాడు.

“నా పేరు నిధి. అశ్వం కోసం...” నిధి ప్రారంభించాడు.

“మందిరం నుండి వర్తమానం వచ్చింది. మీకు నచ్చిన గుర్రాన్ని ఇమ్మన్నారు. లోపలికి రండి” అశ్వపాలకుడు కటకటాల ద్వారాన్ని తెరుస్తూ అన్నాడు. నిధి ప్రాంగణంలోకి నడిచాడు. అశ్వపాలకుడు ద్వారాన్ని మూసి, నిధి దగ్గరగా వచ్చాడు.

“అన్నీ జాతి గుర్రాలే. జవనాశ్వాలే! మన అశ్వశాలలో నాసిరకం గుర్రాలన్నవి లేవు! అశ్వ పాలకుడు సగర్వంగా అన్నాడు. “కలయజూసి, కావాల్సిన గుర్రాన్ని ఎన్నిక చేసుకోవచ్చు!”

రెండు గుర్రాలు ఒకదాన్నొకటి తోసుకుంటూ పోట్లాటకు సిద్ధమవుతూ, అశ్వపాలకుడి దృష్టిని ఆకర్షించాయి. అతను ఆ గుర్రాలవైపు వెళ్ళాడు.

ఆరుగురు సేవకులు బుట్టలు పట్టుకుని, గుర్రాల మధ్య తిరుగుతూ గుర్రాలు విసర్జించిన లద్దిని తీసి బుట్టల్లో వేసుకుంటున్నారు. గుర్రాల శరీరాల వాసన నిధికి స్వాగతం చెప్తోంది. నిధి విచ్చలవిడిగా విహరిస్తున్న గుర్రాల మధ్య జాగ్రత్తగా నడవడం ప్రారంభించాడు. ఎలాంటి గుర్రాన్ని, ఏ రంగు గుర్రాన్ని ఎంపిక చేసుకోవాలి?

“నిధీ, శ్వేతాశ్వాన్ని ఎన్నిక చేసుకో!” ఏదో పురుష కంఠం...

నిధి ఒక్కసారి ఉలికిపడ్డాడు. వెనుదిరిగి చూశాడు. ఎవ్వరూలేరు. ఏదో దుర్గంధం అతని నాసికకు సోకడం ప్రారంభించింది... అదృశ్యరూపంలో అశ్వత్థామ!!

ఉన్నట్టుండి చాలా గుర్రాలు సకిలించడం ప్రారంభించాయి.

“ఆర్యా...” నిధి అప్రయత్నంగా అన్నాడు.

“నేనే! అశ్వత్థామను! నా కంఠస్వరం విచిత్రంగా అశ్వాలకు వినిపించినట్టుంది! అందుకే అవి సకిలించాయి. నా కంఠస్వరం వాటికి మరొక గుర్రం సకిలింతలా వినిపించి ఉండవచ్చు..”




నన్ను నేను మరచిపోయి
తన దగ్గరికి వెళ్ళాను!
చిత్రం...
తన దగ్గర
నాకంటే ముందు నేనే ఉన్నాను!

## నేను రాలిన చోట!

కళ్ళల్లోకి చూశాను
నిజమే...
రెండు ఆకాశాల నిండా నేనే!

ఎద నిండా నేనేనేమో
బరువెక్కి వెక్కి వర్షించిందట
ఏరులా పారి విరహగుండంలో
చుట్టుకుపోయినట్లు ఆ మోము!

రెప్పలు వాల్చింది
రెండు చుక్కలుగా రాలిపడ్డాను
నాకు నేనే గాయపడ్డాను!

పలుకులన్నీ ఎడారి రేణువులై
తడికోసం తహతహలాడుతూ
ఎగిరిపోయిన భావాలన్నీ
రెక్కలు కట్టుకుని వాలేదెన్నడని
ఎదురుచూపుల దూరాలతో
తపస్సు చేస్తున్నాయి!

చూపులను కదిలించే
వయ్యారం నా మాటలో లేదేమో!
దృష్టిని తప్పించే
మాయా సౌందర్యం నేనెరుగను!

తనువంతా శిలగా మారి
శిల్పమై నిలిచింది!
శిల్పిలా మారినా



నవరసాలు ఒలికించలేను!

లోలోపల ఎంత సముద్రఘోషో
చివరాఖరికి ఒక్కగానొక్క
నవ్వు రాల్చింది
నా రూపం చిన్నబోయింది!

తన హృదయం
నా లోకమయ్యిందని
స్పందించిన ప్రతిసారీ
నా గుండెను కదిలిస్తుంటే

నాదగ్గర మౌనంతప్ప
మరే భావం లేదు!
తన ఊహలా మారడం తప్ప
మరే గమ్యం లేదు!


–పుట్టి గిరిధర్
సెల్: 94914 93170



## మార్కెట్‌లో అమీ బికినీలు?

మార్కెట్‌లో అమీ బికినీలు అంటే ఆమె వేసుకునే బికినీలు కావు. బికినీల వ్యాపారం చేయాలని అమీ డిసైడ్ అయ్యిం దట! అమీకి ఈ ఆలోచన ఎందుకు వచ్చిందంటే...ఇటీవల విదేశాలకి వెళ్ళిన సమయంలో అమీకి సరిపోయే బికినీ దొరకక చాలా ఇబ్బందిప డిందట! అమీ తరచూ దర్శనమిచ్చేదే బికినీల్లో. దాంతో తనకు సరిపోయే బికినీ కోసం వెతికి వెతికి వేసారిపోయిన అమీకి వాటికున్న డిమాండ్ అర్థమయ్యిందట! దాంతో సైడ్ బిజినెస్‌గా బికినీల వ్యాపారం చేయాలని డిసైడ్ అయిందట! కాకపోతే ఈవిడగారు అమ్మే బికి నీలు మార్కెట్‌లో దర్శనమివ్వడానికి ఇంకాకొంత సమయం పడుతుందట!

"వింతగా ఉంది" నిధి మెల్లగా అన్నాడు.

"ఆ వింత నా జననానికి సంబంధించింది నిధీ! నా మాతృమూర్తి గర్భం నుంచి భూమి మీద పడగానే నేను దేవేంద్రుడి అశ్వం అయిన 'ఉచ్చైశ్రవం' లాగా సకిలించానట. ఆ క్షణాల్లో నాది శిశురోదనం కాదు. 'అశ్వహేష' – అంటే గుర్రం సకిలింత. నేను పుట్ట గానే చేసిన 'అశ్వహేష' కారణంగా, నా తండ్రి గారు 'అశ్వత్థామ' అనే నామధేయం ప్రసాదించారట! అది అలావుంచు. శ్వేతాశ్వం కనిపిస్తోందా?" అశ్వ త్థామ ప్రశ్నించాడు.

నిధి అశ్వాలను కలియజూశాడు. ఎర్ర గుర్రాలు, నల్ల గుర్రాలు, బూడిదరంగు గుర్రాలు. ఇంకా రక రకాల రంగులతో, రంగుల మేళవింపులతో ఉన్న వందలాది గుర్రాలు...

"లేదు ఆర్యా... శ్వేతాశ్వం కనిపించడం లేదు."

"శతాధిక అశ్వాలలో ఆ శ్వేతాశ్వం లేదు" అన్నాడు అశ్వత్థామ. చిన్నగా నవ్వాడు. "అది తన కక్ష్యలోనే బంధించబడి ఉంది. ఆ కక్ష్య కుడివైపున మూలలో ఉంది. ఇక్కడి నుండి చూస్తే కనిపించదు. అశ్వపాల కుడిని అడుగు."

నిధి గుర్రాల మధ్య కొంతదూరం నడిచాడు. అశ్వపాలకుడు దగ్గరగా వచ్చాడు. "ఏ గుర్రాన్ని ఇష్టపడ్డారు?"

"నాకు తెల్లగుర్రం కావాలి..."

"తెల్లగుర్రమా? అది... ఇక్కడ లేదే!" అశ్వపాల కుడు ఆశ్చర్యంగా అన్నాడు.

"అది తన కక్ష్యలో ఉంది.."

"ఆ పొగరుబోతు గుర్రం గురించి నీకు ఎలా తెలుసు?"

"విన్నాను... వెళ్ళి తీసుకురా!?"

"ఎవరు చెప్పారో గానీ, ఆ శ్వేతాశ్వం గురించి మీకు పూర్తి వివరాలు చెప్పినట్టు లేదు.."

"ఏమిటా వివరాలు?" నిధి ప్రశ్నించాడు.

"ముందుకి వెళ్తే నోరు తెరచి కొరికేస్తుంది. వెనక వైపు వెళ్తే కాళ్ళు విరిగి పోవడమో, పళ్ళు రాలిపోవ డమో జరుగుతుంది. ప్రమాదం! నన్నడిగితే, అది గుర్రం కాదు; గుర్రం రూపంలో ఉండే రాకాసి! శాలలో ప్రవేశించిన నాటి నుండీ ముగ్గురికి పళ్ళు రాలిపోయాయి. నలుగురికి కాళ్ళు విరిగిపోయాయి. ఒకణ్ణి – నోటితో పీక కరచుకొని ఏదో మూటను లాక్కెళ్ళినట్టు గోడ దాకా లాక్కెళ్ళింది. ఆ సేవకుడు, పాపం చచ్చి బ్రతికాడు! మరో గుర్రం తీసుకోండి!"

"నాకు ఆ శ్వేతాశ్వమే కావాలి!" నిధి మొండిగా అన్నాడు.

"నా మాట వినండి. మీకు తెలీదు. నిజం చెప్పాలంటే ఇప్పటివరకు ఏ మొనగాడూ ఆ పిశాచం మీద ఎక్కి కూర్చోలేదు! మూతికి కళ్ళెం వేయలేం, మూపుమీద జీను పెట్టలేం!" అశ్వ పాల కుడు అన్నాడు. నా గురించి నేను నానోటితో చెప్ప కూడదు గానీ, 'దామగ్రంధి' అనే పేరుతో విరాట రాజు కొలువులో అశ్వపాలకుడుగా సేవలు చేసిన నకులుడంతటి నేర్పరిని! ఆ మాయదారి గుర్రాన్ని లొంగదీయడం నా వల్లే కాలేదు!"

'నిధీ.... శ్వేతాశ్వమే కావాలను!" అశ్వత్థామ కంఠం హెచ్చరించింది.

"ఎంత పొగరుమోతుదైనా సరే, నాకు ఆ తెల్ల గుర్రమేకావాలి. వేరేరంగు గుర్రం ఎక్కకూడదు నేను!" నిధి అన్నాడు.

"హు! తల నుంచి తోకదాకా వీపు మీదుగా ఆ శ్వేతాశ్వానికి బంగారురంగు గీత ఉందన్న కార ణంతో మీరు మొండి కేస్తున్నట్టున్నారు! ఆ రంగులో ఏముంది గొప్పతనం? ఉడత వీపు మీదా ఉంటాయి బంగారు రంగు గీతలు!"

"సరే అయితే... మహారాజుగారికి మనవి చేసు కుంటాను!" నిధి కటకటాల ద్వారంవైపు తిరిగాడు.

"ఆగండి! నాకెందుకూ శిక్ష? నిధి అనే వీరుడు కోరిన గుర్రాన్ని అప్పగించమన్నారు. అప్పగించే స్తాను. ఆ గుర్రం ఉన్న అర తలుపు తెరుస్తాను; మీరు లోనికి వెళ్ళగానే మూసేస్తాను. కళ్ళెం తగిలిం చడం, జీను అమర్చడం – అన్నీ మీరే చూసుకోవాలి! ఆ!" అశ్వపాలకుడు నిష్ఠూరంగా అన్నాడు.

"అందుకు అభ్యంతరం లేదు, అను!" అశ్వత్థామ కంఠం అంది.

"అందుకు అభ్యంతరం లేదు!" నిధి చిరునవ్వుతో అన్నాడు.

"ఎవరి రాత వాళ్ళది!" అంటూ కదిలాడు అశ్వ పాలకుడు.

నిధి అతన్ని అనుసరించాడు. గుర్రాలు ఆప కుండా సకిలిస్తూనే ఉన్నాయి.

"ఏమిటో ఈ గోల! ఏనాడూ మనిషి ముఖం చూడ నట్టు గుర్రాలన్నీ, మీరు వచ్చినప్పట్నుంచీ ఆపకుండా సకిలిస్తూనే ఉన్నాయి!" అశ్వపాలకుడు అన్నాడు.

"నన్ను తమ జాతి వాడనుకున్నాయేమో!" నిధి నవ్వాడు.

ఇద్దరూ తెల్లగుర్రం కక్ష్య ముందు ఆగారు. మూతి దగ్గర నుండి బంగారు రంగు గీత – రెండు అంగు ళాల వెడల్పుతో ప్రారంభమైంది. తల మీదుగా, ఇంకా వెడల్పుగా అవుతూ జూలు మీదుగా, వీపు మీదుగా గుర్రం తోకదాకా వెళ్ళింది. తోక పూర్తిగా బంగారు రంగులో ఉంది! నిధి ఆశ్చర్యంతో నోరు తెరిచాడు. స్వర్ణరేఖ ఉన్న తెల్లగుర్రాన్ని మొదటిసారి చూస్తున్నాడతను. దాని శరీరం పాలనురుగులా తెల్లగా మెరుస్తోంది.

"గుర్రాలకు ఇలా బంగారు రంగు గీత ఉంటుందా?" నిధి అశ్వపాలకుడిని అడిగాడు.

"బెత్తెడు ఉడతకే వీపుమీద బంగారు గీతలున్న పుడు గుర్రానికి ఎందుకుండదు? సృష్టిలో ఎన్ని వింతలో! ఎన్ని విచిత్రాలో!"

అశ్వపాలకుడు కటకటాలకు బిగించిన తాళం తెరవడానికి దగ్గరగా వెళ్ళాడు. శ్వేతాశ్వం ఎర్రటి కళ్ళతో ఓరగా చూస్తూ అసహనంగా తైతక్కలాడ్డం ప్రారంభించింది. జాగ్రత్తగా ఒక పక్కకు జరిగి, కట కటాల రక్షణలో నిలబడి, అశ్వపాలకుడు తలుపు తెరచాడు. నిధి లోపలికి అడుగు పెట్టాడు. అశ్వ పాలకుడు గబాల్న కటకటాల తలుపులాగి, భద్రంగా గొళ్ళెం బిగించేశాడు.

అంతవరకూ అసహనంగా, ఆగ్రహంగా కద లిన గుర్రం తైతక్కలాడ్డం ఆపి, ఒక్కసారిగా సకిలిం చింది. నిధి చిరునవ్వు నవ్వుకున్నాడు. శ్వేతాశ్వం అశ్వత్థామగారి రాకను పసిగట్టి నట్టుంది! ఇప్పుడు ప్రాంగణంలో తిరుగుతున్న గుర్రాల సకిలింతలు వినిపించడం లేదు.

"కళ్ళెమూ, జీనూ – అన్నీ గోడకి వేళ్ళాడుతు న్నాయి. జాగ్రత్త!" అశ్వపాలకుడు అన్నాడు. అతని కంఠంలో ఆశ్చర్యం ధ్వనిస్తోంది. అందుకు కారణం శ్వేతాశ్వం ప్రవర్తన. నిధి చేత్తో గుర్రంవీపు మీద నిమురుతున్నాడు. గుర్రం కరవడానికి నోరు తెరవ లేదు. తన్నడానికి కాలెత్తడం లేదు! నిధి అనే ఈ వీరుడు, వీరుడా, గుర్రాల్ని మాయలో పడవేసే మంత్రగాడా? అశ్వపాలకుడు నోరు వెళ్ళబెట్టి చూస్తూ ఉండిపోయాడు.

*(ఇంకా వుంది)*

జీవనతరంగాలు

# స్టెప్ బై స్టెప్



**హైదరాబాద్‌లో జూబ్లీహిల్స్.. భోరున వర్షం.. బైకుల మీద వెళ్లే వాళ్లు చెట్ల కింద నిలబడి వాన ఎప్పుడు తగ్గుతుందా అని ఎదురు చూస్తున్నారు. ఆఫీసుకు లేటు అవుతోందని కొద్దిగా కారు వేగం పెంచా. తల తిప్పి చూస్తే ఒక చోట పది పదిహేను మంది ఉన్నారు. యాక్సిడెంట్ అయిందేమో అనుకున్నా. కారు ముందుకు వెళ్తోంది. సరిగ్గా జనాలు గుమిగూడిన ప్రాంతం దగ్గరకు వచ్చేసరికి అది యాక్సిడెంట్ జరిగిన స్థలం కాదు. ఒక టీ కొట్టు.**

ఆ కొట్టులో నన్ను మొదట ఆకర్షించినది దాని షేపు. ఒక ఇంటి పిట్టగోడను కొద్దిగా కొట్టేసి కింద చెక్కలేసి దానిపైన స్టవ్ పెట్టేశాడు. అటునుంచి టీలు ఇస్తున్నాడు. ఇటు రోడ్డు వైపు అందరూ తాగేస్తున్నారు. చల్లటి వానలో వెచ్చని టీ! ఎంత కాలమయింది అలా తాగి.. కారులో స్నేహితులెవరైనా ఉంటే, ఆఫీసుకు లేటు అవుతుందనే భయం లేకుంటే అప్పటికప్పుడు ఆగి టీ తాగేదాన్ని. ఆ రోజు గడిచిపోయింది. ఆ మర్నాడు మధ్యాహ్నం కొలీగ్స్ టీ తాగుదామంటే హఠాత్తుగా ఆ టీ షాపు గుర్తుకొచ్చింది. కొద్దిగా దూరం. అయినా పర్వాలేదనిపించింది. ముందటి రోజు వాన వెలిసింది. కానీ టీ షాపు ముందు మనుషులు మాత్రం అలాగే ఉన్నారు. పిట్టగోడ.. గోడ వెనక చిన్న బడ్డీ.. ఫొటో ఫ్రేంలో పెట్టేసిన ఫొటోలా కనిపించాడు టీ కలుపుతున్న కుర్రాడు. 'అల్లం..లెమన్..మసాలా..సాదా టీ' అని అడిగాడు ఎటువంటి ఎక్స్‌ప్రెషన్ లేకుండా. చూస్తే బాలకార్మికుడిలా ఉన్నాడు. కొన్ని గ్లాసుల్లో మరుగుతున్న పాలు పోస్తున్నాడు. కొన్నింటిలో నీళ్లు పోస్తున్నాడు. కొన్నింటిలో నిమ్మకాయ పిండుతున్నాడు. వేళ్లు చకచకా కదులుతున్నాయి. ఎక్కడా తొట్రుపాటు లేదు. 'నీ పేరేంటి?' అని అడిగా. అప్పటిదాకా భావహీనంగా ఉన్న మొహంలో చిన్న నవ్వు విరిసింది. ఒక్క నిమిషం ఆగి 'టినటిన' అన్నాడు. బహుశా తెలుగు రాదనుకుంటా. 'ఏ ఊరు?' ఈసారి హిందీలో అడిగా. 'జార్ఖండ్' అన్నాడు. ఒక వైపు నా ప్రశ్నలకు సమాధానం చెబుతున్నాడు. మరో వైపు టీలు కలుపుతూనే ఉన్నాడు.

## ఆలోచన అలా వచ్చింది

టినటినది జార్ఖండ్. వాళ్లకు జార్ఖండ్‌లో నాలుగు ఎకరాల పొలం ఉంది. కానీ వ్యవసాయం గిట్టుబాటు కాకపోవటంతో టినటిన అతని అన్నలిద్దరూ కలిసి పని వెతుక్కుంటూ హైదరాబాద్ వచ్చేశారు. టినటిన ఒక ఇంట్లో వాచ్‌మెన్‌గా చేశాడు. ఆ ఇంటి ఓనరు విదేశాల్లో ఉంటాడు. అప్పుడు వాళ్లకు టీ షాపు పెడితే ఎలా ఉంటుందనే ఆలోచన వచ్చింది. ఒక స్టూలు, స్టవ్, కొన్ని వెదురుబొంగులు, పైన టార్పాలిన్.. ఇవే వారి పెట్టుబడి. ఉదయాన్నే ఆరున్నరకు షాపు తెరుస్తారు. రాత్రి ఎనిమిదికి మూసేస్తారు. జూబ్లీహిల్స్‌లాంటి ప్రాంతంలో ఉదయం ఆరున్నరకు టీ తాగటానికి ఎవరొస్తారు? నా మనస్సులో మెదిలిన ప్రశ్నే అడిగా. 'వస్తారు మేడం. ఇక్కడ చాలా ఆఫీసులు ఉన్నాయి. నైట్ షిఫ్ట్‌లో వాళ్లందరూ టీ తాగటానికి వస్తారు..' అన్నాడు. అప్పుడు ఆ చుట్టుపక్కల ఉన్న ఆఫీసులను గమనించా. అప్పటిదాకా ఆ ప్రాంతమంతా మామూలు ఇళ్లే ఉన్నాయనుకునేదాన్ని. పైగా ప్రతి రోజు అదే రూట్‌లో వెళ్తుంటా. అయినా అక్కడ ఆఫీసులు ఉన్నాయని తెలియదు.

## ప్రస్థానం

'అసలీ టీ స్టాల్ ఎందుకు పెట్టావు? ఎవరు పెట్టమన్నారు?' అని అడిగా. 'జార్ఖండ్ నుంచి పని వెతుక్కుంటూ ఇక్కడికి వచ్చాం. ఈ ఇంట్లో నేను వాచ్‌మెన్‌గా చేరా. ఈ ఇంట్లో ఎవరూ ఉండరు. ఓనర్ విదేశాల్లో ఉంటారు. మొదట్లో ఉదయమంతా ఏం చేయాలో తెలిసేది కాదు. మా అన్న దగ్గర్లో ఉన్న ఒక టీ షాపులో పనిచేసేవాడు. అప్పుడప్పుడు అక్కడికి వెళ్లి టీ తాగేవాడిని. ఒక రోజు హఠాత్తుగా మనం కూడా టీ షాపు ఎందుకు పెట్టకూడదనిపించింది. కానీ మా దగ్గరున్న సేవింగ్స్ రెండు వేలే! ఒక స్టవ్, ఒక టేబుల్ కొని మొదలు పెట్టాం..' అని తన ప్రస్థానాన్ని చెప్పటం మొదలెట్టాడు టినటిన. మొదట్లో కస్టమర్లు తక్కువే ఉండేవారు. టీ రుచి బావుండటంతో నెమ్మదిగా అలవాటు పడ్డారు. 'ఇప్పుడు రోజుకు 60 లీటర్ల పాలు కాస్తాం. సాయంత్రానికి పాలన్నీ పూర్తయిపోతాయి. ఒక్కసారి అలవాటు అయితే ఎప్పుడూ మానరు..' అంటూ మా టీ గ్లాసులు మాకు ఇచ్చాడు టినటిన.

## త్వరలో అవి కూడా...

'రోజుకు వందల టీలు అమ్ముతున్నావు కదా.. టిఫిన్స్ ఎందుకు పెట్టడం లేదు..? అని అడిగా. టినటిన నాకేసి చూసి అర్థవంతమైన నవ్వు నవ్వాడు. 'నాకు ఇక్కడికి వచ్చినప్పుడు టీ పెట్టడం రాదు మేడమ్. నేను నేర్చుకున్నా. ఇప్పుడు పర్‌ఫెక్ట్. ఇప్పుడిప్పుడే ఇడ్లీ వేయటం నేర్చుకుంటున్నా. అది బాగా వచ్చిన తర్వాత టిఫిన్స్ కూడా అందిస్తాం. స్టెప్ బై స్టెప్.. ఎక్కువ ఆశ పడితే ఈ స్టూల్ కూడా పోతుంది..' అన్నాడు. ఈ సంభాషణంతా వింటున్న నా మిత్రురాలు "పెద్ద పెద్ద కంపెనీలు ఇలా ఆలోచిస్తే.. అవి దివాళా తీయవు కదూ.. ఇంత చిన్న సూత్రం అంత పెద్ద మనుషులకు ఎందుకు తెలియదు?' అంది. నాకూ నిజమే అనిపించింది.

–సీత

email: fbackfm@gmail.com





# జంతువుల ద్వీపాలు

**జనావాసాల కోసం ఎక్కడపడితే అక్కడ ఇళ్ళు, భవంతులు, ఫాంహౌస్‌లు నిర్మిస్తున్నారు. అడవులు నరికేస్తున్నారు. ఫలితంగా జంతువుల నివాసాలకు కష్టమొచ్చిపడింది.. జంతువులు తమ స్థావరాలు కోల్పోయి జనావాసాల్లోకి వచ్చిపడుతున్నాయి. ప్రజలను ఇబ్బందులకు గురిచేస్తున్నాయి. అందుకే కాబోలు కొన్ని కొన్ని దేశాలలో వాటి కోసమే ప్రత్యేక స్థావరాలు ఏర్పరిచారు. ఐలాండ్ అనగానే మనకు గుర్తొచ్చేది విహారయాత్ర స్థలాలేకదూ. పెద్ద పెద్ద హోటల్స్, రకరకాల ఉద్యాన వనాలు, ఎంజాయ్ చేయడానికి కావలసిన సదుపాయాలు గుర్తొస్తాయి. కానీ ద్వీపం అంటే కేవలం మనుషులకే కాదండోయ్ జంతువులకు కూడా ఉన్నాయి. ఆ రక్షిత ద్వీపాలలో అవన్నీ రాజభోగాలు అనుభవిస్తున్నాయి. అదేంటి వాటికి కూడా ప్రత్యేక ద్వీపాలా అని ఆశ్చర్యపోతున్నారా? కేవలం జంతువులకే పరిమితమైన ఆ ద్వీపాల గురించి మీరూ చదివేసేయండి.**

## పీతల ద్వీపం

పీతల పేరు వినగానే నోరూరిపోతోందా! మీరు కనుక అక్కడికి వెళ్ళారే అనుకోండి, కొన్ని వేలరకాల పీతలు కనిపిస్తాయి. ఈ ద్వీపం ఆస్ట్రేలియాలో ఉంది. ఈ దీవిలో పీతలన్నీ ఎరుపు రంగువే. ఒకప్పుడు ఈ ఐలాండ్‌లో నాలుగుకోట్ల 37లక్షల పీతలు ఉండేవి. కానీ ఎల్లో చీమలవల్ల ఈమధ్య కోటీ కోటిన్నర పీతలు చనిపోయాయని సంరక్షణ అధికారులు చెబుతున్నారు. హిందూమహాసముద్రంలో ఉన్న ఈ పీతల ఐలాండ్‌నే క్రిస్టమస్ ఐలాండ్ రెడ్ క్రాబ్స్ అని పిలుస్తారు. ఇంతకీ ఈ ద్వీపంలో పీతలు ఎంత పెద్దగా ఉంటాయో తెలుసా? ఒక్కొక్కటి 116 మిల్లీమీటర్ల పొడుగు ఉంటాయట. ఇంకా చెప్పాలంటే ఆడపీతలకన్నా మగపీతలు ఇంకా పెద్దగా ఉంటాయని స్థానిక అధికారులు చెబుతున్నారు. కేవలం ఆస్ట్రేలియాలోనే కాక మలేసియా, థాయిలాండ్‌లలో కూడా క్రాబ్ ఐలాండ్లు ఉన్నాయి.

## పందుల ద్వీపం

చాలామంది పందులను చూస్తే అసహ్యించుకుంటారు. కానీ విదేశాలలో పందులను కూడా పెంపుడు జంతువుల్లా పెంచుకుంటారు. ఎగ్జుమా లోని బహమాస్ అనే ఓ ద్వీపంలో కేవలం పందులు మాత్రమే ఉంటాయి. వాటన్నింటినీ సముద్రం ఒడ్డున పెంచుతుంటారు. అసలు అక్కడికి పందులు ఎలా వచ్చాయన్నదానిపై రెండు విభిన్న వాదనలు వినిపిస్తున్నాయి. అసలైతే వాటిని కొందరు నావికులు కేవలం తినడం కోసమే తెచ్చి పెంచుకునేవారు. ఆ సముద్రం దగ్గర పందిమాసం ఉంచడంవల్ల ఎక్కువ ఆదాయం పొందవచ్చన్న లాభాపేక్షతో వాటిని పెంచేవారన్నది ఒక వాదన. అయితే పనిలో పనిగా వాటికి ఈత నేర్పడంవంటి పనులు నేర్పించి పడవలు నడపడంలో వాటి సహాయం తీసుకునేవారని మరికొందరు చెబుతుంటారు. అయితే ఈ పందుల్ని చంపి తినడంకంటే వాటిని పెంచి విన్యాసాలు నేర్పిస్తే పర్యాటకులు ఇంకా ఎక్కువ మంది వస్తారన్న ఆలోచనరావడంతో కాలక్రమేణా అవి పెంపుడు జంతువులుగా మారిపోయాయి. ఆనాటి నుంచి వాటిని చూడడానికి పర్యాటకులు కోకొల్లలుగా వస్తున్నారు. ఆ పందులతో పాటు వారుకూడా ఈతకొట్టి ఎంజాయ్ చేస్తున్నారు. ఈ ప్రాంతాన్ని పిగ్ బీచ్ అని కూడా పిలుస్తుంటారు.

## కుందేలు ద్వీపం

తెల్లతెల్లగా చిన్నగా ముద్దొచ్చే చెవులపిల్లి అదేనండీ కుందేలు అంటే అందరికీ ఇష్టమే కదా. కుందేలు ఐలాండ్ గురించి మీరెప్పుడైనా విన్నారా? ఇది జపాన్‌లో ఉంది. దీన్ని ఉసాగి షిమా లేదా ఒకునోషిమా అంటారు. అంటే కుందేళ్ల వనం అని అర్థం. ఈ కుందేళ్ల ద్వీపం ఏర్పడడం వెనుక ఓ పెద్ద కథే ఉంది. 1925 సంవత్సరంలో జెనీవాలో ప్రోటోకాల్ వల్ల జపాన్‌లో పాయిజన్ గ్యాస్ నిషేధించారు. కానీ ఈ ద్వీపంలో అక్రమంగా, చాలా సీక్రెట్‌గా ఆరు కిలో టన్నుల పాయిజన్ గ్యాస్ ఉత్పత్తి చేసేవారు. ఎంత సీక్రెట్‌గా అంటే ఇక్కడ ఒక దీవి ఉండేది అనేది తెలియకుండా ఆదేశపు చిత్రపటంలోనే దాన్ని తీసివేశారట. ఆతర్వాత జపాన్‌లో యుద్ధానంతరం ఆ ల్యాబ్‌లో ఉండే పాయిజన్ లీక్ అవడంతో వందల కొలది జంతువులు చనిపోయాయి. దశాబ్దాల తర్వాత అదే ప్రాంతం ఇప్పుడు కుందేళ్ళకు నిలయంగా మారింది. ఇప్పుడు మనకి ఈ దీవిలో వేలాది కుందేళ్ళు గెంతుతూ కనిపిస్తాయి. సందర్శకులు ఈ దీవిలోకి ఎలాంటి పెంపుడు జంతువుల్నీ వెంట









తీసుకురాకూడదనే నిబంధన కూడా ఉంది.

## కోతుల ద్వీపం

ఆ ద్వీపంలో అన్నీ కోతులే. 1938లో శాస్త్ర పరిశోధనలకోసం నాలుగువందల కోతులను మనదేశం నుంచి తీసుకెళ్ళి కాయో శాంటియాగో అనే ప్రాంతంలోని ఈ ద్వీపంలో విడిచిపెట్టారు. సురక్షితమైన ఈ ప్రదేశంలో అప్పటినుండీ కోతుల సంఖ్య క్రమంగా అభివృద్ధి చెంది పూర్తిగా కోతుల నివాసకేంద్రంగా మారింది. ఇప్పుడు అక్కడ దాదాపు వెయ్యికి పైగా కోతులు నివసిస్తున్నాయి. ఈ కోతులను ఇక్కడ పెంచుతూ వాటిపై పరిశోధనలు నిర్వహిస్తున్నారు అక్కడి యూనివర్సిటీ ఆఫ్ ప్యూర్టోరికో పరిశోధకులు. ఈ కోతుల ద్వీపానికి వెళ్ళాలంటే మాత్రం ఆ పరిశోధనా కేంద్రం నుంచి తప్పనిసరిగా అనుమతి తీసుకోవాలి.

## గుర్రాల ద్వీపం

మనందరికీ హార్స్ రేస్ గురించి తెలుసుకదా! అలాంటి నాణ్యమైన పందెం గుర్రాలకు నిలయమైన ప్రత్యేకద్వీపం ఒకటి ఉంది. మర్యాలాండ్, వర్జీనియా అనే రెండు రాష్ట్రాలను కలిపే తూర్పు సముద్రప్రాంతమైన డెల్మరా ద్వీపకల్పంలో ఉన్న ఈ పందెం గుర్రాల సంరక్షణ బాధ్యతలను రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు చూసుకుంటాయి. ఇంత పెద్ద సముద్ర ప్రాంతంలో కేవలం గుర్రాలు మాత్రమే ఉంటాయి. సందర్శకులు వచ్చి స్వేచ్ఛగా తిరిగే ఆ గుర్రాలతో ఆడుకుని వెళుతుంటారు. మంచి పర్యాటక స్థలంగా దీనికి పేరుంది.

## సీల్ ద్వీపం

కేప్‌టౌన్ లోని ఫాల్స్ బే ప్రాంతంలో సీల్‌చేపల ద్వీపం ఉంది. వైశాల్యపరంగా చూస్తే ఇది చిన్నదే. ఈ దీవిలో చేపపిల్లలను చంపడానికి చాలా ప్రయత్నాలే జరిగాయి. అయితే అవన్నీ విఫలమయ్యాయి. రెండవప్రపంచయుద్ధ సమయంలో మాత్రం సముద్రంలో నావ పేలిపోవడంవల్ల కొన్ని సీల్ చేపలు చనిపోయాయి. ఇప్పటికీ ఇందులో ఎన్నోరకాల చేపలు నివసిస్తుంటాయి. ప్రత్యేకించి వైట్ కలర్ షార్క్ చేపలు ఈ దీవిలో ప్రధాన ఆకర్షణగా చెప్పుకోవచ్చు.

## పాముల ద్వీపం

పురాతన జానపదకథల్లో పాముల గుహల గురించి ఉంటుంది. అందులో అన్నీ పాములే ఉంటాయని ఆ కథల్లో చెబుతారు. కానీ అవన్నీ జానపద కథలైతే ఈ ద్వీపం మాత్రం ఆ కథలకు వాస్తవరూపం! ప్రపంచంలోని అత్యంత విషసర్పాలకు ఈ ద్వీపాన్ని నిలయంగా చెప్పవచ్చు. బ్రెజిల్ నుంచి 93మైళ్ల దూరంలో ఉన్న ఈ పాముల ద్వీపాన్ని ఇల్హా దా క్వ్యామడా గ్రాన్డే అని కూడా పిలుస్తారు. పరిశోధకుల అభిప్రాయం ప్రకారం, ఈ ద్వీపంలో ఒక్కో చదరపు అడుగుకు నాలుగు నుంచి ఐదు పాములు ఉంటాయట. ఈద్వీపంలోనే అత్యంత విషపూరితమైన గోల్డెన్ లాన్స్ హెడ్ వైపర్ స్నేక్స్ ఉన్నాయి. ఈ విషసర్పం కాటేస్తే నిమిషాల వ్యవధిలో మనిషి చనిపోతాడు. ఈ తరహా విషసర్పాలు ఈ ద్వీపంలోతప్ప ప్రపంచంలో మరెక్కడా ఉండవట. అయితే మరి ఈ సర్పాలు ఎలాంటి ఆహారం తిని బతుకుతాయనేగా మీ సందేహం. వీటి ప్రధాన ఆహారం పక్షులు. వలస పక్షులు విశ్రాంతి కోసం ఈద్వీపంలో ఆగినప్పుడు వాటిపై విషంచిమ్మి చంపి తినేస్తాయి. అత్యంత విషపూరితమైన సర్పాలు ఉండడంవల్ల ఈదీవిలోకి సందర్శకులెవ్వరినీ అనుమతించరు. ఒకవేళ ఏదైనా పరిశోధన కోసం వెళ్ళాలనుకున్నా సంబంధిత అధికారుల అనుమతి తప్పనిసరి.

## మార్జాల ద్వీపం

మార్జాలం అంటే తెలుసుకదా అదేనండీ పిల్లి. పెంపుడు జంతువైన పిల్లుల కోసం కూడా ఓ ప్రత్యేక దీవి ఉంది. జపాన్‌లోని ఓషిమాద్వీపం పిల్లుల ప్రేమికులకు స్వర్గధామంగా చెప్పవచ్చు. ఇన్ని పిల్లులు ఈ ద్వీపంలోకి ఎలా వచ్చాయన్న దానిపై ఓ కథ ప్రాచుర్యంలో ఉంది. రెండవప్రపంచ యుద్ధం తర్వాత పలువురు ఆర్మీ అధికారులు ఏకాంతంగా జీవించడానికి తగిన ప్రదేశంగా ఓషిమా ద్వీపం ఎంచుకున్నారు. అయితే అక్కడ ఎలుకలు వారిని ఇబ్బంది పెట్టడంతో వాటిని పారద్రోలేందుకు పిల్లుల్ని తీసుకొచ్చారు. అలా ఎలుకలను నిర్మూలించినా పిల్లులసంఖ్య పెరుగుతూ వచ్చింది. ఈ దీవిలో యాభైయేళ్ళ క్రితంవరకు 1000 మంది ప్రజలు నివసించేవారు, కానీ ఇప్పుడు కేవలం 15మంది మాత్రమే ఉంటున్నారు. దాదాపు 200 పిల్లులు అక్కడ ఉన్నాయి.

## డీర్ టౌన్

జపాన్‌లో పిల్లులకు ప్రత్యేక దీవి ఉన్నట్లే జింకల కోసమూ ప్రత్యేకమైన ఊరు ఉంది. ఆ ఊరు పేరు నారా. క్రీస్తుశకం 710నుంచి 784 కాలంలో ఈ నారా ప్రాంతం జపాన్ రాజధానిగా పేరుపొందింది. స్థానికులు ఆ ఊరును డీర్ టౌన్ అని పిలుచుకుంటారు. ఈ ఊళ్ళో దాదాపు 1500 వరకు జింకలు రోడ్లపైనే స్వేచ్ఛగా తిరుగుతూ ఉంటాయి. ఈ ఊరులో కేవలం జింకలు మాత్రమే కాదు, రకరకాల ఆలయాలు, అతిపెద్ద బుద్ధ విగ్రహం, కర్రతో చేసిన భవనాలను కూడా ప్రధాన ఆకర్షణగా చెప్పుకోవచ్చు.

– రామకృష్ణశర్మ





# పది దీపాలు

**-జీవిత**

**'మనిషన్నాక కాస్తంత కళాపోషణుండాలి' అంటాడు ఓ పాత సినిమా పాత్రధారి.**

**'మనిషన్నాక కాస్తయినా సమాజసేవ ఉండాలి' అనుకుంటాడు శ్యామ్. అతనికది కొత్తగా కలిగిన ఉద్దేశం కాదు. కొంచెం జ్ఞానం వచ్చినప్పటినుంచీ మనసులో ఉన్నదే.**

**అందుకు కారణం బహుశా...**



"అమ్మా! నా నాన్నెవరు?" అని అడిగాడు ఎనిమిదేళ్ళ శ్యామ్‌సుందర్. నిజానికి అది కన్నవారు పెట్టినపేరు కాదు. అనాథ శరణాలయం మేనేజర్‌కి కృష్ణుడంటే ఎక్కడలేని ఇష్టమూ, భక్తీ. చిన్నికృష్ణుడన్నా, ఆ ముగ్ధమోహన రూపమన్నా మహా సరదా. యశోదచేత 'కలయో వైష్ణవమాయయో' అనిపించేలా తన బుల్లినోరు తెరచి సమస్త విశ్వాన్నీ అందులో చూపిన బాలకృష్ణుడంటే ముద్దూ.. ముచ్చటాను. గీత బోధించిన కృష్ణ పరమాత్ముడంటే గౌరవం. గోవుదగ్గర పొదుగులో మూతిపెట్టి నేరుగా పాలుతాగిన కృష్ణుడంటే మురిపెం. అతని నీలమేఘుచ్ఛాయంటే ఎంతో మోజు.

అందుకే అనాథ శరణాలయానికిజేరే పేరులేని పసివారందరికీ గోవిందనామాలలో ఏదోఒక పేరుపెట్టి రికార్డులలో రాసేవాడు ఆ మేనేజర్. అనాథ శరణాలయానికి జేరినప్పుడు ఆ పురిటి కందు నేరేడుపండును గుర్తుతెచ్చే లేత నీలానికి తిరుగుతున్న నలుపురంగు ఛాయలో ఉంది, అందుకే ఆ పురిటిగుడ్డుకి శ్యామ్‌సుందర్ అని నామకరణం చేశాడు. అయితే, అక్కడందరూ అంతపేరు పలకలేక అతన్ని 'శ్యామ్'గా మిగిల్చేశారు. ఒక్క మేనేజర్ మాత్రం 'శ్యామ్‌సుందర్' అని నోరారా పిలుస్తాడు.

ఆవేళ మేనేజర్‌మీద ఆయా కన్నమ్మకి కోపంగా ఉంది. ఎందుకంటే, జీతం పెంచలేదు. ఆమె కష్టాలామెవి. కొన్ని కష్టాలకు పరిష్కారం డబ్బులోనే ఉంటుంది. పైసామే పరమాత్మ. జీతం పెంచలేనన్నాడు మేనేజర్. "పోనీ ఐదువేలు వడ్డీలేని అడ్వాన్స్ ఇవ్వండి, నెలకి రెండొందలు లెక్కన జీతంలో తీసుకోండి" అని మరోమార్గం చూపించింది ఆయా. 'అంత డబ్బు లేదు' అని అందుక్కూడా అంగీకరించలేదు.

దాంతో ఆయా కన్నమ్మకి చాలాకోపం వచ్చేసింది. కానీ పేదవారికోపం పెదవికిచేటుతప్ప పెద్దలకి చేటు చెయ్యదు. కావాలంటే తనకంటే చిన్నవాళ్ళకి చేటు చెయ్యొచ్చు. అలా కోపంతో ఒళ్ళు మండిపోతున్న కన్నమ్మని "నా నాన్నెవరు?" అని ప్రశ్నించిన శ్యామ్ అనువుగా దొరకడంతో అసహనంతో వాడిపై విరుచుకుపడింది. "అడవితో 'అబ్బ' అంటే ఎవరికి పుట్టావు నా కొడకా?" అందట అడవి. అమ్మానాన్నా ఉంటే అనాథ శరణాలయానికెందుకొస్తావు?" అని ఆ పిల్లాడి మనసులో విషం చిమ్మింది.

"ఐతే నాకు అమ్మానాన్నా లేరా?"



"అమ్మానాన్నా లేకుండా మనుషులు పుట్టరు. నీకూ అమ్మానాన్నా ఉండే ఉంటారు. నువ్వు అక్కర్లేదనుకునో, లేక అడ్డుగా ఉన్నావనుకునో నిన్ను ఈ వీధి చివర మురిక్కాలవ దగ్గర వదిలేశారు. ఎవరోవచ్చి చెబితే, ఈ 'ప్రేమ సమాజం అనాథశరణాలయం' వాళ్ళు నిన్ను ఇక్కడికి తీసుకొచ్చారు" మేనేజర్‌మీద అక్కసుతో ఆ చిన్నారి మనసును గాయపడేలా మాట్లాడింది కన్నమ్మ.

కళ్ళనీళ్ళు వచ్చేశాయి శ్యామ్‌కి. "అమ్మానాన్నా నన్నెందుకు వదిలేశారు?"

"ఏమో ఎవరికి తెలుసు? మగాడి మోజులో పడి పెళ్ళి కాకుండానే ఏ ఆడది నిన్ను కన్నదో లేక ఏ ఆడదానికి అక్కర్లేని గర్భమో, ఏమో! సర్లే, నువ్వెంత ఏడ్చినా ఆళ్ళు నిన్ను వెతుక్కుంటూరారు గానీ నన్నిసిగించకు, పో పోయాడుకో" అంటూ కసిరింది. ఆయా మాటలు కొంచెం కూడా శ్యామ్‌కి అర్థం కాలేదుగానీ, అవిమాత్రం ధ్వనిరూపంలో యథాతథంగా మెదడులో ముద్రించుకుపోయాయి. అప్పుడప్పుడు ఆ మాటలు లోలోపలే ధ్వనిస్తుంటాయి. శ్యామ్ కొంచెం పెద్దయ్యాడు. అంటే పదో తరగతి పాసయ్యాడు. దాంతో ఆశ్రమంలో ఉండడానికి నిబంధనలు అడ్డువచ్చాయి. "శ్యామ్ సుందర్! నువ్వు బుద్ధిమంతుడివి. చక్కగా చదువుకుంటావు. అందుకే నువ్వంటే నాకు చాలా ఇష్టం. అయినా తప్పదు, ఆశ్రమనిబంధనల ప్రకారం నువ్వు ఈ శరణాలయం నుంచి వెళ్ళిపోకతప్పదు" అన్నాడు మేనేజర్. ఆ కొద్దిక్షణాలలోనే శ్యామ్ సుందర్‌లో వేయివిధాల ఆలోచనలు తలెత్తాయి. 'తానిప్పుడు ఎక్కడికని పోగలడు? అనాథ నైన తనకు ఈ ప్రపంచంలో నా అనేవారూ లేరు, నాదనే చోటూ లేదు. మరి తనకు ఆశ్రయమిచ్చేదెవరు? అన్నంపెట్టేదెవరు? ఇన్నాళ్లూ ఈ శరణాలయమే తన బాగోగులన్నీ చూసుకుంది. ఇక్కడి నుండి బయటికెళ్తే తనకి దిక్కెవరు?' ఆ ఆలోచనల్లోంచి బయటపడేలోపే, "శ్యామ్‌సుందర్! భయపడకు, నువ్వు మేజర్‌వయ్యేవరకూ నా ఇంట్లోనే ఉందువుగానీ. ఇంటర్మీడియట్ లేదా ఐ.టి.ఐ. చదువుకుందువుగానీ" అని అభయమిచ్చారు. ఆయన పాదాలమీద పడి కన్నీటితో అభిషేకం చేశాడు శ్యామ్‌సుందర్. "ఎంత దయామయులు మీరు? నా పాలిటి దేముడే.. సార్! నాకు ఒక్క విషయం చెబుతారా?" అడిగాడు.

"ఏమిటి?"

"నా అమ్మానాన్నా ఎవరు? నేను అక్రమ సంతానమట కదా? మరైతే నాకు ఎప్పటికీ అమ్మానాన్నలుండరా?" దీనంగా అడిగాడు.

ఆ ప్రశ్నకు మేనేజర్ మనసు ద్రవించిపోయింది. శ్యామ్‌సుందర్ మనస్సునెవరో కలుషితం చేశారని గ్రహించాడు మేనేజర్. దానికి విరుగుడు మందు ఇస్తున్నట్టు ఇలా చెప్పాడు, "సంతానం ఎప్పుడూ అక్రమమైనది కాదు. అందుకు కారణమైన స్త్రీ, పురుషలదే అక్రమం. అనైతికం, బాధ్యతా రాహిత్యం అన్నీ వాళ్ళవేతప్ప సంతానానిది కాదు. అమ్మానాన్నలంటే కన్నవారే కానక్కరలేదు. మనకి భరతమాత, జాతిపిత అందరూ ఉన్నారు. హృదయం విశాలం చేసుకుంటే మనచుట్టూ ఎందరో అమ్మలున్నారు. చూడటం నేర్చుకోవాలే గానీ స్త్రీలందరిలోనూ అమ్మను చూడొచ్చు, నాన్ననూ చూసుకోవచ్చు. అందుకని అమ్మానాన్నల్ని సంపాదించుకోవడం ఇప్పుడు నీ మీదే ఆధారపడుంటుంది" జీవిత పరమార్థం వివరించాడు మేనేజర్.

శ్యామ్‌సుందర్ మనసు కొంచెం కుదుటపడింది. మేనేజర్ శ్యామ్‌సుందర్‌ని తన ఇంటికి తీసుకెళ్ళాడు. అతన్ని చదివించాడు. పోషించి తీర్చిదిద్దాడు. ఇప్పుడు శ్యామ్‌సుందర్ మరో ఊళ్ళో ఉద్యోగం సంపాదించుకున్నాడు. అక్కడ ఒకాయన తారసపడ్డారు. ఆయన్ను నాన్నగారూ అని పిలవాలనిపించింది. ధైర్యం చేసి పిలిచాడు. ఆయన మందహాసం చిందిస్తూ, సాదరంగా చేరబిలిచాడు. "ఏం బాబూ...ఏం కావాలి?" అని అడిగాడు.

"నాకు నాన్న కావాలి" మెల్లగా జాలికొల్పేలా చెప్పాడు.

"దానికేం? నాకూ కొడుకులు లేరు. అసలు పిల్లలే లేరు. నాతో వచ్చి ఉంటానంటే నాకు సంతోషమే. ఒంటరిగా ఉండీ ఉండీ నాకూ విసుగేస్తోంది" అని వాత్సల్యం నిండిన నేత్రాలతో శ్యామ్‌సుందర్ భుజం ఆసరా చేసుకున్నారాయన. ఆ స్పర్శ ఎంత బాగుంది! ఆ స్పర్శ తనకి రక్షణేకాక ఇంకా ఏదో వాగ్దానం చేస్తున్నట్టే అనిపించింది. ఆయన వెంట నడిచాడు శ్యామ్‌సుందర్. కొద్దిరోజులకే ఆయన పైకి కనిపించే లాంటి మనిషి కాదని తేలిపోయింది. కాళ్లు పిసకమంటే తండ్రికి సేవచేస్తున్నట్టే భావించాడు. కాళ్లు పిసికి ఆనందం పొందేవాడు, కాని బ్రాందీ తెమ్మనీ, సిగరెట్లు తెమ్మనీ, వేళకాని వేళ నీచపు పనులు పురమాయించడం ప్రారంభించాడు. అది భరించలేక దూరంగా వచ్చేశాడు శ్యామ్‌సుందర్.

అమ్మ సెంటిమెంటు సినిమాలు తెగ చూసేవాడు. అమ్మానాన్నలూ, పిల్లలూ మొదట్లో విడిపోడం తరువాత కలుసుకోవడం ప్రధానాంశంగా ఉండే సినిమాలు అతనికి చాలా నచ్చేవి. ఎందుకంటే టీవీలో అవి చూస్తుంటే తన అమ్మానాన్నా తనను వెతుక్కుంటూ వస్తారనీ, వారు తమ బిడ్డగా తనను గుర్తుపడతారనీ ఆశ కలిగేది. శ్రద్ధగా ఉద్యోగం చేసుకునేవాడు. జీతంలో కొంతభాగం అనాథశరణాలయానికి పంపించేవాడు. అప్పుడప్పుడు వెళ్ళి మేనేజర్‌గారిని చూసి వచ్చేశాడు. ఆయన సూచించిన విధంగానే శరణాలయంలో ఆశ్రయం పొందిన అమ్మాయి సుధని వివాహం చేసుకున్నాడు. వారికి పెళ్ళి చేసి ఆశీర్వదించిన ఆరునెలలకే దేముడు లాంటి మేనేజరు దైవసన్నిధికి చేరిపోయారు. ఎంతగా విలపించాడో శ్యామ్‌సుందర్. కష్టాలు పడివచ్చిన మనుషులు రెండు



రకాలు. మొదటి రకం – తాము పడిన కష్టాలు ఇతరులు పడకూడదని కోరుతూ వారికి సాయం చేసేవారు. రెండవ రకం – తాము కష్టాలు పడ్డారు కనుక ఇతరులు కూడా కష్టాలుపడవల సిందే అనుకునేవారు. శ్యామ్‌సుందర్ మొదటి వర్గానికి చెందితే సుధ – రెండో వర్గానికి కాకపో యినా సాయం చేయాలనే మనస్తత్వం లేని మనిషి. ఐతే ఆమెలోని సుగుణమేమిటంటే తను చేయకపోయినా సాయం చేసే శ్యామ్‌కి అడ్డుప డదు. ఆ మేరకే తృప్తిపడతాడు అతను. ప్రతికూలించకపోవడమూ అనుకూలించడమే కదా ఒక విధంగా.

ఉదయం ఆరు నుంచి మధ్యాహ్నం రెండు వరకే అతని పని. వచ్చి భోజనంచేసి విశ్రాంతి తీసుకునేసరికి సమయం నాలుగు. అప్పటినుంచి ఎనిమిది వరకు తీరికే. అప్పుడు మళ్ళీ భోజనం, పది గంటలకు నిద్ర. తెల్లవారుజామున నాలుగు న్నరకి మేల్కొనడం. ఇదీ శ్యామ్‌సుందర్ దినచర్య. ఆర్థిక సాయం చేసేందుకు ఎక్కువ స్తోమత లేదు కనుక సమయదానం ద్వారా సమాజసేవ చేస్తాడు. నిజానికి దానికొక సమయమని లేనే లేదు. రోడ్డుమీద వస్తుంటే, జంక్షన్‌లలో రోడ్డు దాట డానికి ఇబ్బంది పడుతున్న వృద్ధులు కాని, చిన్న పిల్లలు కాని కనపడితే చెయ్యి పట్టుకుని దాటిస్తాడు. ఏ బస్సెక్కి తమ గమ్యం చేరుకోగలరో తెలియని విద్యావిహీనులకు బస్ నంబరు చెప్పడం, గైడెన్స్ ఇవ్వడమేకాక తీరికుంటే దగ్గరుండి బస్సెక్కిస్తాడు కూడా. అప్పుడప్పుడు తన సెలవుదినాల్లో పోస్టా ఫీసు, బ్యాంక్ లాంటిచోట్లకు వెళ్ళి నిస్సహాయులు సులభంగా లావాదేవీలు పూర్తిచేసుకోవడానికి ఉత్తరాలు రాసిపెట్టడం, ఫారాలు పూర్తిచేసి ఇవ్వ డంవంటి సేవలు అందిస్తాడు. అతని ఇంటి ముందే ఒక అనాథశరణాలయం ఉంది. అక్కడి పిల్లలకు భోజనం, వసతి, విద్య ఇస్తారుతప్ప ఇతర బాగోగులు చూడరు. పిల్లల ముఖ్యావసరా లేమిటో తను అనుభవంమీద గ్రహించినవాడు కనుక స్వచ్ఛందంగా సహాయ సహకారాలు అందించేవాడు.

'ఎవరైనా కథ చెబితే ఎంత బాగుండును' అనే తన చిన్నప్పటి మనసులోని కోరిక శ్యామ్ సుందర్‌కి ఇప్పటికీ గుర్తే. అందుకే సాయంత్రం పూట ఆ శరణాలయానికి వెళ్ళి పిల్లలకు కథలు చెబుతాడు. వారి హృదయాలకు హత్తుకునేలా కథలు చెప్పేవాడు. ఎంతగా అంటే, 'నర్తకుని భంగిపెక్కగు.. మూర్ఖులతో నెవ్వడాడు' అన్నట్లు కథలోని పాత్రల్లో తానే పరకాయ ప్రవేశం చేసే వాడు. జంతువుల కథయితే వాటి అరుపులు అరుస్తూ, హావభావాలు ప్రదర్శిస్తూ కళ్ళకు కట్టి నట్టు కథలు చెప్పేవాడు. అందువల్లనే శరణా లయం పిల్లలకి కథలమామయ్యగా మారి పోయాడు. భోజనంకోసం కూడా ఎదురుచూడ నంత ఆత్రంగా, సాయంత్రం అయితేచాలు కథల మామయ్యకోసం ఎదురుచూసేవారు ఆ శరణా లయం పిల్లలు. ఔను పిల్లలకి ఆహారం కంటే కథలే ఎక్కువ బలాన్నిస్తాయి.

పిల్లలకు పద్యాలు చదవడం, పాటలు పాడడం లాంటి విద్యలు ప్రదర్శించేందుకు అవసర మైన వేదిక కల్పించగలిగితే వాళ్ళింకా ఉత్సా హంగా ఎదుగుతారు. ఇవన్నీ తన చిన్నప్పటి కోరి కలే, చిన్నప్పటి ఊహలే. పదిమంది పిల్లలనీ పోగేసి... ఒకరోజు ఒకరికి చొప్పున ఓ అరగంట సేపు వాళ్ళకు తెలిసినవిద్య ప్రదర్శించే అవకాశం కల్పించేవాడు. ఆ విధంగా వాళ్ళు మానసికంగా ఆరోగ్యంగా ఎదగడమే కాక పెద్దయ్యాక మంచి కళాకారులయ్యే అవకాశం కూడా ఉంటుంది. తమను గుర్తించాలనే కోరిక పిల్లల్లో ఉండటం సహజమే. నలుగురిలో గొప్ప అనిపించుకోవాలనే కోరిక ఉంటుంది.

బాల్యం బహుశక్తిమంతమైనది. ఆ ఆసక్తిని సరైనమార్గంలో నడిపించకపోతే దానంత ప్రమాద కరమైంది ఉండదు. ముఖ్యంగా ఇలాంటి అనాథ ఆశ్రమాలు, ప్రేమసమాజాలూ ఈ పిల్లల్ని సంర క్షించకపోతే దుష్టశక్తులు రికామీగా తిరిగే పిల్లల్ని ఆకర్షించి, స్మగ్లింగ్, మాదకద్రవ్యాల రవాణా, దొంగతనాల్లోకి దించి నేరస్థులుగా తయారు చేస్తాయి. తన జీవితం అలా తెల్లారిపోకుండా, పసిగుడ్డు దశలోనే కుక్కలో పందులో దారు ణంగా చంపి తినెయ్యకుండా తనను అక్కునజే ర్చుకుంది అనాథశరణాలయం. అసాంఘికశక్తుల విషకౌగిలిలో చిక్కుకుండా తనకు చదువు చెప్పిం చింది. ఇలా తన కాళ్ళమీద తాను నిలబడగలిగే స్వతంత్రజీవిగా తీర్చిదిద్దింది అనాథ ఆశ్రమం. అలాంటి బృహత్తరకార్యం నెరవేర్చడం వెనుక ఉదా రస్వభావుల విరాళాలే కారణం. ఆ అనాథ పిల్లలు తమకేమీ కాకపోయినా, సహృదయంతో సంతో షంగా సాయం చేస్తారు. ఇలా తనను ఆదుకున్న సమాజ రుణం తీర్చుకోవడం తన కర్తవ్యం. ఆ ఋణం తీర్చుకోడానికి విరాళాలు ఇవ్వడం ఒక్కటే మార్గం కానక్కరలేదు. ఎన్నోమార్గాలలో ఋణం తీర్చుకోవచ్చు. తనకెన్నో ఇచ్చిన సమాజా నికి శక్తికొలది తనూ సమాజానికి తిరిగివ్వడమే కదా సామాజిక స్పృహ అంటే? అది అందరి కర్తవ్యం కూడా'. ఇలా ఆలోచిస్తుంటాడు శ్యామ్ సుందర్.

**ప్రయాణమార్గంలో ప్రవాహం ఎదురైతే ముందుకు వెళ్ళకుండా ఆగిపోతామా? పడవనో, స్టీమరునో ఆశ్రయిస్తాం. జీవితంలో కష్టాలు ఎదురైతే జీవితం ముగిస్తామా? జీవితం జీవించడానికే. శ్రమజీవికి జగమంతా లక్ష్మీ నివాసమే. అనాథకు లోకమంతా తల్లిదండ్రులే. వృద్ధా శ్రమంలో వృద్ధులకు తమను వెతుక్కుంటూ వచ్చినవాడే కొడుకు. మరి అలా వచ్చిన ఆ కొడుకు ఏం చేశాడు? వారికి ఎలాంటి నైతికబలాన్ని అందించాడు?**

ఏడాదిక్రితం తనుండే వీధిలోనే ప్రేమసమా జానికి నాలుగిళ్లవతల ఎవరో వృద్ధాశ్రమం స్థాపించారు. ఉచితంగాకాదు, సేవలకు రుసుము చెల్లించగలవారు అక్కడ ఉండవచ్చు. అది కేవలం స్త్రీలకే. అక్కడ పాతికమంది వరకూ వృద్ధ మహిళలున్నారు. ఆశ్రమం ప్రారంభించిన మూడోరోజే వృద్ధాశ్రమ యాజమాన్యంతో, అక్కడి వృద్ధులతో పరిచయం పెంచుకున్నాడు శ్యామ్‌సుందర్. అక్కడందరూ తనకి అమ్మలే. అక్కడ ఉన్నవారందరివీ వానాకాలం చదువులే. కానీ తమ పిల్లల్ని మాత్రం బాగా చదివించి పెద్ద ఉద్యోగస్థులను చేశారు. వీరిని వదిలి ఆ బిడ్డలు ఉద్యోగాలకోసం విదేశాలకో దూరప్రాంతాలకో వెళ్ళారు. విధిలేక వీరిని వృద్ధాశ్రమంలో చేర్చ వలసి వచ్చింది. ఈ వృద్ధాశ్రమంలో సేవలకు భారీగా వసూలుచేసినా సదుపాయాలు బాగానే ఉంటాయి. చిత్రమేమిటంటే, తమను ఈ ఆశ్ర మంలో ఉంచినందుకు చాలామంది వృద్ధులు బాధపడరు. "ఒంటరిగా ఆ ఇంట్లో ఉండలేనని మా అబ్బాయి ఇక్కడ చేర్చాడు, ఇక్కడ మన మాటా, మన గాలీ, మన నీరూ మన వాళ్ల మధ్య ఉంచాడు, రాజభోగమే మరి" అని ఒకరు అంటే, "కోడలు కాదది. కొరివి దయ్యమే. ఆ పోరు తప్పించి నన్ను సుఖపెట్టేందుకే నా కొడుకు నన్ను ఇక్కడ చేర్చాడు, ప్రాణానికి హాయిగా ఉంది. అప్పుడప్పుడు మనవడినీ మనవ రాలినీ వెళ్ళి చూసొస్తుంటాను, దూరంగా ఉంటే మనుషుల విలువ భద్రంగా ఉంటుంది, నే వెళ్ళిన ఆ ఒక్కరోజు నన్ను బాగానే చూస్తుంది కోడలు"

## కాటూరివారి గడుసుతనం



పడుకోబోయే ముందు రేపటికి కావల్సిన చుట్టలు చుట్టుకుని పడుకో వడం కాటూరివారికి అల వాటు.

"వెంకటేశ్వరరావుగారు మీరేమిటీ ఎప్పుడూ చుట్టలు చుట్టుకుని పడుకుంటారు?" ఓ ఆత్మీయుడి ప్రశ్న.

"నేనేమిటి? ఆదిశేషువు కూడా చుట్టలు చుట్టుకునే పడుకుంటాడు".

పాండిత్యానికి ఆదిశేషువు గుర్తు. ఆది శేషుణ్ణి తనకు ఉపమానంగా చెప్పడం ఆయన గడుసుతనం.

సేకరణ: ఎన్. తారకరామారావు

అని మరొకరు... అలా కొడుకుల్ని అర్థంచేసుకుని ఆమోదించారుతప్ప ఆగ్రహించలేదు.

ఆ వయసులో వారి మనస్సు సహజంగానే భక్తివైపు పోతుంది. శ్యామ్ వారికోసం, రాగయుక్తంగా పురాణపఠనం, పద్యపఠనం చేయడంలో శిక్షణ పొందాడు. ఓ అరగంట పద్యపఠనం వారికెంతో ఆనందం కలిగించేది. వాళ్లు అతన్ని ఎంతో వాత్స ల్యంగా చూసుకునేవారు. వారికి కావాల్సినవి సంకోచించకుండా బజారునుంచి తెచ్చి ఇచ్చే వాడు. వచ్చిన ఉత్తరాలు చదివి పెట్టడం వారు చెప్పగా రాసి పెట్టడం అతని నిత్యకృత్యాలు. అక్కడున్న వృద్ధమహిళలందరూ అమ్మల్లాగే తోచే వారతనికి. వారిలో అమ్మని చూసుకోబట్టే వారికి సేవలు చేయగలుగుతున్నాడు. ఆరు వరకూ ఇక్కడ గడిపి అప్పుడు అనాథశరణాలయం పిల్లల వద్దకు బయలుదేరతాడు.

ఆరోజు శ్యామ్ ఆఫీసుకు సెలవు. ఉదయం ఇంట్లోనే ఉన్నాడు. సాయంత్రం పిల్లలకు చెప్పా ల్సిన కథ రిహార్సల్ చేస్తున్నాడు. అంతలో తలుపు తట్టిన శబ్దం. సుధ లేదు. తనే వెళ్లి తలుపు తీశాడు. ఎదురుగా యామిని! ఆశ్చర్యపోతూనే "రండి" అంటూ ఆహ్వానించాడు.

"సారీ... టైమ్‌లేదు. సాయంత్రం నాలుగుకి హోమ్‌లో మీటింగు. మీరే ముఖ్యఅతిథి. స్వయంగా పిలవాలని వచ్చాను. దయచేసి తప్ప కుండా రండి. ఇదుగో ఆహ్వానం. ఇంకా మీకు చెప్పాల్సిన కొన్ని వివరాలున్నాయి. సభకు కొన్ని నిమిషాల ముందు మాత్రమే ఆ వివరాలు మీకు చెప్పమన్నారు మేనేజర్ మాధవరావుగారు. తప్ప కుండా రండి, ప్లీజ్ పర్మిట్ మీ లీవ్" అని వెళ్ళిపో యారావిడ. 'ఆహ్వానం'లో సభ సమయం, వేదిక, ముఖ్యఅతిథి పేరు, ఆహ్వానిస్తున్న వారి పేర్లు తప్ప అదనంగా ఏమీలేవు. హోమ్‌లో ఉన్న వాళ్ళలో చాలామంది కలిగినవాళ్ళే కనుక తరచు జన్మదిన వేడుకలు, మనవల పుట్టినరోజు పండ గల హడావిడి చేస్తూనే ఉంటారు. ఈ సభకూడా అలాంటిదే అనుకున్నాడు శ్యామ్.

***

సాయంత్రం శ్యామ్‌సుందర్ ఆ వృద్ధాశ్రమం ఆవరణలో అడుగుపెట్టే సరికి మాధవరావు ఎదు రొచ్చి తన కార్యాలయంలోకి దారి చూపారు. యామిని అక్కడే ఉంది. కాఫీతాగుతూ చెప్పా ల్సిన కొన్ని వివరాలు కూడా చెప్పారు మేనేజర్. తర్వాత శ్యామ్‌నీ, యామినినీ వేదికమీదకి తీసు కొచ్చారు మాధవరావు.

"అమ్మలారా! అయ్యలారా! అందరికీ స్వాగతం. ఇప్పుడు మీరు ఈ వేదికపైన ఆసక్తి గొలిపే చిన్ననాటిక చూడబోతున్నారు. ఇది కల్పితం కాదు. జరిగినదే. ఈ నాటికలో పాత్రలు మీముం దున్నవారే. శ్రద్ధగా తిలకించండి" అని శ్యామ్ సుందర్‌కి సైగచేసి ఆయన వేదిక దిగిపోయారు. శ్యామ్‌సుందర్ మైకు అందుకున్నాడు.

"అమ్మలారా! అయ్యలారా! అందరికీ వంద నాలు. నేను మీకు పరిచితుడినే. ఈ వృద్ధాశ్రమం స్థాపించినప్పటినుంచి రోజూ వస్తూ మీతో కొంత సేపు సాయంత్రంవేళ కాలం గడుపుతున్నాను. ఇప్పటికి పదిరోజుల క్రితం ఇక్కడ చేరారు యామిని. రోజూ అందరితో పాటు వచ్చే ఆవిడ ఆ వేళ నలుగురితోనూ కలిసి రాకపోవడంతో నేను వారి గదివైపు నడిచాను. ఆమె గది కిటికీ లోంచి కనిపించిన దృశ్యం నన్నాశ్చర్యపరిచింది.

ఒక ఉత్తరం పట్టుకుని ఏడుస్తున్నారు ఆమె! నాకు చనువుంది కనుక లోపలికెళ్ళి "ఏమమ్మా ఏడుస్తున్నారు?" అని అడిగాను. అని శ్యామ్ ఆగి మైకు యామినికి అందించాడు మిగతావిషయం చెప్పమన్నట్టు. "నా ఆరోగ్యానికేం? దుక్కము క్కలా ఉన్నాను" అని చెప్పి మైకు శ్యామ్‌కు తిరిగి ఇచ్చారామె. ఇలా వారి మధ్య సంభాషణ కొనసా గినంతసేపు మైకు ఇచ్చిపుచ్చుకుంటూ మాట్లాడు



తున్నారు. సభికులు వారినే చూస్తున్నారు.

"మరెందుకు దుఃఖిస్తున్నారు ఆ ఉత్తరంలో దుర్వార్త లేదుకదా?" అడిగాడు శ్యామ్.

"దుర్వార్త కాదు, మా మనవడు రాసిన ఉత్తరం అది. అందులో ఏం రాశాడో? గుడ్డివారికి అంతా చీకటే అన్నట్టు చదువురాని వారికి..." అని ఆగి పోయారు యామిని.

"మీరు గజేంద్రమోక్షం పద్యాలెంత బాగా చదువుతారని! మీకు చదువురాదని ఎవ రన్నారు?".

"తెలుగులో ఐతే పురాణాలు కూడా చదవ గలను. కాని ఇంగ్లీషు ఒక్కక్షరమూ రాదు".

"ఉత్తరం ఎవరి నుంచమ్మా?"

"అమెరికానుంచి మా మనవడు రాశాడు. ఏడాదివయసప్పుడు ఆరేళ్లకిందట వచ్చాడిక్కడికి. ఆ తర్వాత వాణ్ణి చూడలేదు నేను. ఫోనులో నాకు సరిగ్గా వినపడదు. అందుకే నా కొడుకు ఉత్తరాల్లోనే అన్నీ రాస్తాడు. నా మనవడు ఇంగ్లీ షులో ఉత్తరాలు రాస్తాడు. నాకేమో ఇంగ్లీషు విన్నా అర్థం కాదు, చదవడం తెలియదు. నా అమెరికా మనవడికి తెలుగురాదు, నాకు ఇంగ్లీషు రాదు" యామిని చెప్పి మైకు శ్యామ్‌కి ఇచ్చింది.

"కావాలంటే, నేను ఆ ఉత్తరం చదివి చెబు తాను"

"నేను స్వయంగా చదువుకున్న సాటి వస్తుందా! మా మనవడు ఆనంద్‌లానే వాడి చేతి అక్షరాలు కూడా ముద్దుగా ఎంత బాగుంటాయో! మా అబ్బాయి కోసం కూడా నేను ఇంతగా ఇదై పోలేదు".

"అందుకనే కదండీ, అసలుకంటే వడ్డీ ముద్దు అనేది" అని నవ్వి– "అమ్మా! మీకూ మీ మనవడి మధ్య ఉన్న ఆ ఇంగ్లీషు అడ్డుగోడలు కూల్చేద్దాం, మీ మనవడి ఉత్తరాలు మీరే చదువుకుని, మన వడితోనూ మీ అబ్బాయితోనూ ఫోన్లో ఇంగ్లీషులో మాట్లాడాలని ఉందా?" అని అన్నాడు శ్యామ్.

"ఎందుకుండదు? అంతకంటే కావలసిందే ముంది? కానీ...ఎలా?"

"ఇంగ్లీషు నేర్చేసుకోడమే"

ప్రేక్షకులు కొంచెం ఆశ్చర్యంగా చూస్తున్నారీ కొత్తపద్ధతిని. ఇది ఉపన్యాసం కాదు. నాటిక లానూ అనిపించదు. కొత్తగా ఉంది అనుకుంటు న్నారు.

"అరవయ్యో యేట అగ్నిగుండమని నాకి ప్పుడు చదువా?"

"చదువుకి వయస్సుతో నిమిత్తం లేదు. దృఢ సంకల్పం ఉండాలి. మీరు ఊ అంటే మూడునె లల్లో ఇంగ్లీషు రాయడం, మాట్లాడటం కూడా నేను నేర్పుతాను. మీ మనవడు చెప్పేదీ, ఉత్త రాల్లో రాసేదీ అన్నీ అర్థమైపోతాయి."

"సరే, నేను ఇంగ్లీషు నేర్చుకుంటున్న విషయం గోప్యంగా ఉంచాలి."

"మీరు చేసేది మంచిపనేగా? రహస్యం దేనికీ?"

"ముసలాడికి దసరా పండుగ అన్నట్టు ముసి ల్దానికి ఇంగ్లీషు మోజు అని నవ్వుతారేమో అని"

"సరే, రహస్యంగానే ఉంచుదాం. ఎప్పుడు మొదలెడదాం?"

"అయం ముహూర్తోస్సు ముహర్తః అని ఇప్పుడే ప్రారంభిద్దాం, సరస్వతీ నమస్తుభ్యం... చదువుల తల్లి ప్రార్థనకూడా చేసేశాను. ఇక మీదే ఆలస్యం".

"ఇవి ఎబిసిడిలు. మొదటి బడి. అచ్చులో కని పించేవి ఈ ఆకృతులే. ఆంగ్ల అక్షరంపైన ఎలా పలకాలో తెలుగులో రాశాను. ఈ ఇరవయ్యారక్ష రాలే మరో మూడు విధాలుగా కూడా ఉంటాయి. ఇవి వస్తే అవి సులభంగా వచ్చేస్తాయి" అన్నాడు శ్యామ్. ఆ సంభాషణా, హావభావాలూ ఆశ్చ ర్యంగా గమనిస్తున్నారు సభికులంతా.

ఒకసారి ఆగాడు శ్యామ్.

"యామినీ గారు మర్నాటికే అన్నీ పట్టేశారు. అది పట్టుదల ప్రభావం" నాలుగో రోజుకి నాలుగు బడులు.. పదో రోజుకి పదాలు... ముప్పయ్యో రోజుకి వాక్యాలు....ఓ తపస్సులా నేర్చుకున్నారు. స్పోకెన్ ఇంగ్లీషు పుస్తకాలు మొదలైనవి రెండేసి రోజుల్లో పూర్తి చేసేశారు. తెలుగు బాగా వచ్చు కనుక ఇంగ్లీషు సులభంగానూ సత్వరంగానూ వచ్చింది" అన్నాడు శ్యామ్. తర్వాత వాళ్ళిద్దరూ వేదికమీద రెండు నిమిషాలు ఇంగ్లీషులో మాట్లాడు కున్నారు.

"నేనిప్పుడు మా మనవడి ఉత్తరాలు చదువుకో గలను స్వంతంగా" అందావిడ. సభలోంచి పది మంది స్త్రీలు లేచి "మాకొచ్చేవి తెలుగుత్తరాలే అయినా మేము తెలుగు చదవలేం. యామిని గారిని చూశాక మాకు ధైర్యం వచ్చింది ఈ వయ స్సులో కూడా చదువుకోవచ్చని. మాకూ నేర్పండి శ్యామ్‌బాబు!" అని అడిగారు.

"యామినిగారికి మంచి తెలుగు వచ్చు. మీకూ వారికీ అభ్యంతరం లేకపోతే ఆవిడే నేర్పి స్తారు. ఆశ్రమంలోనే బడీనూ–"

"వారి దగ్గర నేర్చుకోడం మా కిష్టమే" అన్నారు వారు.

"నేర్పడం నాకూ ఇష్టమే"అన్నారు యామిని.

"ఒక దీపం పది దీపాల్ని వెలిగించడం అంటే ఇదే, ఒక్కసారి మీరందరూ సరస్వతీ నమ స్తుభ్యం... అనండి" అన్నాడు శ్యామ్‌సుందర్. అందరి గొంతులూ ముక్తకంఠంతో పద్యం అందుకు న్నాయి.

**సెల్: 91 99519 26586**



## అంత ఇవ్వలేదట!

*పైసా వసూల్ సినిమా నిర్మాణ బాధ్యతలను చార్మి చూసుకుందన్న సంగతి తెలిసిందే! ఇందుకు గాను ఆమెకు నాలుగు కోట్లు ముట్టజెప్పారన్న వార్తలు జోరుగా షికారుచేశాయి. ఈ నేపథ్యంలో చార్మి ఎట్టకే లకు నోరు విప్పింది. ఆ సినిమా నిర్మాణ బాధ్యతలను చూసిన మాట వాస్తవమే అంటూ తనకు అంత పెద్ద మొత్తంలో పారి తోషికం ముట్టలేదని అంటోంది. సినిమా బడ్జెట్ 25 కోట్లు. అలాంటప్పుడు నాకు అంత ఎవరు ఇస్తారు? అంటూ ఎదురు ప్రశ్నిస్తోంది. మీడియం హీరోకే అంత ఇవ్వడం లేదని చెబుతోంది. ఇన్ని మాటలు మాట్లాడిన చార్మి ఆ సినిమాకు అసలు తనకు ఎంత ముట్టిందో మాత్రం చెప్పలేదు. ఎంతో కొంత ముట్టింది అంటూ దాట వేస్తోంది.*

# సొరియాసిస్ వ్యాధి పునాదులు కదులుతాయి

చనిపోయి మళ్లీ పుడితేనే పునర్జన్మ అని కాదు. ఏళ్ల పర్యంతంగా వేధిస్తూ వచ్చిన ఒక తీవ్రమైన వ్యాధి నుంచి పూర్తిగా బయటపడటం కూడా పునర్జన్మే అవుతుంది. సొరియాసిస్ నుంచి వి ముక్తి పొందడం కూడా కృతంగా పునర్జన్మే అ వుతుంది. దురదా మంటలతో నరకాన్ని చూపిస్తూ, నిద్ర ఆహారాలకు కూడా దూరం చేసే సొరియాసిస్ నుంచి విముక్తం చేయగలిగేది ఆ యుర్వేదం కాక మరేముంది? ఆరోగ్యం విష యంలో సమాధానం లేని ప్రశ్నలు గానీ, పరిష్కారం కాని సమస్యలు గానీ ఏమీ ఉండవని ఆయుర్వేదం బలంగా నమ్ముతుంది. కాకపోతే ఆ యా విషయాల్లో మనసునంత లోతుగా లగ్నం చేయాల్సి ఉంటుంది. ఎన్ని మందులు వాడినా, సొరియాసిస్ ఎప్పటికీ పోదేమో అనుకుంటారు చాలా మంది. ఎంత సేపూ వ్యాధి లక్షణాలను అణచివేయడమే తప్ప, వ్యాధి మూలాలను తొలగించే వైద్యం అందనప్పుడు సొరియాసిస్ అలా కొనసాగుతూనే ఉంటుంది.




డాక్టర్ ఎన్. రామకృష్ణారెడ్డి
ఆర్.కె ఆయుర్వేదిక్ అండ్ సొరియాసిస్ రీసెర్చ్ సెంటర్
కూకట్‌పల్లి 8886922245
నాంపల్లి 8886922247
హన్మకొండ 8886922248
విజయవాడ 8886922249
వైజాగ్ 8886922250
కర్నూలు 8886922251
తిరుపతి 8886922252


### భిన్నత్వమే విశిష్టత

ఆయుర్వేద వైద్య విధానం మిగతా అన్ని వైద్య విధానాల కన్నా ఎంతో భిన్నమైనది. వ్యాధి రావడానికి గల అసలు కారణాలను పరిశీలించి, వాటిని సమూలంగా తొలగించే అన్ని చర్యలూ తీసుకుంటుంది. చర్మం మీదే కనిపించే సొరియాసిస్‌కు ధాతువులను దెబ్బ తీసేంత శక్తి ఉంటుందా అని కూడా కొందరు అనుకుంటారు. నిజానికి సొరియాసిస్‌కు సప్తధాతువులనే కాదు, సమస్త శరీర వ్యవస్థలనూ ధ్వంసం చేసే తత్వం ఉంటుంది. అలా ధాతువులు క్షీణిస్తూ వెళ్లే కొద్దీ శరీరంలో వాతం పెరిగిపోతుంది. ఒక్క వాతం సంతులనం (బ్యాలెన్స్) కోల్పోతే ఆ ప్రభావంతో మిగతా పిత్తం, కఫం కూడా సంతులనం కోల్పోతాయి. అయితే, చికిత్సా విధానాలతో ఒక్క వాతాన్ని తిరిగి సాధారణ స్థితికి తెస్తే, పిత్త కఫాలు కూడా సాధారణ స్థితికి వస్తాయి. అందుకే ఆయుర్వేదం వాత నియంత్రణకు అత్యధిక ప్రాధాన్యతనిస్తుంది.

### ఆయుర్వేదమే అసలైన వైద్యం

ఎన్నో ఏళ్లుగా వైద్య చికిత్సలు తీసుకుంటూనే ఉన్నాం. అ యినా సొరి యాసిస్ ఏ మాత్రం తగ్గలేదని చాలా మంది వాపోతుంటారు. కానీ, ఆ చికిత్సలు పై పై పూతలకే పరిమితమైనవా? శరీరం లోలోతుల్లోకి వెళ్లి సప్తధాతువులనూ ఉత్తేజితం చేసినవా? అన్నది ప్రశ్న. సొరియాసిస్ మచ్చలు చర్మం మీదే కనిపిస్తున్నాయని, పైపై వైద్యాలకే పరిమితమైతే సొరియాసిస్ రోజురోజుకూ పెరుగుతూనే వెళుతుంది. అందుకే, కేవలం బాహ్య చికిత్సలకో లేదా ఔషధాలకో పరిమితమైతే సొరియాసిస్‌కు అది పరిపూర్ణ వైద్యం కాదు. సొరియాసిస్‌కి కారణమైన ఆమాన్ని అంటే విషపదార్థాలను ముందు పంచకర్మ చికిత్సల ద్వారా తొలగించాలి. ఆ తరువాత ధాతుక్షయాన్ని నివారించే ఔషధాలు కూడా ఇవ్వాలి. వమనం, విరేచన కర్మల ద్వారా శరీరంలోని మలినాలన్నీ తొలగిస్తే వాతం అప్పుడు నియంత్రణలోకి వస్తుంది. మిగతా పిత్త, కఫాలు కూడా అదుపులోకి వస్తాయి. అప్పుడే సొరియాసిస్ సమూలంగా తొలగిపోతుంది. ఆయుర్వేదం ఎటువంటి జటిలమైన సమస్యనయినా సవాలుగా తీసుకుంటుంది. దానికి సమాధానం చెప్పి తీరుతుంది. ఇదేదో నమ్మకానికి సంబంధించింది ఎంత మాత్రం కాదు. ఇది పక్కా శాస్త్రీయమైన చికిత్స. అందుకే అందుకే సొరియాసిస్ వ్యాధి ఆయుర్వేదం ముందు తలవంచుతోంది. అలా సొరియాసిస్ బాధితులు సమాజంలో మునుపటిలా సగౌరవంగా బతికేలా చేస్తోంది.

---

# స్వర్ణామృతప్రాశనతో ఆటిజానికి స్వస్తి

పిల్లల్లో శారీరక ఎదుగుదల ఆగిపోతే, కొద్ది రోజుల్లోనే తెలిసిపోతుంది. అదే మానసిక ఎదుగుదల ఆగిపోతే గుర్తించడం అంత సులువేమీ కాదు. ఆటిజంతో వచ్చే క్కే ఇది. సహజంగా పిల్లలమీద తలిదండ్రులు మీద ఉండే వల్లమాలిన ప్రేమ వల్ల వారికి పిల్లల లోపాలు గానీ తప్పిదాలుగానీ వెంటనే మనసుకు తెలియవు. . ఒ కవేళ ఎప్పటికో వాళ్ల దృష్టికి వచ్చినా తమ పిల్లవాడు ఒ క పెద్ద లోపంతో ఉన్నాడనే నిజాన్ని ఒప్పుకోవడానికి మనసు ఒ క పట్టాన అంగీకరించదు. కానీ, వాళ్ల మనసు అంగీకరించనంత మాత్రాన ఉన్న లోపాలు వాటికవే మాయమైపోవు కదా! మన మన ఇష్టాఇష్టాలు ఎ లా ఉన్నా, ప్రతి తలిదండ్రీ ఆటిజం వ్యాధి లక్షణాల గురించి తెలిసి ఉండడం చాలా అ వసరం.

### ఆటిజంలో ఏమవుతుంది.?

శారీరక ఎదుగుదలతో సమానంగా, మానసిక ఎదుగుదల కూడా ఆగిపోతుంది. ఆటిజం వ్యాధిగ్రస్తుల్లో తాము చేయాల్సిన పనేమిటో, చేయకూడనిదేమిటో తెలియని ఒక నిస్సహాయత ఆటిజం బాలబాలికల్ని పీడిస్తుంది. ఆటిజంలో వయసుతో పాటు రావల్సిన జ్ఞానమేదీ రాదు. విషయాల్ని గుర్తించే శక్తి ఉండదు. ఎవరితోనూ కలవకుండా ఒంటరిగా ఉండడాన్ని ఇష్టపడతారు. ఆటిజంలో కొంతమంది పిల్లల్లో అతిగా ప్రవర్తించే హైపర్ యాక్టివ్ లక్షణాలు కూడా కనిపిస్తాయి.

### ఆటిజం కారణాల్లోకి వెళితే.....

- ఎదుటి వారి కళ్లలోకి చూస్తూ ఎప్పుడూ మాట్లాడరు. ఈ పిల్లలకు మాటలు వచ్చినా ప్రతిసారీ రెండు పదాలకు మించి మాట్లాడరు. అయతే ఆ రెండు మాటల్నే మళ్లీ మళ్లీ చెబుతారు.
- హైపర్ యాక్టివిటీ వీరిలో కనిపిస్తుంది. అన్ని విషయాల్లో అతిగా వ్యవహరించడం కనిపిస్తుంది. తనంతట తాను అరవడం, కేకలు వేయడం తను అలా ఎందుకు చేస్తున్నాడో తానేమీ తెలిసే స్థితిలో ఉండడు. ఒక్క నిమిషమైనా ఒక చోట స్థిరంగా నిలబడరు.

### స్వర్ణామృత ప్రాశన వల్ల జరిగేదేమిటి?

ఆటిజంలోని ప్రధాన సమస్య మెదడుకు శరీరానికి మధ్య సంబంధం తెగిపోవడం. అలా తెగిపోవడానికి మెదడు తన సహజమైన పటుత్వాన్ని కోల్పోవడమే కారణం. ఈ స్థితిలో స్వర్ణామృత ప్రాశన మెదడుకు శక్తిని ప్రసాదిస్తుంది. మొత్తం నాడీ వ్యవస్థను, మెదడులోని స్పీచ్ సెంటర్లను చైతన్యపరుస్తూ బాడీకి కనెక్ట్ అయ్యేలా చేస్తుంది. అందుకే స్వర్ణామృత ప్రాశన వాడటం మొదలెట్టిన మొదటి రెండు నెలలలోపల మాట రావడాన్ని గమనించవచ్చు. ప్రతి సందర్భంలోనూ స్పష్టంగా మాట్లాడలేకపోయినా తొలుత సంజ్ఞల రూపంలోనైనా తన మనోభావాల్ని వ్యక్తం చేయడం మొదలవుతుంది. 5వ నెల వచ్చేసరికి అప్పటిదాకా ఉంటూ వచ్చిన హైపర్ యాక్టివ్ తత్వం, స్వర్ణామృతప్రాశనలో స్వర్ణభస్మంతో పాటు, మనిషి మేధోశక్తిని పెంచే మేధోద్రవ్యాలు కూడా ఇందులో ఉన్నాయి. ఇవి ఆటిజం పిల్లల ఐ.క్యూ లెవెల్‌ను పెంచడంలో ఎంతో ఉపయోగపడతాయి. స్వర్ణామృతప్రాశనంతోపాటు ఎడిహెచ్‌డి. హైపర్ యాక్టివిటీ డిజార్డర్‌లో నస్యకర్మతోపాటు కొన్ని ప్రత్యేకమైన చికిత్సలను అందుబాటులోకి తేవడం జరిగింది. అందువల్ల స్వర్ణామృతప్రాశన వాడుతూ, ఈ చికిత్సలను కూడా తీసుకుంటే, ఆటిజం నుంచి బయటపడటమే కాదు, అందరికీ సరిదీటుగా అడుగులు ముందుకు వేస్తారు. అనుకున్నది సాధిస్తారు.



# భారత్ పక్కలో మరో బల్లెం

**భారత్‌ను లొంగదీసుకోవడానికి పాకిస్థాన్ పంథానే అనుసరించడానికి చైనా ప్రయత్నిస్తోంది. కశ్మీర్‌లో పాకిస్థాన్ మాదిరిగా, సిక్కింలో సమస్యలు సృష్టించాలని చైనా భావిస్తున్నట్టుంది.**

ఒక పక్క చైనా, మరో పక్క పాకిస్థాన్! ఈ రెండు దేశాలు కూడబలుక్కుని భారత్ మీద విమర్శలు, ఆరోపణలు చేస్తున్నాయనిపిస్తుంది. అంతేకాదు, ఇంతకాలంగా పాకిస్థాన్ చేస్తున్న విమర్శలే ఇప్పుడు చైనా నోటా వినిపిస్తున్నాయి. ముఖ్యంగా కశ్మీర్ సమస్య మీద పాకిస్థాన్, ఆ దేశ కనుసన్నల్లో కార్యకలాపాలు నిర్వహిస్తున్న లష్కరే తోయిబా వంటి ఉగ్రవాద సంస్థలు చేస్తున్న వ్యాఖ్యలు, వ్యాఖ్యానాలను చైనా కూడా వల్లెవేస్తోంది. కశ్మీర్ మీద ప్రపంచ దేశాల దృష్టి ఇంతవరకూ భారత్‌కు అనుకూలంగా ఉంది. దాన్ని ప్రతికూలంగా మార్చడానికి ఇప్పుడు చైనా గట్టిగా ప్రయత్నిస్తున్నట్టు, ఓ కొత్త వాదనని సిద్ధం చేస్తున్నట్టు కనిపిస్తోంది. కశ్మీర్‌లో ఆందోళనకారుల్ని మట్టుబెట్టడానికి, వారి శరీరాలు కూడా కనిపించకుండా చేయడానికి భారత్ రసాయన అస్త్రాలు ఉపయోగిస్తోందనేది ఈ కొత్త వాదనలో ఓ ప్రధాన భాగం. ప్రస్తుతం కశ్మీర్ మీద విష ప్రచారం చేయడంలో పాకిస్థాన్ కంటే చైనా అనేక మెట్లు ముందుంది.

జూలై ప్రారంభం నుంచి చైనా ఈ కొత్త వాదనతో ప్రపంచ దేశాల ముందుకు వెడుతోంది. కశ్మీర్ సమస్య పరిష్కారంలో అవసరమైతే చైనా మధ్యవర్తిత్వం నెరపడానికి సిద్ధంగా ఉందంటూ ఆ దేశ నాయకులు ప్రకటన చేయడానికి కొద్ది రోజుల ముందే ఈ విషప్రచారం ప్రారంభమైపోయింది. అనేక సంవత్సరాలుగా లష్కరే తోయిబా చేస్తున్న వాదననే ఇప్పుడు చైనా తన సొంతం చేసుకోవడం ఆందోళన కలిగించే విషయం. ఇది ఓ ఉగ్రవాద సంస్థ చేస్తున్న ప్రచారం కాబట్టి ఏ దేశమూ పెద్దగా పట్టించుకోలేదు. చైనా వంటి అగ్రరాజ్యమే ఇటువంటి ప్రచారం ప్రారంభిస్తే కొన్ని దేశాలైనా పట్టించుకునే ప్రమాదం ఉంది. చైనా వాదనని లష్కరే నాయకులు వెంటనే సమర్థించారు. సైనికపరంగా, దౌత్యపరంగా శక్తిమంతమైన చైనా వంటి దేశం కశ్మీర్ పోరాటానికి మద్దతు ఇవ్వడం నిజంగా అభినందనీయమంటూ ఆ ఉగ్రవాద సంస్థ నాయకులు ఓ ప్రకటన జారీ చేశారు. కశ్మీర్ తరఫున చైనా తన దౌత్య, సైనిక శక్తిని ఉపయోగించగలిగితే అంతకన్నా కావాల్సిందేముందని కూడా వారు వ్యాఖ్యానించారు.

ఆ సంస్థ అక్కడితో ఆగలేదు. "కశ్మీర్‌లో అమాయక ప్రజలపై భారత్ రసాయన ఆయుధాలు ఉపయోగిస్తోందని మేం చాలా కాలంగా చెబుతున్నాం. తనిఖీలు, సోదాల పేరుతో కశ్మీరీల ఇళ్లు వాకిళ్లను భారతదేశ సైనిక బలగాలు నేలమట్టం చేస్తున్నాయి. మృతదేహాలను గుర్తు పట్టకుండా ఉండడానికి రసాయనాలను ఉపయోగిస్తున్నారు" అని లష్కర్ నాయకులు విమర్శించారు. "ఆసియాలో చైనా అతి పెద్ద శక్తి అనడంలో సందేహం లేదు. ఆ దేశ ఆధిపత్యాన్ని మేం అంగీకరిస్తున్నాం. ఈ ప్రాంత సుస్థిరతలో చైనా కీలక పాత్ర పోషించగల స్థితిలో ఉంది. కశ్మీర్‌పై ఐక్యరాజ్యసమితి తీర్మానాలను భారత్ అమలు చేసేటట్టుగా ఆ దేశంపై ఒత్తిడి తేవాలని, ఆ విషయంలో చైనా ముందుండాలని మేం కోరుకుంటున్నాం. కశ్మీర్‌లో భారత్ ఆటవిక చర్యలను ఎండగట్టాలని కూడా కోరుతున్నాం" అని ఆ సంస్థ నాయకులు తమ ప్రకటనలో పేర్కొన్నారు.

## చైనా ఆధిపత్య ధోరణి

లష్కర్ సంస్థ వ్యవస్థాపకుడు హాఫీజ్ సయ్యద్‌ను అంతర్జాతీయ ఉగ్రవాదిగా ప్రకటించకుండా ఐక్యరాజ్యసమితిలో చైనా అడ్డుపడడానికి కారణం తన మిత్ర దేశమైన పాకిస్థాన్‌ను సంతృప్తిపరచాలన్న ఉద్దేశమేనని భారత రాజకీయ విశ్లేషకులు భావిస్తున్నారు. 2008 నవంబర్‌లో ముంబై మీద దాడి చేసిన ఉగ్రవాదులకు చైనాయే శిక్షణ, ఇతర సహాయ సహకారాలు అందజేసి ఉండవచ్చని కూడా విశ్లేషకులు అనుమానిస్తున్నారు. ఏది ఏమైనా ఇప్పుడు లష్కర్ వాదన, చైనా వాదన ఒకేలా ఉంది. ఈ రసాయనాల ప్రచారంతో చైనా ఇప్పటికే ప్రపంచ దేశాల దృష్టిని మరలుస్తోంది. ప్రపంచంలోని అనేక దేశాలలో చైనా పెద్దయెత్తున పెట్టుబడులు పెడుతున్నందువల్ల, ఆ దేశాలు చైనా వల్ల ప్రభావితమయ్యే అవకాశం ఉంది. ఆ దేశాలు ఐక్యరాజ్యసమితి వంటి ప్రపంచ వేదికల మీద చైనా వాదనను సమర్థించే ప్రమాదం కూడా ఉంది.

కశ్మీర్ సమస్య మీద భారత్‌కు వ్యతిరేకంగా ఇప్పటికే కొన్ని అంతర్జాతీయ వేదికల మీద ప్రసంగాలు, ప్రకటనలు వెల్లువెత్తుతున్నాయి. కేంద్ర ప్రభుత్వం, కొన్ని మేధో వర్గాలు వీటిని తక్కువ అంచనా వేస్తున్నట్టు కనిపిస్తోంది. కశ్మీర్ సమస్యపై భారత్‌కు వ్యతిరేకంగా పోరాటాలు జరపాలంటూ ఇరాన్‌కు చెందిన ఆయతుల్లా ఖోమేనీ ఇటీవల పిలుపు ఇచ్చారు. టర్కీ అధ్యక్షుడు రెసెప్ తయీప్ ఎర్డో

# రివ్యూ

**- రాజశుక**

గాన్ ఇటీవల భారత పర్యటనకు వచ్చి, భారత్, పాకిస్థాన్‌ల మధ్య కశ్మీర్ విషయంలో అవసరమైతే మధ్యవర్తిత్వం నెరపడానికి సిద్ధమేనంటూ ప్రకటించారు. ఇక రష్యా కూడా చైనా, పాకిస్థాన్ జోడీకే అనుకూలంగా వ్యవహరించబోతున్నట్టు ఇప్పటికే సంకేతాలు వెలువడుతున్నాయి. డోనాల్డ్ ట్రంప్ నాయకత్వంలోని అమెరికా ఎటువైపు మొగ్గు చూపుతుందనేది అంతుబట్టని విషయం.

వాస్తవానికి కశ్మీర్‌లో మానవ హక్కుల ఉల్లంఘన గురించి అనేక వదంతులు ప్రచారంలో ఉన్నాయి. భారీ స్థాయిలో ఖననాలు, దహనాలు, అత్యాచారాలు, అదృశ్యాలు చోటు చేసుకుంటున్నాయని, అనేక ప్రాంతాలలో దాదాపు సగం మంది మహిళలు వితంతువులేనని ప్రచారం జరుగుతోంది. పలువురు అధికారులు, పార్టీ నాయకులు కూడా వదంతులకు బలం చేకూరే విధంగా మాట్లాడుతున్నారు. 1990లలో భారీ ఎత్తున అత్యాచారాలు, ఖననాలు, అదృశ్యాలు జరిగిన మాట నిజమేనని పోలీస్ అధికారులు కూడా గణాంకాలతో తెలియజేస్తున్నారు. అయితే, అప్పట్లో వీటిని ఎవరూ అంతగా పట్టించుకోలేదు. వాజ్‌పేయి, ముషరఫ్‌ల శాంతి ప్రక్రియ ప్రారంభమైనప్పటి నుంచి ఈ దారుణాలకు అంతే లేకుండా పోయిందనేది వారి అభిప్రాయం. కశ్మీర్‌లో సైనికులు మాత్రమే ఇటువంటి ఘోరాలకు పాల్పడుతున్నారనడం సరికాదని, సైనికుల పేరు చెప్పి స్థానిక ఆందోళనకారులు, ఉగ్రవాద సంస్థల సభ్యులు కూడా హత్యలు, అత్యాచారాలకు ఒడిగడుతున్నారని దర్యాప్తు అధికారులు చెబుతున్నారు. స్థానిక ప్రజానీకం, ముఖ్యంగా గ్రామీణ ప్రజానీకం సైనికుల కంటే ఇటువంటి దుండగులకే ఎక్కువగా భయపడుతున్నారని దర్యాప్తుల్లో తేలింది. అందుకే ఎన్నికల్లో ఎక్కువగా గ్రామీణులు పాల్గొనడం లేదని కూడా వారు చెబుతున్నారు.

### కొత్త వ్యూహ ప్రతివ్యూహాలు

ఇవన్నీ ఇలా ఉండగా, కశ్మీర్ విషయంలో చైనా కూడా పాకిస్థాన్ బాట పట్టడం ఆందోళన కలిగించే విషయం. ఒక పక్క సిక్కింకు స్వాతంత్ర్యం కావాలని చైనా ప్రకటనల మీద ప్రకటనలు చేస్తుండగా, పాకిస్థాన్ 'నాజర్' అనే క్షిపణిని పరీక్షించడం కూడా ఆందోళన కలిగిస్తోంది. మొత్తానికి ఈ రెండు పొరుగు దేశాలు భారత్ విషయంలో తాము ఏమైనా చేయగలమన్న అభిప్రాయం కలిగిస్తున్నాయి. భూటాన్‌కు సమీపంలోని డోక్‌లా వద్ద చైనా తన సైన్యాన్ని మోహరించడం, భారతభూటాన్ సంబంధాలను విచ్ఛిన్నం చేయడానికి సరిహద్దుల్లో అలజడి సృష్టించడం వంటి చైనా కార్యకలాపాలు ప్రమాదస్థాయిని దాటుతున్నాయి. సిక్కిం, కశ్మీర్‌లకు స్వాతంత్ర్యం కావాలనే డిమాండును పాకిస్థాన్ నుంచి చైనా ఎరువు తెచ్చుకున్నట్టు కనిపిస్తోంది. 1975లో ప్రజాభిప్రాయ సేకరణ తర్వాత సిక్కిం భారత్‌లో కలిసిపోయింది. అయితే, భారత దౌర్జన్యంగా సిక్కింను విలీనం చేసుకుందని చైనా ఆరోపిస్తోంది. తాను కశ్మీర్‌లో కల్లోలం సృష్టిస్తుండగా చైనా సిక్కింపై పట్టాలని పాకిస్థాన్ కోరుకుంటున్నట్టు మీడియా వార్తలు తెలియజేస్తున్నాయి.

సిక్కిం నిస్సందేహంగా భారత్‌లో భాగమేనని చైనాకు బాగా తెలుసు. అయినప్పటికీ, భూటాన్ సమీపంలో డోక్‌లా దగ్గర తాము రోడ్డు మార్గం వేయకుండా భారత్ అడ్డుకోవడాన్ని నిరోధించడానికే చైనా ఈ విధమైన బ్లాక్‌మెయిల్ విధానాలకు పాల్పడుతోంది. తాము భారత్ మీద సైనికపరంగా, దౌత్యపరంగానే కాదు, పరోక్ష, ప్రచ్ఛన్న యుద్ధం కూడా జరపగలమని చైనా చెప్పకనే చెబుతోంది. అంటే, కశ్మీర్‌లో పాకిస్థాన్ చేస్తున్న పనినే సిక్కింలో చైనా చేస్తుందన్న మాట. నిజానికి చైనా నుంచి ఇటువంటి స్పందనను భారత్ ముందుగానే ఊహించింది. చైనా చేపట్టిన 'వన్ రోడ్, వన్ బెల్ట్' ప్రాజెక్టుని బహిష్కరించాలని భారత నిర్ణయించుకున్నప్పుడు, హిందూ మహాసముద్రంలో అమెరికా, జపాన్‌లు చేపట్టే ఉమ్మడి నౌకా విన్యాసాలకు భారత్ మద్దతు ఇవ్వదలచుకున్నప్పుడు సహజంగానే చైనా మండిపడింది. దాంతో చైనా రోడ్డు నిర్మాణం పేరుతో డోక్‌లా వద్ద వాస్తవాధీన రేఖను దాటింది. పైగా వాస్తవాధీన రేఖ వద్ద నుంచి వెనక్కు వెళ్లాలని, చర్చలకు ఉపక్రమించాలని భారత్‌కే హెచ్చరిక పంపింది. భారత్ కూడా ఇదివరకటి మాదిరిగా మెతక వైఖరి అవలంబించదలచుకోలేదు. అవసరమైతే చైనాతో యుద్ధానికి కూడా సిద్ధమేనన్న సంకేతాలు పంపింది.

### యుద్ధ వాతావరణం

అయితే, ఈ రెండు దేశాలు యుద్ధానికి తలపడే అవకాశం లేదు. భారత్ తన సైన్యాన్ని ఆధునికీకరిస్తోంది. ఈ ఆధునికీకరణ ఇంకా పూర్తి కాలేదు. ప్రత్యేకంగా పర్వతాలపై యుద్ధం జరపడానికి ఉద్దేశించిన దళాలు కూడా ఇంకా పూర్తిగా రూపుదిద్దుకోలేదు. ఇక చైనా విషయానికి వస్తే డోక్‌లా విషయంలో భారత్‌తో తలపడడంవల్ల చైనాకు పెద్దగా ఉపయోగమేమీ లేదు. సిక్కిం సరిహద్దుల్లో భారత్ మోహరించిన సైన్యం శక్తిమంతమైంది. ఇక్కడ భారత్ గట్టి ప్రతిఘటనే చేస్తుంది. సుమారు వంద కిలోమీటర్ల విస్తీర్ణంలో ఉన్న కారడవిలో చైనా యుద్ధం చేయడం ఆ దేశానికే నష్టదాయకమవుతుంది. అందువల్ల ప్రస్తుతానికి ఈ రెండు దేశాల మధ్యా మాటల యుద్ధమేతప్ప చేతల యుద్ధం జరిగే అవకాశం లేదు.

నాజర్ అనే క్షిపణిని పరీక్షించిన పాకిస్థాన్‌తోనే చిక్కంతా. అది తన క్షిపణితో అణ్వస్త్రం కూడా ప్రయోగించే అవకాశం ఉంది. భారత్ గనుక వాస్తవాధీన రేఖ దాటి తమ భూభాగంలోకి ప్రవేశిస్తే, ఈ క్షిపణిని ప్రయోగించడానికి వెనుకాడవద్దని పాకిస్థాన్ తన సైనికాధికారులను ఆదేశించింది. ఇక భారత్ వాస్తవాధీన రేఖ దాటి పాకిస్థాన్‌లో ప్రవేశించే అవకాశమే లేదని ఆ దేశ సైనికాధికారులు కూడా చెబుతున్నారు. ఇప్పుడు ఈ రెండు దేశాలు సైనికపరంగా, వ్యూహాలపరంగా ఒకే స్థాయిలో ఉన్నాయని ఆ దేశ సైనికాధికారులు స్పష్టం చేశారు. అంటే, తాము భారత్‌లో ఎటువంటి జోక్యం చేసుకున్నా భారత్ స్పందించే అవకాశం లేదని వారు చెప్పకనే చెబుతున్నారు.

ఇజ్రాయెల్ వంటి కొత్త స్నేహితులను భారత్ కూడగట్టుకుంటుండగా, పాకిస్థాన్, చైనా వంటి దేశాలు భారత్ సార్వభౌమాధికారాన్ని సవాలు చేస్తూ, దాడులకు కూడా సిద్ధపడడం ఆందోళనకరంగానే ఉంది. తమ సరిహద్దుల్లో పొరుగు దేశాలు చేస్తున్న హడావిడిని భారత్ ఎలా తట్టుకుంటుందన్నది వేచి చూడాల్సిన పరిణామమే. పాకిస్థాన్‌తో ఇప్పుడు అనుసరిస్తున్న వ్యూహాన్నే కొనసాగిస్తూ, చైనాతో మాత్రం చర్చలు జరిపి సమస్యలను పరిష్కరించుకోవడం ఉత్తమమని విదేశీ వ్యవహారాల నిపుణులు అభిప్రాయపడుతున్నారు.





**కశ్మీర్ విషయంలో చైనా కూడా పాకిస్థాన్ బాట పట్టడం ఆందోళన కలిగించే విషయం. కశ్మీర్‌లో పాకిస్థాన్ చేస్తున్న పనే సిక్కింలో చైనా మొదలుపెట్టింది. తమలానే చైనా సిక్కిం పనిపట్టాలని పాకిస్థాన్ కోరుకుంటున్నట్టు మీడియా వార్తలు తెలియజేస్తున్నాయి. మరోవైపు ఆ దేశం నాజర్ క్షిపణి పరీక్ష చేసింది. ఈ రెండు దేశాలు భారత్ సార్వభౌమాధికారాన్ని సవాలు చేయడం, దాడులకు సిద్ధపడడం ఆందోళనకరం.**



8

# లాకర్ నెం. 369



-ప్రభాకర్ జైని సెల్: +91 90308 83785

ఈ సారి మా బ్యాంక్ ఛైర్మన్ మా హెడ్డాఫీసు కలకత్తాకు పిలిపించి ఫెలిసిటేట్ చేశారు. బ్యాంకుకే గర్వకారణమని పొగిడారు.

మా బ్యాంక్ ఇన్-హౌజ్ మ్యాగజైన్‌లో నా గురించి మంచి ఆర్టికల్ ప్రచురించారు.

కానీ, ఈసారి నన్ను పార్టీ అడగడానికి మా ఆఫీసులో ఎవడికీ ముఖం చెల్లలేదు. కనీసం నన్ను అభినందించలేదు కూడా. నేనే రాగిణికి మాత్రం 'కాఫీహౌజ్'లో కాఫీ తాగించాను. తను మౌనంగా ఉండిపోయింది.

కానీ, యూనియన్లు వేరైనంత మాత్రాన నా మీద ఇంత కక్ష గట్టిన వాళ్ళను ఊరికే వదలదల్చుకోలేదు నేను.

పార్ట్ 2 పరీక్ష రోజున చీఫ్ ఎగ్జామినర్ ఇచ్చిన ఉత్తరంలోని హ్యాండ్ రైటింగ్‌లను గుర్తించాను. ఆఫీసు ఫైళ్ళలో అంతకు ముందు వారు రాసిన రాత ప్రతి నుండి వారి రాత నమూనాలను సేకరించి ఒక ఫ్రెండు ద్వారా CFSLకు, ఫోరెన్సిక్ ల్యాబు, పంపించాను. అనఫిషియల్‌గా రిపోర్ట్ సంపాదించాను. వాటిని ఫోటోకాపీలతో సహా హెడ్డాఫీస్ మేనేజిమెంట్‌కు పంపించాను. జోనల్ మేనేజిమెంట్‌కు కంప్లైంట్ చేశాను. పోలీస్ కేసు కూడా ఫైల్ చేసి, మా సీనియర్ లాయర్ ద్వారా, ఒక్కరికి తప్ప, అందరికీ పరువు నష్టపరిహార నోటీసులు పంపాను.

వ్యవహారం బెడిసి కొట్టడంతో, ఆ ఉత్తరంలో పాలుపంచుకున్న వాళ్ళంతా బెదిరిపోయారు. ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకుని కాలం గడపసాగారు.

మరో గమ్మత్తైన విషయమేమిటంటే అసలు అవతలి యూనియన్ వారు నామీద కక్ష కట్టడానికి కారణం, నేను వాళ్ళ యూనియన్‌లో చేరలేదని, ప్రస్తుతమున్న యూనియన్‌లో చేరాననే. అయితే, నా విషయంలో ఏం లాలూచీ పడ్డారో కానీ మా యూనియన్ వాళ్ళు కూడా నా గురించి పోరాడలేదు. బ్యాంకుల్లో ఇటువంటి రహస్య ఒప్పందాలు యూనియన్ల మధ్య ఉంటాయని నాకు అప్పటి వరకూ తెలియదు.

బహిరంగంగా, నీచాతినీచంగా తిట్టుకునే వీళ్ళంతా




## జరిగిన కథ

ఇంటర్నేషనల్ సెక్యూరిటీ ఏజెన్సీలో మిడిల్ మేనేజ్‌మెంట్ స్థాయి అధికారి అతను. మాకనూరులో జరిగిన బ్యాంకు దోపిడీ కేసును ఛేదిస్తాడు. ఆ సందర్భంగా హైదరాబాద్‌లోని జోనల్ ఆఫీసులో పార్టీ అరేంజ్ చేస్తారు. పార్టీలో రామస్వామిని చూశాక, అతనికి తన గతం కళ్ళముందు మెదులుతుంది. బ్యాంకు ఉద్యోగం అతని కల. కష్టపడి ప్రొబేషనరీ ఆఫీసర్‌గా సెలక్టవుతాడు. కానీ కౌంటర్ లోపలి దృశ్యం అతణ్ణి కలవరపరుస్తుంది. స్టెనోఆఫీసర్‌గా బదిలీపై వచ్చిన రాగిణి అతణ్ణి ఆకర్షిస్తుంది. CAIIB పార్ట్ 1, పార్ట్ 2 పరీక్షలు రెండూ, ఒకటే అటెంప్ట్‌లో పాసవుతాడతను.

ఆ తర్వాత...

రాత్రులు కలుసుకుంటారని నాకు అప్పటి వరకూ తెలియదు. అందుకే, ప్రతీ చిన్న విషయానికి కూడా మేనేజిమెంట్ మీదకు కాలు దువ్వే మా యూని యన్ నాయకులు నామీద ఇంత ఘోరమైన కుట్ర జరిగితే, వ్యూహాత్మక మౌనం పాటించారు.

మేనేజిమెంట్ తేలు కుట్టిన దొంగలా సైలెంట్‌గా ఉండిపోయి లోపాయికారి వ్యవహారం నడిపి మా యూనియన్ లీడర్లకు ఏదో పెద్ద తాయిలమే ఆఫర్ చేసి నోరు మూయించినట్టుంది.

వాళ్ళు కేసును అణగదొక్కాలని చూసినా నేను వదిలి పెట్టదలుచుకోలేదు, అందుకే, ఈ విషయంలో వ్యక్తిగతంగానే నా పోరాటం ఆరంభించాను. అటు యూనియన్లకు, ఇటు మేనేజిమెంట్‌కు గొంతులో వెలక్కాయ పడ్డట్టుగా అయింది.

అందుకే నాకు సున్నితంగా హెచ్చరికలు మొద లయ్యాయి.

'మీకు ప్రమోషన్ కష్టమౌతుంది',

'మిమ్మల్ని మారుమూల ప్రాంతాలకు బదిలీ చేస్తారు'



అని కొన్ని రోజులు ఊదరగొట్టారు. తర్వాత,

'నీ అంతు చూస్తాం',

'హైదరాబాదులో ఎట్లా తిరుగుతావో చూస్తాం'

అని బెదిరింపులకు దిగారు. నేను కేర్ చేయక పోవడంతో,

'మన బ్యాంకు పరువే పోతుంది',

'ఏదో చూసీ చూడనట్టు ఊరుకోండి',

'అరెస్టయితే వాళ్ళ కుటుంబాలు నడి బజారు కొస్తాయి'

అంటూ కాళ్ళ బేరానికి వచ్చారు.

అయితే, నేను ఛైర్మన్ గారిని కలిసినప్పుడు పర్సనల్‌గా రెండు నిమిషాలు మాట్లాడాను. నేను బ్యాంక్ లోన్ డెలివరీ సిస్టమ్‌ను ఎలా ఇంప్రూవ్ చేయాలో చెబుతూ తయారుచేసిన నోట్ ఆయనకు ఇచ్చాను. ఆ విషయం తెలిసిన జోనల్ మేనేజర్, యూనియన్లు, నేను వాళ్ళ మీదనే కేసు విషయమై కంప్లయింట్ చేశానని పిసుక్కుని చస్తున్నారు.

అందుకే వాళ్ళ బెదిరింపులన్నీ తాటాకు చప్పుళ్ళే అని నాకు తెలుసు.

నన్ను ఘోరంగా అవమానపరిచిన విషయం పర్సనల్. బ్యాంకు పరువుకూ, దానికీ ఏ సంబంధం లేదు. కాబట్టి నా చర్య వల్ల బ్యాంకు ప్రక్షాళన అవు తుంది తప్ప బ్యాంకు పరపతికి ఎటువంటి ముప్పూ రాదు. అందుకే, నేను నా పట్టుదల వీడలేదు.

నా వైఖరితో, నేను మాట వినకపోవడంతో, మొత్తం యూనియన్లన్నీ నన్ను శత్రువుగా చూస్తున్నాయి. బ్యాంకులో పనిచేయడం దుర్భరంగా మారింది.

ఈ పరిస్థితుల్లో నాకు కొంచెం సాంత్వన లభిం చింది రాగిణి సాహచర్యంలోనే. రాగిణి ఇతరుల విషయాల్లో అస్సలు జోక్యం చేసుకునేది కాదు. తన పనేదో తను చేసుకునేది. మేమిద్దరమూ కలిసి లంచ్ రూములో ఒకే టైములో లంచ్ చేసేవాళ్ళం. నేను ఒంటరిగాణ్ణి. నా రూము నుండి లంచ్ బాక్స్ తెచ్చు కునే పరిస్థితి లేదు. బ్యాంకులో కూడా నాకు లంచ్ తేవడానికి సబ్ స్టాఫ్ ముందుకు రాకపోవడంతో నేనే బ్యాంకుకు వచ్చేటప్పుడు పళ్ళో, బిస్కెట్లో తెచ్చు కునే వాణ్ణి. రాగిణి నేను తినే తిండి చూసి జాలిపడి, నాక్కూడా తనే టిఫిన్ తెచ్చేది ఇంటి నుండి. వాళ్ళు తమిళ బ్రాహ్మిన్స్. వాళ్ళ వంటలు గమ్మత్తుగా ఉండేవి. రాగిణి మహా సున్నితం. ఆమె తినేది కూడా పిడి కెడే. బాక్సులో మిగిలినదంతా నేనే తినేవాణ్ణి.

రాగిణి బిహేవియర్ కూడా గమ్మత్తుగా ఉండేది. తను స్టెనో ఆఫీసర్ కాబట్టి చకచకా రాసే డిక్టేషన్ లాగానే పనులు కూడా చకచకా చేసేది. నేను టిఫిన్ బాక్సులోకి తొంగి చూసే సమయం లోనే, తను టిఫిన్ తినడం పూర్తి చేసేది. తినడానికి నాకు అరగంట పట్టేది. టీ నేను ఊదుకుంటూ పది నిమిషాలు తాగితే, తను ఎంత వేడి టీ అయినా ఒక్క నిమిషంలో తాగేసేది. ఎంత స్పీడ్‌గా టైప్ చేస్తుందో అంత స్పీడ్‌గా నడుస్తుంది. అంతే స్పీడ్‌గా మాట్లాడుతుంది. ఒక్కోసారి ఆమె మాట్లాడేది కూడా నాకు అర్థమయ్యేది కాదు. అర్థం చేసుకోవడానికి కష్టపడాల్సి వచ్చేది. కానీ, రాను రానూ నాకూ స్పీడ్‌గా తినడం, టీ తాగడం, మాట్లాడటం, నడ వడం అలవాటయ్యాయి, నాకు తెలియకుండానే.

బ్యాంకులో నా మీద అప్రకటిత యుద్ధం కొన సాగుతూనే ఉంది. ఎక్కడ తప్పు దొరికితే అక్కడ నన్ను నొక్కేయాలని వేయి కళ్ళతో ఎదురు చూస్తు న్నారు. అందుకే, నేను పని విషయంలో, ఆఫీసుకు అటెండయ్యే టైం విషయంలో చాలా స్ట్రిక్ట్‌గా ఉండడం అలవాటు చేసుకున్నాను.

నా మీద యుద్ధంలో భాగంగా నన్ను ఏ సీటు లోనూ పర్మనెంటుగా ఉంచకుండా, నెల రెండు నెల లకు నా సెక్షన్ మార్చేవారు. ఇంత కంటే వాళ్ళు చేయ గలిగిందేమీ లేదు. నాకు ప్రత్యేకంగా ఏ సీటుతోనూ అటాచ్మెంట్ లేదు కాబట్టి నాకేం ప్రాబ్లం లేదు. నాకు కొత్తగా అలాట్ చేసిన సెక్షన్‌లో ఏళ్ళ తరబ డిగా పనిచేస్తున్న వాళ్ళకే ప్రాబ్లం అంతా.

నేను కూడా ఏ సెక్షన్‌లో పనిచేస్తే ఆ సెక్షన్‌లోని అవినీతి బండారమంతా బయటపెట్టేవాణ్ణి.

బ్యాంకు ఉద్యోగులు చాలావరకు సాఫ్ట్ మను షులు. వారు జీవితం సాఫీగా సాగిపోతే చాలు అనుకునే మానసిక స్థితిలోకి వచ్చేసి ఉంటారు. మంచి జీతం, టైం ప్రకారం ప్రమోషన్లూ, LFC లూ, మెడికల్ క్లెయిములూ, వడ్డీ లేని ఇంటి లోన్లూ, వెహి కల్ లోన్లూ, ఇంట్లోకి కావలిసిన ఫర్నీచర్ లోన్లూ, పిల్లల స్కూలు ఫీజుల రీయింబర్స్‌మెంట్స్, ఆఫీసు కొచ్చేందుకు ఫ్రీ పెట్రోల్, ఫ్రీ ఇల్లూ ఉండడంతో కదు పులో చల్ల కదలకుండా ఉద్యోగాలు చేసుకుంటారు.

వాళ్ళకు పెద్దగా సమస్యలే రావు. వచ్చినా ఆదు కోవడానికి యూనియన్లు ఉంటాయి. కాబట్టి, బ్యాంకులో ఏం జరిగినా పట్టించుకోరు. ఎన్ని కుంభకోణాలు జరిగినా, యూనియన్ల స్పందన మేరకే వీరి రియా క్షన్ ఉంటుంది. యూనియన్ చెబితే లంచ్ టైములో

నినాదాలిస్తారు. అంతే, వారి సామాజిక స్పృహ అంత మేరకే.

అయినా సరే, అందరూ అలా ఉంటారని లేదు. చాలామంది బ్యాంకు అభ్యున్నతి కోసం కృషి చేసే వారు కూడా ఉంటారు. కానీ, వారు రిస్క్ తీసుకో లేరు. అందుకే చూసీ చూడనట్టు పోతుంటారు.

నేను అలా కాకుండా ఏ సెక్షన్‌లో పని చేస్తే ఆ సెక్షన్‌లో తరతరాలుగా జరుగుతున్న అవినీతి భాగో తాలన్నీ బయటపెట్టేవాణ్ణి. సబ్ స్టాఫ్ నుండి మేనే జర్ వరకూ ఎవరికి ఎంత దొరికితే అంత వాళ్ళు బ్యాంకును దోచుకుంటున్న విషయాన్ని ఋజువు లతో సహా బయటపెట్టే వాణ్ణి. ఆటో ఛార్జీల దగ్గర నుంచీ, ఫోటోకాపీలు, వాటర్ బిల్లులు, పేపర్ బిల్లులు, స్టేషనరీ, ఫర్నీచర్, ప్రెమిసెస్ లీజులు, ట్రావెల్ బిల్లులు ఒక్కటనేమిటి ప్రతీ అంశంలోనూ మోసాలే. పైకి మాత్రం అందరూ నీతిమంతులే. పందికొక్కు ల్లాగా బ్యాంకును దోచుకుంటున్నారు. మనసు పెట్టి పది నిమిషాలు అకౌంట్స్ చెక్ చేస్తేనే ఈ విషయా లన్నీ బయటపడ్డాయి. ఇంకా లోతుగా ఆడిటింగ్ చేస్తే అసలు బండారాన్నంతా బయటకు లాగొచ్చు. నేను ఆ ప్రయత్నంలో ఉండగానే నన్ను కూడా ఆ ఛండాలంలోకి లాగాలని చూశారు. నేను 'ఛస్తే అట్లాంటి పని చేయన'న్నాను. నేను వాళ్ళ అవినీతి కార్యక్రమాన్ని బయటపెడతానేమోననీ, హెడ్డాఫీసుకు రహస్యంగా రిపోర్టు చేస్తానేమోననీ వణికి చచ్చేవాళ్ళు ఆ సెక్షన్ నుంచి నన్ను తప్పించే ప్రయత్నాలు చేసే వారు.

నన్ను అసలు హైదరాబాదులో లేకుండా నార్త్ ఇండియాకు బదిలీ చేయించే ప్రయత్నాలు చేశారు. కానీ, నాకు ఛైర్మన్ అండ ఉండడంతో పాటు నేను పెట్టిన పోలీసు కేసు, హెడ్డాఫీసు విజిలెన్స్ కేసులు విచారణ దశలో ఉండడంతో నా ట్రాన్స్‌ఫర్ కుదరదని హెడ్డాఫీసు నుండి స్పష్టమైన ఆదేశాలు వచ్చాయి.

నేను బ్యాంకింగ్ రంగంలో వివిధ డిపార్టుమెంటుల్లో జరిగే ఎన్నో మోసాలను, కళ్ళు బైర్లు కమ్మే వాస్తవా లను బయటపెడుతుంటే దోషుల గుండెల్లో రైళ్ళు పరుగెత్తసాగాయి. ఎంత దాచినా ఈ నిజాలు బ్యాంకులోని ఉద్యోగులకు, ఆఫీసర్లకు తెలిసిపోతు న్నాయి. దాంతో నాకు అజ్ఞాత అభిమానులు పెరగ సాగారు.

నన్ను డెవలప్‌మెంటు సెక్షన్ నుండి అగ్రికల్చర్ డిపార్టుమెంటుకు మార్చారు. డెవలప్‌మెంటు సెక్షన్ వాళ్ళు ఊపిరి పీల్చుకున్నారు.

అగ్రికల్చర్ డిపార్టుమెంటులో నేను వ్యవసాయ ఋణాల కుంభకోణం బయటపెట్టాను. ఈ లోన్లు పేద రైతులకు కేంద్ర ప్రభుత్వం ఇచ్చే సబ్సిడీతో కలిసి ఉంటాయి. ప్రియారిటీ సెక్టార్ కింద తక్కువ వడ్డీ రేటు ఉంటుంది. వీటిని బ్యాంకు ఫీల్డ్ ఆఫీసర్లూ, మేనేజర్లూ, లోకల్ రాజకీయ నాయకులూ కలిసి స్వాహా చేస్తుంటారు.

అసలు రైతులే ఉండరు. పొలాలు ఉండవు. బావు లుండవు. వాటికి మోటార్లుండవు. కానీ, ఆ రైతుల పేర్ల మీద లక్షలు లక్షలు అప్పులు మాత్రం ఉంటాయి.

అయితే బ్యాంకింగ్ వ్యవస్థలో ఇదంతా ఒక పార్శ్వం మాత్రమే. కొంత శాతం ఉద్యోగులకు మాత్రమే పరిమితమైన అవినీతి. అధిక శాతం ఉద్యోగులు, ఆఫీసర్లు హరిశ్చంద్రుడంతటి నిజాయితీతో పని చేస్తారు. అసలు వాళ్ళు చేసే పనిలో అవినీతికి ఆస్కారమే ఉండదు. కౌంటర్లోకి వచ్చిన కస్టమర్ చెక్ ఇస్తే దాన్ని ప్రాసెస్ చేయాల్సిందే. పది రూపాయ లిస్తే పాస్ చేస్తామనే అవకాశమే లేదు. కాకపోతే కొంచెం విసుక్కుంటారు. ఒక్క నిమిషంలో చేసే పనిని, కోపమొస్తే, ఐదు నిమిషాల్లో చేస్తారు. కస్ట మర్ మీద అప్పుడప్పుడు అరిచి తమ ఈగోను శాటిస్‌ఫై చేసుకుంటారు తప్ప లంచం అడగరు.

నా వల్ల మొత్తం వ్యవసాయ రంగానికిచ్చే ఋణాల పంపిణీ ఆగిపోయే ప్రమాదముందని వారంరోజు ల్లోనే నన్ను అగ్రికల్చర్ డిపార్ట్‌మెంట్ నుండి 'క్లియ రింగ్' డిపార్టుమెంటుకు మార్చారు. అది ఎందుకూ పనికిరాని డిపార్టుమెంటు కాబట్టి అక్కడ నా వల్ల ఎవరికీ ప్రమాదముండదని భావించారు.

***

ఆ రోజు రాత్రి బ్యాంకు నుండి ఆటోలో నా రూముకు వెళుతూ భోజనం చేద్దామని రూముకు సమీపంలో ఉన్న హోటల్ దగ్గర దిగాను.

రోడ్డు మీద నుండి హోటల్లోకి నడుస్తుండగానే ఇద్దరు వ్యక్తులు హాకీ స్టిక్స్‌తో నా మీద పడ్డారు. నేను ఒక్క క్షణం నిర్ఘాంతపోయినా, మరుక్షణంలో తేరు కుని, ఇంపల్సివ్ రియాక్షన్ మొదలయి, ముందుగా అక్కణ్ణుంచి పరుగెత్తాను. వాళ్ళు నా వెంటబడ్డారు. నేను ఆగకుండా పరిగెడుతూనే నన్ను రక్షించుకోవ డానికి ఏదైనా కర్ర గానీ, రాడ్ గానీ దొరుకుతుందా అని చుట్టూ పరీక్షించ సాగాను. రెండు గజాల దూరంలో ATM దగ్గర సెక్యూరిటీ గార్డ్ ఉన్నాడు. అతని చేతిలో లాఠీ ఉంది. అతని దగ్గరకు పరిగెత్తి చెయ్యి చాచగానే అతను పరిస్థితి గమనించి లాఠీ

**బ్యాంకులో అతనిమీద అప్రకటిత యుద్ధం కొనసాగుతూ ఉంది. ఎక్కడ దొరికితే అక్కడ అణగదొక్కేయాలని చూస్తున్నారు. అందుకే అతను పనివిషయంలో చాలా కచ్చితంగా ఉంటున్నాడు. దాంతో అతన్ని ఏ సీటులోనూ పర్మినెంటుగా ఉంచకుండా సెక్షన్లు మారుస్తున్నారు. అయినా అతను బెదరలేదు. కంగారుపడలేదు. నాకే సమస్యా లేదనుకున్నాడు. మరి ఎవరికి సమస్య?**

నా చేతిలో పెట్టాడు.

నా మీద దండయాత్ర చేస్తున్న వాళ్ళను చూసి అక్కడున్న ప్రజలు 'ఏయ్! ఏయ్!' అంటూ అరవసా గారు. అది నాలుగు రోడ్ల కూడలి కావడంతో ట్రాఫిక్ అంతా ఒక్క క్షణం స్తంభించి పోయింది. అటాకర్స్ ఒక్క క్షణం కొంచెం కంగారు పడ్డారు.

ఆ ఒక్క క్షణంలోనే నేను లాఠీతో వాళ్ళ మీదికి దూకాను. వాళ్ళిద్దరూ కలిసి కొడుతున్న దెబ్బలను తప్పించుకుంటూనే నేనూ వాళ్ళను తోమి తోమి వదిలి పెట్టాను. కానీ, వాళ్ళ తలలకు హెల్మెట్స్ ఉండ డంతో వాళ్ళ కంటే నాకే ఎక్కువ దెబ్బలు తాకాయి. తల పగిలి నెత్తురు కారసాగింది. ఇంతలో ఎవరో ఫోన్ చేసినట్టుంది. పోలీస్ పెట్రోలింగ్ వ్యాన్ వచ్చింది. అది గమనించిన దుండగులు పారిపోయారు.

పోలీసులు 108కు ఫోన్ చేసి పిలిపించి దగ్గర్లో ఉన్న కార్పొరేట్ హాస్పిటలుకు నన్ను తరలించారు.

"ఎవరికైనా బంధువులకు లేదా స్నేహితులకు ఫోన్ చేయండి. ఫాం మీద సంతకం చేయాలి!" అన్నారు నన్ను వెంటనే అడ్మిట్ చేసుకుంటూ.

నాకు ఆ ఊళ్ళో తెలిసిన వాళ్ళూ, నేను ఆపదలో ఉన్నప్పుడు ఆదుకునే వాళ్ళూ... ఎవరా అని ఆలోచి స్తుండగానే నాకు స్పృహ తప్పింది.

***

నాకు స్పృహ వచ్చేసరికి అర్ధరాత్రి అయింది. తలకు కట్టు కట్టారు. తల పగిలి పోతుందన్నంతగా పోట్లు రావడం ప్రారంభమయింది. ఒళ్ళంతా పచ్చి పుండులా సలుపుతోంది.

కళ్ళు తెరచి చూస్తే నేను ఐసీయూలో ఉన్న ట్టుగా అర్థమైంది. చిన్న బెడ్ లైటు వెలుగుతోంది. నా మంచం పక్కన స్టూల్ మీద కూర్చుని మంచం మీద రెండు చేతులు పెట్టుకుని ఎవరో పడుకుని ఉన్నారు. ఆ వ్యక్తి ఎవరో ఆ చీకట్లో అర్థం కాలేదు.

నేను కొంచెం లేచి కూర్చుందామని ప్రయత్నిం చాను. కానీ, తలలో ఏదో కలుక్కుమంది. నేను బాధతో గట్టిగా మూలిగాను.

నా మూలుగు విని, ఆ వ్యక్తి 'ఎన్నా!' అంటూ చటుక్కున లేచి లైటు వేసింది.

అంత బాధలోనూ ఆ గొంతు విని నాకు నవ్వొ చ్చింది.

రాగిణి.

రాగిణి నా కోసం హాస్పిటలుకు వచ్చిందన్న ఊహే ఎంతో మధురంగా ఉంది.

నన్ను చూసి, "ఏమైంది?" అని ప్రశ్నించింది.

నేను తల చూపించి 'నొప్పి' అన్నాను.



"రాత్రి ఎప్పుడైనా లేచి నొప్పి అంటే ఇవ్వమని పెయిన్ కిల్లర్ ఇచ్చారు" అంటూ మెడిసిన్ ట్రే నుండి రెండు టాబ్లెట్స్ ఇచ్చింది.

"నువ్వు.... ఇక్కడా...?" అని ప్రశ్నిస్తుంటే,

"అవన్నీ తరువాత, ముందు టాబ్లెట్ వేసుకుని పడుకో..." అంది చిరుకోపంతో.

నేను టాబ్లెట్లు వేసుకుని,

"ప్లీజ్! చెప్పవా?" అని అడిగాను.

'నేను హాస్పిటల్లో అడ్మిట్ కాగానే స్పృహ తప్పుతూ రాగిణి అని తన పేరే పలికానట. దాంతో వాళ్ళు నా మొబైల్ చెక్ చేసి తనకు ఫోన్ చేస్తే తను వెంటనే వాళ్ళ తమ్ముడితో కలిసి వచ్చిందట. నాకు పెద్దగా గాయాలేం లేవనీ, స్కానింగ్ చేస్తే అన్నీ ఎక్స్‌టర్నల్ ఇంజ్యూరీసేనని తెలిసిందనీ, తెల్లవారగానే డిశ్చార్జ్ కావొచ్చని' టకటకా చెప్పింది రాగిణి.

నేను కాస్త తలతిప్పి చూస్తే వాళ్ళ తమ్ముడు పక్కనే బెడ్ మీద పడుకుని ఉన్నాడు.

నాకు కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. దెబ్బల నొప్పి వల్ల కాదు. ఒకమ్మాయి అర్ధరాత్రి నా కోసం, స్టూల్ మీద కూర్చుని, హాస్పిటల్ మంచం మీద చేతులు పెట్టుకుని ఉన్న దృశ్యాన్ని ఊహించుకుంటే నా గుండెల్లో బాధ సుడులుగా తిరిగింది.

నాలోని అంతర్మథనాన్ని గమనించి, రాగిణి నా పక్కగా వచ్చి నిలబడి నా తలమీద చెయ్యి వేసింది. నేను తల పైకి ఎత్తి చూడలేను కాబట్టి తను కూడా ఏడుస్తోందని నా చేతిని పట్టుకున్న మరో చెయ్యిలో కలుగుతున్న ప్రకంపనలను బట్టి తెలుసుకోగలిగాను.

ఐదు నిమిషాల తర్వాత రాగిణిని ఇంటికి వెళ్ళమని చెప్పాను. కానీ, తను అందుకు ఒప్పుకోలేదు. తెల్లవారాక డిశ్చార్జ్ చేయించి నా రూములో దించి వెళ్ళిపోయింది. రెండు రోజుల కోసం లీవ్ అప్లై చేశాను. తను నా దగ్గరకు హాస్పిటలుకు వచ్చిన విషయం రహస్యంగానే ఉంచుదామని ఇద్దరమూ నిర్ణయించుకున్నాము.

రెండు రోజుల తరువాత నేను మా జోనల్ ఆఫీసుకు అటాచ్ అయి ఉన్న బ్రాంచిలో 'క్లియరింగ్ సెక్షన్'లో జాయినయ్యాను. నేను ఇక బ్యాంకుకే రాననుకున్న వాళ్ళు మూడోరోజే రావడం చూసి ముక్కు మీద వేలేసుకున్నారు.

నా మీద, అటాక్ జరిగిన విషయం బ్యాంకులో ఎవరికీ చెప్పలేదు. వారి కుహనా సానుభూతి వచనాలు వినే ఓపిక నాకు లేదు. రెండు రోజుల క్రిందటే, నా మీద దాడి చేసిన రౌడీలను అదేరోజు రాత్రే, పట్టుకున్నారు. వాళ్ళకు ఎవరో 'సుపారీ' ఇచ్చారనీ, పేర్లు తెలియదనీ చెప్పారు. కానీ, నా మీద 'సుపారీ' ఇచ్చేంత శత్రుత్వం ఎవరికుందో నాకు బాగా తెలుసు. మూడు యూనియన్లలో ఒక యూనియన్ లీడర్లకు ఇట్లాంటి క్రిమినల్ రికార్డు ఉంది. వాళ్ళే దీని వెనకాల కూడా ఉండి ఉంటారు. నా వల్ల ఇంతకు ముందే నష్టపోయిన వాళ్ళా? లేక భవిష్యత్తులో నష్టపోయే వాళ్ళా? అన్నది మాత్రమే తేలాల్సి ఉంది. నేను పోలీసులకు అదే చెప్పాను. వాళ్ళు నా మీద హత్యాయత్నం జరిగినట్టుగా రిపోర్ట్ రాసుకుని వెళ్ళారు.

నా మీద ఆ దాడి చేయించి వాళ్ళు ఎంత పొరపాటు చేశారో వారికి తరువాత్తరువాత తెలిసింది.

****

"ఏ మాత్రం మోసాలకు, అవినీతికి చోటుండదని భావించిన 'క్లియరింగ్ డిపార్టుమెంటు'లో జరిగే మోసాలను చూస్తుంటే నా కళ్ళే బైర్లు కమ్మాయి. చూస్తుంటే అసలు బ్యాంకుల్లో మోసం జరగని విభాగమేదైనా ఉందా అనే అనుమానమొచ్చింది నాకు.

బ్యాంకుల్లో కౌంటర్ల మీదుగా ఎన్ని లావాదేవీలు జరుగుతాయో అంతకు అనేక రెట్లు 'క్లియరింగ్' ద్వారా జరుగుతాయి.

అంటే, ఉదాహరణకు 'స్వామి' అనే అతనికి 'రాజు' అనేవాడు పదివేల రూపాయలకు తన బ్యాంక్ అంటే 'సూర్య' అనే బ్యాంక్ చెక్ క్రాస్ చేసి ఇస్తాడు. క్రాస్ చేశాడు కాబట్టి అది బ్యాంకు ద్వారానే 'స్వామి' అకౌంట్‌లో జమ కావాలి. నేరుగా వెళ్ళి 'సూర్య' బ్యాంకులో కౌంటర్ మీద క్యాష్ తీసుకోవడానికి వీలుండదు. అందుకని 'స్వామి' ఆ చెక్కును తన

## లాకర్ నెం.369
### కూపన్ నెం.4 విజేత
**పప్పు శ్రీదేవి**
**అమలాపురం**

ఈవారం లాకర్ నెం. 369 చదివారు కదా!
మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి
కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!

## లాకర్ నెం. 369-6 (2-8-2017)

మా ప్రశ్న: ఉత్తరంలోని రాత నమూనాలను సేకరించి ఏ ల్యాబ్‌కు పంపించాడు ఆ అధికారి?

మీ జవాబు----------------------------------------------------------------

చిరునామా----------------------------------------------------------------

-------------------------------------------------------------------------

----------------------------------పిన్----------------------ఫోన్‌నెం.----------------------------

ఈ కూపన్‌ను 1 ఆగస్టు 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.

మా చిరునామా: నవ్య వీక్లి, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33

బ్యాంకు అంటే 'చంద్ర' బ్యాంకులో ఉన్న తన అకౌంటులో జమ చేస్తాడు. రెండు మూడు రోజుల తర్వాత బ్యాంకుకు వెళ్ళి, ఆ డబ్బులను అంటే పదివేలను విత్‌డ్రా చేసుకుంటాడు.

ఇంత వరకే సామాన్య ప్రజలకు తెలిసిన వ్యవహారం.

కానీ, ఒక బ్యాంకులోని డబ్బులు మరో బ్యాంకులోకి బదిలీ కావడం వెనుక పెద్ద తతంగమే జరుగుతుంది. ఈ వ్యవహారాన్ని పర్యవేక్షించేదే 'క్లియరింగ్' డిపార్ట్‌మెంట్. అంటే నేను పనిచేసే డిపార్ట్‌మెంట్.

ఇది ఎలా జరుగుతుందంటే, 'స్వామి' బ్యాంకు అయిన 'చంద్ర' బ్యాంకు; 'రాజు' బ్యాంకు అయిన 'సూర్య' బ్యాంకులకు 'ఇంద్ర' అనే పెద్ద బ్యాంకులో ఖాతాలు ఉంటాయి. 'స్వామి' జమ చేసిన చెక్కును 'చంద్ర' బ్యాంకు వాళ్ళు తీసుకెళ్ళి 'ఇంద్ర' బ్యాంకులో ఇస్తారు. 'ఇంద్ర' బ్యాంకు ఆ పదివేల రూపాయలను తన దగ్గరున్న 'సూర్య' బ్యాంకు ఖాతాలో డెబిట్ చేసి 'చంద్ర' బ్యాంకు ఖాతాకు జమ చేస్తుంది. చేసినట్లుగా ఒక మెమో ఇస్తుంది. ఆ మెమో రాగానే 'చంద్ర' బ్యాంకు 'స్వామి' ఖాతాలో పదివేలు జమ చేస్తుంది.




అతను డబ్బులు డ్రా చేసుకుంటాడు. ఒకవేళ చెక్ ఇచ్చిన 'రాజు' అకౌంటులో పదివేల రూపాయల బ్యాలెన్స్ లేకపోతే చెక్కును తిరిగి పంపిస్తుంది 'సూర్య' బ్యాంకు. అప్పుడు చెక్ బౌన్స్ అయి 'స్వామి' ఖాతాలో డబ్బులు జమ కావు.

ఇదంతా వినడానికి కన్ఫ్యూజింగ్‌గానే ఉన్నా బ్యాంకు లావాదేవీలు జరిపే వ్యాపారస్థులకు, రెగ్యులర్ కస్టమర్లకు కరతలామలకమే.

ఇక్కడే మోసగాళ్ళు ప్రవేశిస్తారు.

పై ఉదాహరణలోని బ్యాంకు పేర్లనే వాడుకుంటే 'రాజు' వంద రూపాయలు కట్టి 'సూర్య' బ్యాంకులో ఖాతా ఓపెన్ చేస్తాడు. చెక్ బుక్ తీసుకుంటాడు. అతని అకౌంటులో వంద రూపాయలు బ్యాలెన్స్ మాత్రమే ఉన్నా రెండు లక్షలకు చెక్ రాసి 'స్వామి'కి ఇస్తాడు. 'స్వామి' ఆ చెక్కును తన 'చంద్ర' బ్యాంకులో డిపాజిట్ చేస్తాడు. మూడు నాలుగు రోజుల తర్వాత వచ్చి రెండు లక్షలు డ్రా చేసుకుంటాడు 'స్వామి'..." నన్ను ఆపి,

"ఇది ఎలా సాధ్యం?" అని నా ఎదురుగా ఉన్న పోలీస్ అధికారి అడిగాడు.

ఈ సారి నేను నా పరిశోధన వివరాలను డైరెక్టుగా 'లా'లో నా క్లాస్‌మేట్, ప్రస్తుతం ఐపీయస్ పాసయి ట్రైనింగ్ అవుతున్న నా ఫ్రెండు దగ్గరకు తీసుకెళ్ళాను. వాడు నన్ను ఒక డీయస్పీకి పరిచయం చేశాడు. ఈ మోసం గురించి ఆయనకు చెబితే అంతా విని ఆయన నన్ను అలా ప్రశ్నించాడు.

"ఇక్కడ రాజు, స్వామి, కొంతమంది కన్సర్న్ బ్యాంక్ అధికారులు, ఉద్యోగులు, సబ్ స్టాఫ్ అందరూ కుమ్మక్కయి ఈ మోసానికి తెర లేపారు. 'స్వామి' జమ చేసిన చెక్కును 'చంద్ర' బ్యాంకు వాళ్ళు అసలు 'క్లియరింగ్' వరకూ రానివ్వరు. 'ఇంద్ర' బ్యాంకుకు పంపరు. ఒకవేళ 'క్లియరింగ్'లో పంపించి అక్కడ బౌన్స్ అయినా ఆ మెమోలను మాయం చేసి, ఆ చెక్ పాసయినట్టుగా దొంగ మెమోలను సృష్టించి రికార్డుల్లో పెడతారు. అంటే 'సూర్య' బ్యాంకు నుండి చెక్ వాపసు రాలేదు కాబట్టి, ఆ చెక్ జెన్యూనే అని భావించి, 'స్వామి' అకౌంట్లో రెండు లక్షలు జమ చేసేస్తారు. 'స్వామి' వచ్చి రైట్ రాయల్‌గా డబ్బులు డ్రా చేసుకుంటాడు. ఆ ట్రాన్సాక్షన్ జరిగినప్పుడు అన్ని సీట్లలో అంటే క్యాష్ కౌంటర్లో, చెక్ పాస్ చేసే చోట, సబ్ స్టాఫ్ అందరూ ఎవరి స్థానాల్లో వారుంటారు. డబ్బులు డ్రా చేసి 'స్వామి' వెళ్ళగానే అందరూ ఊపిరి పీల్చుకుంటారు. ఎవరి కష్టానికి తగ్గట్టుగా వాటాలు వేసుకుని వాళ్ళు పంచుకుంటారు.

ఇంతటితో అయిపోలేదు. ఈ కుట్ర వెనకాల ఒక మాస్టర్ మైండ్ పనిచేస్తూ ఉంటుంది. అది తరువాత జరిగే పరిణామాలను నిశితంగా గమనిస్తూ ఉంటుంది.

ఎందుకంటే, ఈ లావాదేవీలో 'సూర్య' బ్యాంకు ఇష్యూ చేసిన చెక్ ఆధారంగానే ఈ మోసం జరిగింది. కానీ, అసలు 'సూర్య' బ్యాంకు అకౌంట్లో 'రాజు'కు బ్యాలెన్స్ లేనప్పుడు, అది బౌన్స్ కావాల్సిందే. అంటే, 'సూర్య' బ్యాంకు నుండి 'చంద్ర' బ్యాంకుకు డబ్బులు బదిలీ కాలేదు. కానీ, అయినట్టుగా రికార్డులు సృష్టించినంత మాత్రాన 'ఇంద్ర' బ్యాంకులో ట్రాన్సాక్షన్ ఫెయిలవుతుంది. 'ఇంద్ర' బ్యాంకులో జమ కాకపోవడంతో అంత మేరకు 'చంద్ర' బ్యాంకు ఫండ్స్‌లో లోటు కనపడుతూనే ఉంటుంది. మూడు బ్యాంకుల అకౌంట్లు ప్రతీ రోజు ట్యాలీ చేస్తారు. అక్కడ దొంగతనం బయటపడే ప్రమాదం ఉంది కాబట్టి, ఇక్కడే రికన్సీలియేషన్ ఆఫీసర్ రంగంలోకి దిగుతాడు. అతడు మనోడే కాబట్టి 'ఇంద్ర' బ్యాంకు రికార్డులన్నీ తారుమారు చేసేస్తాడు. అసలు రిపోర్టులను తొక్కిపట్టి దొంగ రికార్డులను సృష్టిస్తాడు" అని నేను చెప్పేసరికి,

"సార్! బుర్ర వేడెక్కి పోయింది సార్!" అన్నాడు డీయస్పీ.

పది నిమిషాల విరామం తర్వాత,

అట్లాంటి పోస్టులోకి నన్ను ఇంఛార్జ్‌గా వేశారు. నేను రెండు రోజుల్లోనే జరుగుతున్న తతంగమంతా గమనించాను. ఇటువంటి మోసాలు రెగ్యులర్‌గా జరగవు. ఎంతో శ్రద్ధగా పరిశీలిస్తున్నప్పుడు ఏ మోసమూ జరగదు. మనం అప్రమత్తంగా లేని క్షణంలో ఏదో ఒక చెక్ పాస్ అయిపోతుంది. అలా కొన్ని లక్షల, కోట్ల రూపాయలు గుటకాయ స్వాహా చేస్తున్నారు. ఇది ఎప్పటికైనా బయటపడే దొంగతనమే. ఈ విషయం వాళ్ళకూ తెలుసు. అయినా, వాళ్ళకు ఇంత మొండి ధైర్యం ఎక్కడి నుంచి వచ్చిందో అర్థం కావడం లేదు.

నాకు ఈ కుట్ర స్వరూపం పూర్తిగా అవగాహన కాగానే జోనల్ మేనేజర్ దగ్గరకు అపాయింట్‌మెంట్ కోసం వెళ్ళాను. ఆయన అపాయింట్‌మెంట్స్ రాగిణే చూస్తుంది. రెండు రోజులు జోనల్ ఆఫీస్ చుట్టూ తిరిగినా జోనల్ మేనేజర్ అపాయింట్‌మెంట్ ఇవ్వలేదు. అందుకే, ఆలస్యమైన కొద్దీ నా పైన కూడా బురద చల్లే కార్యక్రమం మొదలవుతుందేమోనని చెప్పి" మా ఫ్రెండు అయిన ఐపీయస్ ట్రైనీ దగ్గరకు వచ్చానని, ఆ డీయస్పీకి చెప్పాను.

డీయస్పీ బుర్ర గోక్కుంటూ,

"సార్! ఇందులో ఫ్రాడ్ జరుగుతున్నట్టే కనిపిస్తోంది. కానీ, మాకై మేము, స్యూమోటోగా కేసు రిజిస్టర్ చేయలేము. మీ బ్రాంచ్ మేనేజర్ గానీ, మీ జోనల్ మేనేజర్ గానీ అఫీషియల్‌గా కంప్లయింట్ ఇస్తే, మనం కేసు  చేయొచ్చు. లేదా పేపర్లలో, ప్రెస్‌లో పెద్ద స్కాండల్ అయితే మేము జోక్యం చేసుకోవచ్చు. నాకు రెండు రోజులు టైం ఇవ్వండి. ఫర్దర్ కోర్స్ ఆఫ్ యాక్షన్ నిర్ణయిద్దాం. ఈ లోపల డాక్యుమెంట్స్ ఒక సెట్ నా దగ్గర ఉంచండి. మనిద్దరి మధ్య జరిగిన సంభాషణ రహస్యంగా, అంటే మూడో కంటికి కూడా, నాటీవెన్ టు రాగిణి, తెలియకూడదు." అన్నాడు.

రాగిణి విషయం ఆయనకెలా తెలిసిందో నాకు అర్థం కాలేదు. నేను ప్రశ్నార్థకంగా చూస్తుంటే, ముసిముసి నవ్వులు నవ్వాడు.

"హైదరాబాద్ పోలీస్ సార్! తక్కువ అంచనా వేయకండి! మొన్న మీ ఫ్రెండ్ గారు చెప్పినప్పటి నుంచీ మేం కూడా మీ మీద ఓ కన్ను వేసి ఉంచాం" అన్నాడు.

"ఎట్టి పరిస్థితుల్లోనూ, మీరు మమ్మల్ని కలిసిన విషయమూ, మీ దగ్గర ఉన్న ఇన్ఫర్మేషనూ లీక్ కానివ్వకండి. మీ జెడ్‌యంను కలిసే ప్రయత్నాలు మానకండి. బట్ అబ్సల్యూట్ కాన్ఫిడెన్షియల్. మీ మీద దాడి జరిగిన సంఘటనకీ, ఈ విషయానికీ లింక్ ఉండవచ్చు" అన్నాడు.

అప్పటికి అర్థరాత్రి అయింది. మఫ్టీ డ్రెస్సుల్లో ఉన్న పోలీసులు నన్ను అన్ ఐడెంటిఫైడ్ కారులో తీసుకొచ్చి నా రూము దగ్గరగా వదిలి వెళ్ళారు.

**(ఇంకా వుంది)**

# సైనసైటిస్‌కు హోమియో చికిత్స

సైనసైటిస్...ఈపదం వర్షాకాలం, శీతాకాలంలో ఎక్కువగా వింటాం.సైనసైటిస్‌వస్తే ఆపరేషన్ తప్పని సరి, ఆ తరువాత కూడా మళ్ళీ వచ్చి దీర్ఘకాలికంగా బాధిస్తుంటుందని సైనసైటిస్ బాధితులు చెబుతుంటారు. అయితే సైనసైటిస్‌కు హోమియోపతిలో అద్భుతమైన చికిత్స ఉందని, శాశ్వత నివారణ పొందవచ్చని చెబుతున్నారు ప్రముఖ హోమియోవైద్యులు డాక్టర్ మురళీఅంకిరెడ్డి.

ప్రపంచవ్యాప్తంగా సైనసైటిస్‌బాధితుల సంఖ్య రోజు రోజుకూ పెరుగుతోంది. ఒక్క అమెరికాలోనే 2.4కోట్లకు పైగా సైనసైటిస్ బాధితులున్నారని అధ్యయనాలు చెబుతున్నాయి. ఇక.. సైనసైటిస్ విషయానికి వస్తే ఇది 3 విభాగాలుగా ఉంటుంది.

1. **అక్యూట్** : వచ్చి ఒకవారం రోజులు ఉంటుంది.

2. **సబ్ అక్యూట్** : 4నుంచి 8వారాలు ఉంటుంది.

3. **క్రానిక్** : ఇది దీర్ఘకాలిక సైనసైటిస్. 8-10 వారాలపైన ఉంటుంది. సైనసైటిస్ ఇన్ఫెక్షన్, వైరస్, బ్యాక్టీరియా వల్ల వస్తుంది. ముఖ్యంగా స్ట్రెప్టోకోకస్ న్యుమోనియా, ఇన్‌ఫ్లూయెన్‌జా వల్ల వస్తుంది. ప్రతి మనిషి తన జీవిత కాలంలో సైనసైటిస్ బారిన పడటానికి 90% అవకాశాలున్నాయి. అత్యధికంగా వెళ్ళే సర్జికల్ ప్రాసెస్‌లో ఈ సైనసైటిస్ కూడా ఒకటని ఒక పరిశోధనలో తేలింది. సుమారు 2 లక్షల కేసులు సర్జరీకి దారితీస్తాయి. ఏదెలా ఉన్నా సైనసైటిస్‌కు హోమియోలో అద్భుత చికిత్స ఉంది. పూర్తిగా మందుల ద్వారా నివారించడమే కాకుండా, వ్యాధి నిరోధక శక్తిని పెంచి మళ్ళీ మళ్లీ రాకుండా నివారించవచ్చు. ముఖంలో కళ్లదగ్గర, ముక్కు పక్క భాగంలో, ఎముకలు ఉండే సన్నని గాలితో నిండే ప్రదేశాన్ని సైనస్ అంటారు. ఈ భాగం ఇన్‌ఫెక్షన్లతో వాచిపోవడమే సైనసైటిస్. రకాలు: 1. ఫ్రంటల్ 2. పారా నాసల్ 3. ఎత్మాయిడల్ 4. మాగ్జిలరీ 5. స్ఫినాయిడల్ ఇవి కూడి, ఎడమగా రెండు జతలుంటాయి.

**కారణాలు:** ఇన్‌ఫెక్షన్, బ్యాక్టీరియా, వైరస్, ఫంగస్, ఉపరితల శ్వాసకోశవ్యాధులు, ముక్కులోదుర్వాసన, ముక్కులో దుర్మాంసం పెరుగుదల, అలర్జీ, పొగ, విష వాయువుల కాలుష్యం, వాతావరణ కాలుష్యం, అకస్మాత్తుగా వాతావరణ మార్పులు, చలికాలం, వర్షాకాలం, గాలిలో తేమ ఎక్కువగాఉండే సమయం. నీటిలో ఈదటంవల్ల, జలుబు, గొంతునొప్పి, పిప్పిపన్ను, టాన్సిల్స్ వాపు, రోగనిరోధక శక్తి తగ్గిపోవటం.

**లక్షణాలు:** ముఖంలో భారంగా ఉంటుంది. తలనొప్పి బరువు, ముఖంలోవాపు, సైనస్‌భాగంలో నొప్పి, ముక్కు దిబ్బడ, ముక్కుదురద, నీరుకారడం, గొంతులోనికి ద్రవంకారడం, గొంతుగరగర, దగ్గు,జలుబు, చెవిలో చీము, కోపం, మానసిక స్థైర్యం కోల్పోవడం. అలసట, విసుగు, పనిపై ఆసక్తి తగ్గటం, హోరు దగ్గు.

**నిర్ధారణ:** ఎక్స్‌రే, సిటీస్కాన్, సైనస్‌భాగంలో నొక్కినపుడు నొప్పి కలిగితే కూడా సైనసైటిస్‌ను నిర్ధారించవచ్చు.

**దుష్పరిణామాలు:** దీర్ఘకాలికంగా సైనసైటిస్ వ్యాధితో బాధపడేవారు కనురెప్పల వాపు, కనుగుడ్లు పక్కకు జరిగినట్లు ఉండటం, కన్నునరం దెబ్బతిన్నపుడు చూపు కోల్పోవడం, వాసనలు తెలియకపోవడం, తరుచూవచ్చే జ్వరం, ఎదుగుదలలోపాలు కలుగుతాయి.

**సైనస్‌ను గుర్తించే ప్రశ్నావళి:** మీరు పది రోజుల కంటే ఎక్కువగా ఈ కింది వాటిలో దేనితోనైన బాధపడుతున్నారా? అయితే మీకు సైనసైటిస్ ఉన్నట్టే. వెంటనే డాక్టర్‌ను సంప్రదించడం మంచిది.

1. ముఖభాగంలో నొప్పి - అవును / కాదు

2. తలనొప్పి - అవును / కాదు

**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**



3. ముక్కుదిబ్బడ - అవును/కాదు 4. చిక్కటి పసుపు, ఆకు పచ్చ ముక్కుస్రావాలు - అవును/కాదు. 5.జ్వరం (99-100 ఫారెనెహీట్స్) - అవును/కాదు. 6. నోటి దుర్వాసన - అవును / కాదు.. 7. పంటినొప్పి - అవును /కాదు.

**నివారణ:** మీ నోటిని తరుచూ గోరు వెచ్చని నీటితో శుభ్రం చేస్తూండాలి. అలర్జీకి సంబంధించిన దుమ్ము, ధూళికి దూరంగా ఉండాలి. ఇల్లుపరిశుభ్రంగా ఉంచుకొని చుట్టూ బురద లేకుండా చూసుకోవాలి. ఈత కొలనులో ఎక్కువ సమయం ఉండకూడదు. ఎందుకంటే ఆనీళ్లు ముక్కు లోపలి దళసరిచర్మాన్ని దెబ్బతీస్తాయి. ఎక్కువగా చల్లని పదార్థాలు, చల్లని గాలి తగలకుండా చెవిలో దూది పెట్టుకోవడం, వేడి ఆవిరి పట్టడం వల్ల దీన్ని కొంత వరకు నివారించవచ్చు.

**హోమియోచికిత్స:** హోమియోపతిలో అపరేషన్‌లేకుండా మంచి మందులున్నాయి. వాటిలో ముఖ్యంగా కాలిబైక్, కాలిసల్ఫ్, హెపార్‌సల్ఫ్, మెర్క్‌సాల్, సాంగ్న్యూలియా, లెమ్‌నార్‌మైనార్, స్పైజిలియా వంటి మందులు మంచి ఫలితాన్నిస్తాయి.

**www.starhomeopathy.com** | తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక । దుబాయి । లండన్ । మాంచెస్టర్ | ✆ 90300 64224

# సంతానలేమికి ఆధునిక పరిష్కారాలు

**మన దేశంలో ఎంతోమంది దంపతులు సంతానలేమితో బాధపడుతున్నారు. అందుకు పాశ్చాత్య సంస్కృతిలాగా రాత్రీ పగలూ తేడా లేకుండా వృత్తిపనుల్లో బిజీగాఉండటం, సరైన వయసులో పెళ్లిళ్లు కాకపోవడం, మానసిక ఒత్తిడికి లోను కావడం వంటివి హార్మోన్ సంబంధమైన సమస్యల్ని సృష్టిస్తున్నాయి. అయితే ఇదిపరిష్కారం లేని సమస్యలేమి కాదని, సరైన చికిత్స తీసుకుంటే లైంగిక సమస్యలు పరిష్కారం కావడమే కాక, సంతానం కలగడానికి కూడా అవకాశం ఉంటుందనిప్రముఖ వైద్యు రాలు డా॥జ్యోతి. ఫర్టీ 9 హాస్పిటల్‌లోని నిపుణులు దీన్నితేలికగావరిష్కరిస్తున్నారని కూడా ఆమె చెబుతున్నారు.**

చాలామంది స్త్రీలలో నెలసరి సమస్యలున్నా, భర్తకన్నా భార్య వయసు ఎక్కువగాఉన్నా, భార్యాభర్తలిద్దరూ సంతాన నిరోధక పద్ధతులేవీ పాటించకుండా సంవత్సరంకాలం పాటు ప్రయత్నించినాగర్భధారణకాకపోవచ్చు.మరికొంత మందిలోసంవత్సర కాలందాటినా అంటే, ఏళ్ళు గడుస్తున్నా గర్భధారణ కాకపోవచ్చు. **స్త్రీలు మాత్రమే బాధ్యులా?:** సంతానలేమితో బాధపడుతు న్నారంటే స్త్రీలలోనేలోపం ఉండవచ్చనే అపోహ చాలా మందిలో ఉంటుంది. కానీ సంతానలేమికి అసలుకారణం స్త్రీపురుషులిద్దరూ కావచ్చు. దంపతుల్లో ఒకరికి లేదా ఇద్దరికీ లోపం ఉన్నా గర్భధారణ కలుగకపోవచ్చు. పురుషులలో వీర్యకణాల ఉత్పత్తిలో లోపం ఉన్నా సంతానలేమికి దారి తీయవచ్చు. అదే స్త్రీలలో అయితే హార్మోను లోపం, థైరాయిడ్, పి.సి.ఒ.డి... ఇలా కొన్నిరకాల కారణాలుండవచ్చు. సాధారణంగా దంపతు లిద్దరూ ఏ విధమైన గర్భనిరోధక విధానాలూ పాటించ కుండా దాంపత్య జీవితం గడిపితే 5నెలల లోపే 50% మందికి గర్భం వస్తుంది. ఏడాది లోపు 75% మందికి గర్భం వస్తుంది. 2 సంవత్సరాల లోపు 90% మందికి గర్భం వస్తుంది. ఎవరికైనా ఇంతకాలం గడిచినా గర్భం రాలేదంటే ఏదో సమస్య ఉందనే భావించాలి. సమస్యను తెలుసుకోవాలని స్త్రీలుముందుకొచ్చి వైద్యపరీక్షలు చేయించుకుంటున్నా, పురుషులు మాత్రం అందుకు సిద్ధంగా ఉండటం చాలాతక్కువ. **ఆకృతి కోల్పోయినా...** మన జీవన శైలితో పాటు కాలుష్యం, వాతావరణం, పొగతాగటం, మద్యం సేవించటం, బిగుతు దుస్తులు ధరించటం, అధిక బరువులు మోయటం, మానసిక ఒత్తిడి, కొన్ని రకాల మందులు ఆరోగ్యకరమైన వీర్యం ఉత్పత్తిపై ప్రభావం చూపడం వల్ల పురుషులలో శుక్రకణాల సంఖ్య తగినంత లేకపోవడం, ఒకవేళ ఉన్నా వాటిలో చురుకుదనం లేక పోవటం జరుగుతోంది. వాటి ఆకృతి బాగా లేకపోయినా కష్టమే. కొందరిలో శుక్రకణాలు అసలు ఉండవు. స్త్రీలలో నెలసరి సమస్యలు, అండం విడుదల సరిగా లేకపోవటం లేదా విడుదలైన అండాలు నాణ్యంగా లేకపోవటం ప్రధాన కారణాలు. వయసు పెరిగే కొద్దీ గర్భస్రావాలయ్యే అవకాశాలు ఎక్కువగా ఉంటాయి. 30 సంవత్సరాలు దాటిన స్త్రీలలో సంతానం కలిగే అవకాశాలు తక్కువగా ఉంటాయి. **సరైన పద్ధతులు:** 1. ఐ.యు.ఐ, 2.ఇక్సీ 3.ఐ.వి.ఎఫ్. **ఐ.యు.ఐ:** భర్త నుంచి సేకరించిన వీర్యాన్ని ల్యాబ్‌లో పరీక్షించి దానిలోంచి ఆరోగ్యంగా, చురుగ్గా ఉన్న కణాలను మాత్రం వేరుచేసి సిద్ధం చేస్తారు. వాటిని ఒక సన్నని గొట్టంద్వారా స్త్రీగర్భాశయంలోకి ప్రవేశపెడ తారు. ఇలా ఒక నెలలో చేస్తే 15 % వరకు సంతానం కలిగే అవకాశం ఉంటుంది. ఇలా ఆరు రుతుచక్రాల పాటు ఈ చికిత్సా చేసినా ఫలితం లేకపోతే అప్పుడు ఐ.వి.ఎఫ్ ద్వారా ప్రయత్నించవచ్చు. **ఇక్సీ:** స్త్రీ నుంచి సేకరించిన అండంలోకి పురుషుని శుక్రకణాన్ని ఒక ప్రత్యేకమైన మైక్రో మాన్యులేటర్ సహాయంతో ప్రవేశపెట్టి ఫలదీకరణం చెందిస్తారు. వాటిని తిరిగి గర్భాశయం లోకి ప్రవేశ పెడతారు. ఈ పద్ధతి ద్వారా 40% వరకు విజయం సాధించవచ్చు. శుక్రకణాల సంఖ్య తక్కువగా ఉన్నవారిలో ఇదిమరింత ఉపయోగకరం. **ఐ.వి.ఎఫ్:** దీన్నే టెస్ట్‌ట్యూబ్ బేబి విధానం అంటారు. ముందు స్త్రీ నుంచి పక్వమైన అండాలను బయటకు తీసి పురుషుడి శుక్రకణాలతోబయటేఫలదీకరణంచెందిస్తారు. ఇలా ఏర్పడిన తొలిదశ పిండాల్లో రెండులేదా మూడింటి ని తిరిగి స్త్రీ గర్భాశయంలో ప్రవేశపెడతారు. దీని ద్వారా 30-35 శాతం ఫలితం పొందవచ్చు. ఇటీవల కాలంలో సంతాన సాఫల్యత చికిత్సలో మరెన్నో కొత్త విధానాలు అందుబాటులోకి వచ్చాయి. ఫలదీకరించిన పిండాలలో గర్భాశయంలోకి ప్రవేశపెట్టగా మిగిలిన పిండాలను అతిశీతల పరిస్థితుల్లో ఉంచి తరువాత వాటినే వాడటం జరుగుతుంది. అవసరాన్ని బట్టి అండాలను గానీ, శుక్ర కణాలను గానీ దాతల నుంచి స్వీకరించి వాడటం జరుగుతుంది. వీటితోపాటు పిండాన్ని మరో స్త్రీగర్భాశయం లో పెంచే ఒక వినూత్నమైన 'సరోగసి' విధానం కూడా అందుబాటులోకి వచ్చింది. అందుకే సంతానం కలగటం లేదని ఏళ్ళ తరబడి బాధపడే కన్నా ఎన్నో ఆధునిక పద్ధతులున్నా 'ఫర్టీ 9 హాస్పిటల్ ' ని ఆశ్రయించటం ఎంతో శ్రేయస్కరం.

**- డా॥ సి.జ్యోతి ఫెర్టిలిటీ స్పెషలిస్ట్**
**ఫర్టీ 9 హాస్పిటల్ & పరిశోధనకేంద్రం**



**✆ 90300 15588** | సికింద్రాబాద్ । కూకట్‌పల్లి । మదాపూర్ । సంతోష్‌నగర్ । వరంగల్ | **www.ferty9.com**

CRIME

# నమ్మకద్రోహం

**రాత్రి పన్నెండు గంటల సమయం**

**ముంబయి మహానగరం**

**పోలీస్‌స్టేషన్‌లో ఇన్‌స్పెక్టర్ కామత్ డ్యూటీ చేస్తున్నాడు.**

**ఫోన్ కెవ్వుమని అరిచింది.**

**వెంటనే ఫోన్ అందుకున్నాడతను.**

**"నేవీనగర్ సమీపంలో మెయిన్ రోడ్డుకు ఆనుకున్న బైపాస్‌రోడ్డు పక్కన ఓ యువతి శవం ఉంది" ఓ కంఠం కంగారుగా చెప్పింది.**

"హలో, ఎవరు మాట్లా...." అడిగేలోపే ఫోన్ కట్ అయింది.

సిబ్బందిని వెంటబెట్టుకుని బయలుదేరాడు కామత్.

ఘటనాస్థలం దగ్గర జనం గుమికూడి ఉండటం దూరంనుంచి కనిపించింది. పోలీస్ జీప్ చూడగానే అక్కడ చేరినవాళ్ళలో సగం మంది మంత్రం వేసినట్టు మాయమయ్యారు. మిగిలినవారు దూరంగా జరిగి కుతూహలంగా చూడసాగారు.

రోడ్డువారనే పడి ఉంది శవం. శవం చుట్టూ రక్తం మడుగు. ఇన్‌స్పెక్టర్ కామత్ శవాన్ని సూక్ష్మంగా పరిశీలించాడు. హతురాలు అందమైనదే. పాతికేళ్ళు ఉండొచ్చు. మెడలో, చెవులకు, చేతివేళ్ళకు బంగారు ఆభరణాలున్నాయి. డబ్బు, నగల కోసం హత్య జరగలేదని కామత్‌కు అర్థమైపోయింది. పొట్టలోతప్ప ఇంకెక్కడా గాయాలులేవు. శరీరంమీద, బుగ్గల మీద ఎలాంటి రక్కులు, పంటి గుర్తులు కనిపించలేదు. ధరించిన దుస్తులు చెదరిపోలేదు. అత్యాచారం జరిగిన దాఖలాలు లేవు. ఆమె బట్టల అడుగున లేడీస్ పర్స్ కనిపించింది. లిప్‌స్టిక్, కొంత సొమ్ము, ఉత్తరాలు పర్సులో కనిపించాయి. నాగపూర్ అడ్రసుకు డెలివరీ చేసిన ఉత్తరాలవి. ఒక ముఖ్యమైన క్లూ దొరికిందని ఇన్‌స్పెక్టర్ కామత్ ఊపిరి పీల్చుకున్నాడు.

పంచనామాచేసి మృతదేహాన్ని పోస్ట్‌మార్టం నిమిత్తం ప్రభుత్వ ఆస్పత్రికి తరలించాడు.

సిబ్బందిని వెంటబెట్టుకుని సెండర్స్ అడ్రస్సులో రాసిన చిరునామాకు వెళ్ళాడు. పోలీసులను చూడగానే కమల్‌ముఖం రక్తం లేనట్టు పాలిపోయింది. అతన్ని అరెస్ట్ చేసి పోలీస్‌స్టేషన్‌కు తీసుకొచ్చాడు కామత్.

ఇంటరాగేషన్‌లో మొదట ఏమీ తెలియదని బుకాయించాడు కమల్. ఇన్‌స్పెక్టర్ కామత్ ఉత్తరాలు చూపించేసరికి నివ్వెరపోయాడు. జరిగినదంతా పూస గుచ్చినట్టు చెప్పేశాడు.

ఇంతకీ ఆమె ఎవరు? ఆమెను ఎందుకు హత్య చేశారు? ఈ హత్య చేసింది కమలేనా?

***

కమల్ ఇంజనీరింగ్ విద్యార్థి. మధ్య తరగతి కుటుంబం నుంచి వచ్చాడు. తండ్రికి ఓ చిన్నషాపు ఉంది. కొడుకు చక్కగా చదివి పెద్ద ఆఫీసరు కావాలనేది తండ్రి కోరిక. తండ్రి అంచనాలకు తగినట్టుగానే చక్కగా చదువుకుంటూ ఒక్కొక్క మెట్టే ఎక్కుతూ నాగపూర్‌లో ఇంజనీరింగ్ సీటు రావటంతో అక్కడ చేరాడు కమల్. ఇక ఒక్క సంవత్సరం చదివితే ఇంజనీరింగ్ పూర్తయిపోతుంది. కొడుకు ఉద్యోగంలో చేరితే తమ కష్టాలు గట్టెక్కుతాయని తల్లిదండ్రులు కలలు కనేవాళ్ళు. అలాంటి సమయంలో కమల్‌కు నాగపూర్‌లో స్మిత పరిచయమైంది.

స్మిత తల్లి, కమల్ తండ్రి తరపు దూరపు బంధువు. ఆ కారణంతో అప్పుడప్పుడు స్మిత ఇంటికెళ్ళేవాడు కమల్. కళ్ళు చెదరించే అద్భుత సౌందర్యవతి స్మిత. మతి పోగొట్టే రూపురేఖలతో ఆకర్షణీయంగా ఉండేది. నిజానికి మొదటి చూపులోనే ఆమెను ప్రేమించాడు కమల్. ఆమె నడకలోని కడలికెరటాల సోయగం అతడి మతిపోగొట్టింది. అక్కడున్నంతసేపు ఆమెనే కళ్ళార్పకుండా చూస్తుండేవాడు.

అతడి పరవశాన్ని గమనించిన స్మిత తెలియనట్టుండేది. లోలోపలే పొంగిపోయేది. ఆమె మనోహర రూపం కమల్ కళ్ళల్లో మెదులుతూనే ఉండేది. ఆమె ఆలోచనలతో అతని శరీరం తియ్యని బాధతో పరవశించేది. ఆమె ఆలోచనలతో ఎన్నో నిద్రలేని రాత్రులు గడిపాడు కమల్. ఇక ఆలస్యం చేయకూడదనుకున్నాడు. తన మనసులోని భావాలు ఆమెకు చెప్పాలనుకుని ఒక రోజు స్మిత ఇంటికి వెళ్ళాడు. ఇంట్లో స్మిత ఒక్కతే కనిపించింది. అలాంటి ఏకాంతం కోసమే ఎదురుచూస్తున్న కమల్, ఆమెపట్ల తన ప్రేమను వెలిబుచ్చాడు. ఆ మాటలు వినగానే సంతోషపడింది. అంతలోనే ఏదో గుర్తుకొచ్చినట్టు ఆమె ముఖం వాడిపోయింది. అది గమనించాడు కమల్. "స్మితా, నీకు నేనంటే ఇష్టం లేదా?" అని అడిగాడు. "ఇష్టమే, కానీ నేను నిస్సహాయురాలిని".

"అంటే?" అన్నాడు.

"ఎలాచెప్పాలో తెలియటం లేదు కమల్, నిజానికి ఇంతకు ముందే నాకు పెళ్ళయింది". ఒక్కసారిగా షాక్‌తిన్నాడు కమల్. అతని కోరికలు, ఆశల మీద ఒక్కసారిగా నీళ్ళు ఒంపినట్టైపోయింది.

"నాకు... ఎప్పుడూ చెప్పలేదు. మీ ఆయన ఒకసారి కూడా కనిపించలేదు" అన్నాడు విచారంగా. "మా పెళ్ళైన మూడునెల్లకే యాక్సిడెంట్‌లో అతను చనిపోయాడు. నేను వితంతువును" అంటూ దుఃఖించింది. చేజారిన వస్తువు మళ్ళీ దొరికినంత సంబరంతో అతడి ముఖం వెలిగిపోయింది. స్మిత భుజాల మీద చేతులు వేసి, "నా ప్రేమలో ఎప్పటికీ మార్పువుండదు" అన్నాడు. స్మిత ఆశ్చర్యంగా చూసింది. "నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. పెళ్ళి చేసుకుంటాను. నన్ను నమ్ము" అంటూ దగ్గరకు తీసుకున్నాడు.

అతడి కౌగిలిలో ఒదిగిపోయింది స్మిత. కమల్ ఆమె కళ్ళమీద సున్నితంగా ముద్దు పెట్టాడు. పరవశంగా కళ్ళు మూసుకుందామె. కనురెప్పల మీది నుంచి అతడి పెదవులు కిందికి జారి బుగ్గలను చుంబించాయి. ఆమె సున్నితంగా తల పైకెత్తింది. అతను ఆమె పెదాలు అందుకుని మునిపంటితో కొరికాడు. స్మిత ఒంట్లో విద్యుత్ ప్రవహించినట్టయ్యింది. కోరికలు ఉవ్వెత్తున ఎగిసిపడ్డాయి. కమల్‌ను గాఢంగా హృదయానికి హత్తుకుంది. కోరికతో రగిలిపోతూ ఆమెను ఆక్రమించుకున్నాడు కమల్. ఆమె చిన్నగా మూల్గింది.

***

ఆ తరువాత తరుచూ కలిసేవారు. అవకాశం దొరికినప్పుడల్లా కోరికలు తీర్చుకునేవారు. ఈ లోపు అతని చదువు పూర్తయింది. ఉద్యోగ ప్రయత్నాలు మొదలుపెట్టాడు. ఉద్యోగం దొరకగానే తల్లితండ్రులకు నచ్చచెప్పి స్మితను పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకున్నాడు. ఉద్యోగం దొరికింది. కానీ మరో ఊరు వెళ్ళాల్సి వచ్చింది. వారాంతపు సెలవుల్లో స్మిత దగ్గరికి వచ్చి వాలిపోయేవాడు. తల్లితండ్రులకు స్మిత గురించి చెప్పేశాడు. మొదట వాళ్ళు అంగీకరించలేదు. కానీ ఒక్కగానొక్క కొడుకు కోరిక కాదనలేకపోయారు. కమల్ ఆనందంతో ఆ విషయం చెప్పటానికి ఆఫీసుకు సెలవు

**కళ్ళు చెదరించే అందం ఆమెది. ఒక్కసారి చూస్తే చూపు మరల్చుకోలేరు. మొదటి చూపులోనే మోహించాడతను. ఆమెకోసం తపించిపోయాడు. తరచుగా ఏదో వంకతో ఆమె ఇంటికి వెళ్ళేవాడు. ఆమెనే చూస్తూ గడిపేవాడు. అతడిని మౌనంగా గమనిస్తూ లోలోపల పొంగిపోయేది ఆమె. ఒకసారి ఏకాంతంగా దొరికిందామె. ఆమె కళ్ళను ముద్దాడి మెల్లిగా కిందకుజారి ఆమె పెదవులు అందుకున్నా డతను. ఉవ్వెత్తున ఎగసిన కోరికలతో అతడిని హత్తుకుపోయిందామె. ఇక దొరికిన ప్రతి అవకాశం ఉపయోగించుకుని హాయిగా గడిపేవారు ఇద్దరూ. ఆ తర్వాత...? ఆ తర్వాత ఏం జరిగింది?**



పెట్టి స్మిత దగ్గరికి బయలు దేరాడు. రైలుదిగి ఆటో కోసం ఎదురుచూస్తుండగా అతని క్లోజ్‌ఫ్రెండ్ కనిపించి కాఫీకి తీసుకెళ్ళాడు. స్మితను త్వరలో వివాహం చేసుకుంటున్నట్టు చెప్పాడు. అది విని అతడి మిత్రుడు మౌనం వహించాడు. తర్వాత మెల్లిగా చెప్పాడు, స్మిత ఒక వ్యక్తితో తిరగడం, వాళ్ళిద్దరూ చాలాక్లోజ్‌గా మూవ్‌కావటం చూశాననీ, ఒకట్రెండు సార్లు సినిమాహాల్లో, పార్కుల్లోనూ చూశానని, బాగా ఆలోచించుకోమని సలహా ఇచ్చాడు. అది విన్న కమల్ గుండె పగిలిపోయింది. అతని మనస్సంతా అల్లకల్లోలంగా మారింది. దుఃఖం పొంగుకొచ్చింది. ఆమెను వెంటనే నిలదీసి అడుగుదామనుకున్నాడు. అంతలోనే అది నిజం కాదేమో అనిపించింది. స్వయంగా కళ్ళతో చూసి నిజానిజాలు తెలుసుకోవాలనుకున్నాడు. వెంటనే ఒక లాడ్జిలో రూము తీసుకుని ఆమె కదలికలమీద కన్నువేశాడు. స్మిత నిజంగానే ఎవరో ఆగంతకుడితో తిరగటం కనిపించింది. రాత్రిళ్ళు ఇంటికి ఆలస్యంగా అదే వ్యక్తితో కలిసి వెళ్ళి తలుపులు వేసుకోవడం స్వయంగా చూశాడు. నమ్మకద్రోహాన్ని సహించలేకపోయాడు కమల్. దుఃఖంతో భోరున విలపించాడు. రానురానూ ఆ దుఃఖం కోపంగా, పగగా, ప్రతీకారేచ్ఛగా పరివర్తన చెందింది. తన మనస్సును ముక్కలు చేసిన ఆమెకు బుద్ధి చెప్పాలనుకున్నాడు. తీవ్రంగా ఆలోచించాడు. అతడి మనసులో ఓ పథకం రూపుదిద్దుకుంది. ఆ రోజు స్మిత ఇంటికి వెళ్ళాడు. వారాంతపు సెలవు లేనిరోజు వచ్చిన కమల్‌ను చూసి స్మిత కంగారు పడింది. క్షణాల్లో దాన్ని కప్పిపుచ్చుకుని సంతోషం తెచ్చుకుంది.

"అదేమిటి? ఇలా హఠాత్తుగా?" అడిగింది.

"శుభవార్త చెబుదామని వచ్చాను. మా తల్లిదండ్రులు మన పెళ్ళికి ఒప్పుకున్నారు. నిన్నొకసారి చూడాలంటున్నారు. అలాగే మా బంధువులకు కూడా నిన్ను చూపించాలనుకుంటున్నారు. అందుకే తీసుకెళ్ళడానికి వచ్చాను" అన్నాడు కమల్ ఆమెను ముద్దుపెట్టుకుంటూ.

స్మితకు ఏం మాట్లాడాలో తోచలేదు. "అమ్మ ఊళ్ళో లేదు. వాళ్ళ అన్నకు ఆరోగ్యం బాగోలేదని వెళ్ళింది. అమ్మ వచ్చాక ఇద్దరం వస్తాం. అయినా కొత్త ఉద్యోగం కదా, కొన్నాళ్ళ తరువాత చేసుకుందాం" అంటూ ఏమార్చే ప్రయత్నం చేసింది.

అయితే కమల్ మొండిగా "మీ అమ్మగారు తిరిగి వచ్చేలోపు మనం వెళ్ళి వచ్చేద్దాం" అని స్మితను బయలుదేరదీశాడు.

ఆ రాత్రి స్మితను తీసుకుని బొంబాయి బయలుదేరాడు. అర్ధరాత్రికి బొంబాయి చేరి రైల్వేస్టేషన్ బయటికి వచ్చారు. "నేవీనగర్‌లో నా మిత్రుడున్నాడు. ఈ రాత్రి ఇక్కడే ఉండి రేపు ఉదయమే మన ఇంటికి వెళదాం" అన్నాడు. "నీ ఇష్టం" అంది స్మిత. ఇద్దరూ టాక్సీలో నేవీనగర్ చేరుకున్నారు. మెయిన్‌రోడ్డుమీద టాక్సీ ఆపి, బాడుగ చెల్లించి పంపేశాడు. తరువాత స్మితను తీసుకుని బైపాస్ రోడ్డులో అడుగుపెట్టాడు. ఆ రోడ్డంతా నిర్మానుష్యం. అంతటా నిశ్శబ్దం కమ్ముకున్న వేళ...

తన 'పని' పూర్తి చేయడానికి ఇదే అనువైన ప్రదేశం అనుకున్నాడు కమల్.

తన పక్కనే వయ్యారంగా నడుస్తోంది స్మిత. ఆమె వైపు తిరిగాడు కమల్. హఠాత్తుగా జేబులోంచి కత్తి తీసి మెరుపువేగంతో బలంగా ఆమె పొట్టలోకి దించాడు. ఒక్క క్షణం తనకు ఏం జరిగిందో అర్థం కాలేదు స్మితకు. అతని వైపు పిచ్చిగా చూసింది.

మరుక్షణం బాధతో కెవ్వుమని కేకలేస్తూ నేల మీద కూలిపోయింది. "స్మితా, నిజంగా నిన్ను నేను ప్రేమించాను. పెళ్ళి చేసుకోవాలనుకున్నాను. మా వాళ్ళను ఒప్పించాను. కానీ నువ్వు నమ్మకద్రోహం చేశావు. మరొకరితో సంబంధం పెట్టుకున్నావు. నాకు చేసిన ద్రోహానికి ఇది నీకు నేను విధించిన శిక్ష" అన్నాడు కమల్ కసిగా.

స్మిత గిలగిలా తన్నుకుంది. జలజల కన్నీరు కార్చింది. కొద్దిసేపటికే తల వాల్చేసింది. ముంబయిలో ఆమెను ఎవరూ గుర్తుపట్టలేరని, 'గుర్తు తెలియని యువతి శవం' జాబితాలో చేరిపోతుందనీ తనను ఎవరూ అనుమానించే అవకాశం ఉండదనీ బలంగా నమ్మిన కమల్ ఆ ప్రదేశం నుంచి మెల్లిగా చీకట్లో కలిసిపోయాడు.

***

హంతకుడు ఎక్కడో ఒకచోట పొరబాటు చేస్తాడంటారు. కమల్ కూడా అంతే. తప్పుడు అంచనా వేశాడు. ఘటనాస్థలంలో స్మిత దుస్తుల కింద పడిన హ్యాండ్‌బ్యాగ్‌ను గమనించలేదు కమల్.

అందులో ఉత్తరాలే అతడిని పట్టిచ్చాయి.

ఇన్‌స్పెక్టర్ కామత్ కేసు నమోదుచేసి కమల్‌ను కోర్టులో హాజరు పరిచాడు.

ప్రస్తుతం అతను జైల్లో ఉన్నాడు.

—సూర్యనేత్ర

# సు ర భి

## మోడలింగ్



ఆరోగ్యమే మహాభాగ్యం సూత్రాన్ని ఆచర ణలో పెట్టేసి పచ్చి కూరగాయలు తినేస్తుంటారు. పళ్ళు లాగించేస్తుంటారు. కానీ వాటితో మోడలింగ్ చేయొచ్చని చెబుతోంది అలియా చాంగ్లర్. ఎలాగం టారా?

టర్కీలోని అంతల్యాకి చెందిన 31ఏళ్ల అలియా చాంగ్లర్ తన మూడేళ్ల కూతురు స్టెఫనీతో మోడలింగ్ చేయిస్తోంది. ఒకసారెప్పుడో చాంగ్లర్ పుచ్చకాయను కోసి ఒక ముక్కను పట్టుకొని నిల్చుండగా.. కొంచెం దూరంలో స్టెఫనీ వచ్చి నిల్చుందట. పుచ్చకాయ ముక్కను చూస్తే సరిగ్గా అది స్టెఫనీకి గౌను వేసినట్టుగా కనిపించింది. దాంతో ఇక ఫోటోల పరంపర మొదలైంది. అరటి, ద్రాక్ష, కాలీఫ్లవర్, ఆకుకూరలు... ఇలా ఇంట్లో లభించే కూరగాయలు, పళ్ళు, పూలను స్టెఫనీకి కాస్త



దూరంలో సరిగ్గా దుస్తులు వేసుకున్నట్టు భ్రమింపజేసేలా కెమెరాను ఫోకస్ చేసి క్లిక్ మనిపిస్తున్నారు. మూడేళ్ల స్టెఫనీ కూడా రకరకాలుగా ఫోటోలకు పోజులిస్తోంది. ఇంకేముంది వాటిని సోషల్‌మీడియాలో పోస్టు చేయటం, నెటిజన్లకు తెగ నచ్చేయడం, ఫాలోవర్స్ పెరగడం అన్నీ చకచకా జరిగిపోతున్నాయి.

## ఇష్టాన్ని అలా చాటుకున్నాడు

బెడ్ కాఫీ పడందే దినచర్య మొదలుకాదు కొంత మందికి. ఆఫీస్‌కి వెళ్ళేటప్పుడు కాఫీ, కాస్త తలనొప్పిగా ఉంటే కాఫీ, భోజనం ముందు కాఫీ, భోజనం తర్వాత కాఫీ ఇలా ఎప్పుడుపడితే అప్పుడు కాఫీ తాగుతూనే ఉంటారు ఇంకొంతమంది. శామ్ కూపర్‌కి కూడా కాఫీ అంటే బోలెడు ఇష్టం. ఆ ఇష్టాన్ని టాటూ రూపంలో చాటుకున్నాడతను. ఎలాగంటారా? తనకెంతో ఇష్టమైన కోస్టా బ్రాండ్ కాఫీ కప్‌ని తన చేతిమీద టాటూగా వేయించుకున్నాడు. అదెలాగంటే...



ఇంగ్లండ్, లీ ఆన్ సీకి చెందిన 29ఏళ్ళ శామ్ కూపర్‌కి కోస్టా బ్రాండ్ కాఫీ అంటే చెప్పలేనంత ఇష్టం. ఎంత ఇష్టం అంటే ఎప్పుడూ ఒకే షాపులో అదే బ్రాండ్ కాఫీ తాగుతుంటాడు. గత నాలుగు సంవత్సరాలుగా అదే షాపు, అదే కాఫీ... ఆ షాపువాళ్ళకి కూడా శామ్ నోటెడ్ అయిపోయాడు. అతను కాఫీషాపుకు రాగానే, కాఫీ ఆటోమేటిగ్గా అతని టేబుల్‌పైకి వచ్చేస్తుంది. దాంతో తనకెంతో ఇష్టమైన కోస్టాకాఫీ కప్‌ని తన చేతిపై టాటూగా వేయించుకుని, ఆ ఫోటోలను నెటిజన్లతో పంచుకున్నాడు. అంతేకాదు అదే అతని మొట్టమొదటి టాటూ అట కూడా!

## భలే హాబీ!

స్టాంపుల సేకరణ, నాణేల సేకరణ తెలుసు. చాలామందికి అదొక హాబీ. నిక్‌వెస్ట్‌కి కూడా ఓ హాబీ ఉంది. అదో బహు విచిత్రమైన హాబీ. ఏంటా హాబీ? అనుకుంటున్నారా?

ఇంగ్లండ్, సోమర్‌సెట్ కౌంటీలోని క్లీవ్‌డన్ నివాసి నిక్ వెస్ట్. వయసు 58ఏళ్ళు. అతను ఎంచక్కా బీరు తాగేసి ఆ బీరు టిన్‌లను స్టోర్ చేస్తుంటాడు. వాటితో ఇంటిలోనే ఓ పెద్ద బీరు టిన్‌ల లైబ్రరీని ఏర్పాటు చేశాడు. దాదాపు 42 ఏళ్ళ క్రితం



ఈవిధంగా బీరు టిన్‌లను దాచి పెట్టడం మొదలుపెట్టాడు నిక్‌వెస్ట్. అతని పిచ్చి ఎంతవరకూ వెళ్ళిందంటే రోజూ సాయంత్రం ఓ గంటసేపు కంప్యూటర్‌ముందు కూర్చుని ఆన్‌లైన్లో వివిధ దేశాల్లో దొరికే రకరకాల బీర్ల గురించి వెదుకుతుంటాడు. వాటిని ఆన్‌లైన్లోనే కొని, ఎంచక్కా ఖాళీచేసేస్తాడు. ఆ ఖాళీ టిన్‌లను తన లైబ్రరీలో భద్రం చేస్తుంటాడు. ఇప్పటివరకు 9 వేల బీరు టిన్లను సేకరించాడు. భలే వింత హాబీ కదూ!

## జంగిల్ గార్డెన్

కలలు ఎవరైనా కంటారు. కానీ ఆ కలలను సాకారం చేసుకునేవారు కొందరే ఉంటారు. అలాంటి తన కలని నిజం చేసుకున్నాడు విల్సన్. ఇంగ్లాండ్, యార్క్‌షైర్‌కి చెందిన 61 సంవత్సరాల నిక్‌విల్సన్ తన ఇంటి గార్డెన్ ప్రాంతంలో ఓ పెద్ద అడవిని సృష్టించాడు. దానికోసం 20 ఏళ్ళు కష్టపడ్డాడు. దాదాపు 15వేల యూరోలు ఖర్చు పెట్టాడు. అక్కడ అడుగుపెడితే చాలు అడవిలోకి వెళ్ళినట్టే! ఫెర్న్ వృక్షాలు, ఇంకా అనేక రకాల చెట్లతో, పొదలతో చూడముచ్చటగా ఉంటుంది. ఆ గార్డెన్ అడవిలో తిరగడానికి చెక్కదారులు, కాసేపు విశ్రాంతి తీసుకోవడానికి టేబుల్స్,



కుర్చీలు, కొలనులు, అందులో వీనులకు విందు చేసే రకరకాల చేపలు ఇలా ఎన్నో ఎన్నెన్నో వింతలు అక్కడ ఉన్నాయి. అంతేకాదండోయ్ ఆ అడవిని మీరు చూడొచ్చు కూడా! ఆ గార్డెన్ అడవిని చూడటానికి కొంతమొత్తం ఫీజురూపంలో వసూలుచేసి, పర్యాటకులకు అడవిని పరిచయం చేస్తున్నాడు నిక్. ఆవిధంగా వసూలైన ధనాన్ని చారిటీ సంస్థలకు ఇస్తున్నాడు. అడవిలో తిరుగుతూ ఆనందాన్ని సొంతం చేసుకోవాలనుకునేవాళ్ళు ఈ విల్సన్ గార్డెన్ అడవిని సందర్శించవచ్చు. భలే ఉందికదూ!

—నర్మద వాసిరెడ్డి

# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో
## 'అలర్జిక్ రైనైటిస్' సమస్యకు సరైన పరిష్కారం

డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్



చల్లని వాతావరణం ఏర్పడితే చాలామంది శ్వాసకోశ సమస్యలతో బాధపడుతుంటారు. అలాంటి శ్వాసకోశ సమస్యలలో ఎక్కువ మందిని వేధించే వ్యాధి 'అలర్జిక్ రైనైటిస్'. ప్రపంచ వ్యాప్తంగా దాదాపు 10 నుండి 30 శాతం వరకు ప్రజలు ఈ సమస్యతో బాధపడటం జరుగుతోంది. ఆహారపు అలవాట్లలో, జీవన విధానాలలో మార్పులు చేసుకోవడం మరియు శీతల పానీయాలను సేవించకపోవడం వంటి జాగ్రత్తలు తీసుకున్నప్పటికీ దీని బారిన పడి తీవ్ర ఇబ్బందులకు గురికావడం వలన, వారి రోజువారీ దినచర్యల పరంగా కూడా ఆటంకాలను ఎదుర్కోవడం జరుగుతుంది.

సాధారణంగా మానవ శరీర రోగనిరోధక వ్యవస్థ యొక్క అసందర్భ ప్రతిచర్యను 'అలర్జీ' అంటారు. అంటే ఏదైనా ఒక పదార్థానికి–శరీరం సాధారణ స్థితి కంటే ఎక్కువగా ప్రతిక్రియను చూపడం. ఆ పదార్థాన్ని 'అలర్జెన్' అని – అలాంటి ప్రతిచర్యను 'అలర్జిక్ రియాక్షన్' అని అంటారు.



**అలర్జిక్ రైనైటిస్ అనగా:** అలర్జెన్‌లు శ్వాస ద్వారా శరీరంలోకి ప్రవేశించినప్పుడు, శరీర రోగనిరోధక వ్యవస్థ సాధారణ స్థితికి మించి ఎక్కువగా ప్రతిక్రియ జరపడం వలన ముక్కులోని శ్లేష్మపు పొర శోథమునకు గురికావడాన్ని 'అలర్జిక్ రైనైటిస్' అంటారు.

**అలర్జిక్ రైనైటిస్ 2 రకాలు. (1) సీజనల్ అలర్జిక్ రైనైటిస్ :** కేవలం ఒక ప్రత్యేకమైన కాలంలో మాత్రమే అలర్జీకి గురి కావడాన్ని సీజనల్ అలర్జిక్ రైనైటిస్ అని అంటారు. సహజంగా ఈ సమస్య పుప్పొడి రేణువుల వలన ఎక్కువగా కలుగుతుంది. **(2) పెరీనియల్ అలర్జిక్ రైనైటిస్:** సంవత్సరం పొడవునా ఏ కాలంలోనైనా 'అలర్జిక్ రైనైటిస్' సమస్యకు గురైన పరిస్థితిని – పెరీనియల్ అలర్జిక్ రైనైటిస్ అంటారు. దుమ్మూ–ధూళి, జంతుకేశాల వంటి అలర్జెన్‌లకు శరీరం సున్నితత్వంగా ఉండడం వలన ఈ సమస్య ఏర్పడుతుంది.

**కారణాలు:** అలర్జెన్ శరీరంలోకి ప్రవేశించినప్పుడు దాని నుండి రక్షణ కల్పించడానికి, శరీరం 'హిస్టమిన్' అనే రసాయనాన్ని విడుదల చేస్తుంది. దాని వలన అలెర్జిక్ సమస్య ఏర్పడి తద్వారా రైనైటిస్ లక్షణాలు కనిపిస్తాయి. • పూలమొక్కల నుండి వెలువడే పుప్పొడి రేణువులు, దుమ్మూ–ధూళి, బూజు, జంతుకేశాలు, వాతావరణ కాలుష్యం, వాతావరణ మార్పులు, చల్లని గాలి, పరిమళ ద్రవ్యాలు (Perfumes), వృత్తిరీత్యా కొన్ని (పొగలకు గురి కావడం) కాలుష్యాలు, పొగ త్రాగటం మరియు కుటుంబ చరిత్ర వంటి అంశాలన్నీ ఈ 'అలర్జిక్ రైనైటిస్' సమస్యకు గల కారణాలుగా చెప్పవచ్చు.

**లక్షణాలు:** అధిక సంఖ్యలో తుమ్ములు, ముక్కు కారడం లేదా ముక్కు దిబ్బడ, ముక్కు మరియు కళ్ళు దురదగా ఉండటం, కళ్ళ వెంబడి నీళ్ళు కారడం, దగ్గు, గొంతులో దురదగా ఉండటం, కళ్ళచుట్టూ నల్లని వలయాలు ఏర్పడటం, తరచూ తలనొప్పి, ముఖం వాపుగా ఉండటం, నీరసం, ఒళ్ళు నొప్పులు మరియు మగతగా ఉండటం • చర్మం ఎక్కువగా పొడిబారటం, దురదగా ఉండటం మరియు చర్మంపై బొబ్బలు ఏర్పడటం వంటి 'ఎగ్జిమా' లక్షణాలను కూడా గమనించవచ్చు.

**దుష్ఫలితాలు:** చిన్న పిల్లలు దీర్ఘకాలికంగా ఈ వ్యాధికి గురి కాబడిన పరిస్థితి – ఆస్థమా మరియు సైనసైటిస్, చెవిలో ఇన్‌ఫెక్షన్‌లు (Otitis Media), నిద్రలేమి, దంత సమస్యలకు దారితీయవచ్చు.

**వ్యాధి నిర్ధారణ పరీక్షలు:** చాలా వరకు రోగి యొక్క లక్షణాలను బట్టి 'అలర్జిక్ రైనైటిస్'ను నిర్ధారించవచ్చు. • సి.బి.పి., ఇ.ఎస్.ఆర్., అబ్‌సెల్యూట్ ఇసినోఫిల్ కౌంట్ వంటి పరీక్షలు మరియు • Radio Allergo Sorbent Test (RAST) అనే పరీక్ష ద్వారా మన శరీరంలో ఒక అలర్జెన్‌కు ఎంత మేరకు IgE antibodies ఉన్నాయో తెలుసుకోవడం ద్వారా కూడా ఈ వ్యాధిని నిర్ధారించవచ్చును.

**తీసుకోవలసిన జాగ్రత్తలు:** పుప్పొడి రేణువులు అధికంగా ఉండే కాలంలో బయటకు వెళ్ళకపోవడం • ఉదయాన్నే ఆరుబయట వ్యాయామాలు చేయకపోవడం • బయటకు వెళ్ళివచ్చిన వెంటనే స్నానం చేయడం • 'ముక్కు'కు–'నోటి'కి మాస్క్ ధరించటం • శీతల పానీయాలు, ఐస్‌క్రీమ్‌లు తీసుకోకపోవడం • 'దుమ్మూ–ధూళి'కి మరియు పెంపుడు జంతువులకు దూరంగా ఉండటం వంటి జాగ్రత్తల ద్వారా కొంతవరకు ఈ వ్యాధిని నియంత్రించుకోవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ చికిత్స:** హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో అందించబడే అధునాతనమైన జెనెటిక్ కాన్‌స్టిట్యూషనల్ హోమియో చికిత్సా విధానం ద్వారా ఎలాంటి శ్వాసకోశ సమస్యలనైనా సంపూర్ణంగా నయం చేయవచ్చు. రోగి యొక్క మానసిక మరియు శారీరక తత్వాలను పరిగణనలోకి తీసుకుని, అందించబడే చికిత్స ద్వారా రోగనిరోధక వ్యవస్థలోని అసమతుల్యతలను సరిచేయడం ద్వారా పైన తెలిపిన అలర్జీని కలిగించే పరిస్థితులు ఎదురైనా – మళ్ళీ ఈ 'అలర్జిక్ రైనైటిస్' సమస్య తిరగబెట్టకుండా సంపూర్ణంగా నయం కాబడుతుంది.

టోల్ ఫ్రీ 1800 108 1212

కన్సల్టేషన్ ఉచితం
955 000 1199

www.homeocare.in




**"నిజమేమిటో ఆ భగవంతుడికే తెలియాలి. అతను పరిచయస్థుడనుకున్నా అసలు వసుధ విజయవాడ ఎందుకెళ్ళినట్టు? ఎవ్వరికీ చెప్పకుండా వెళ్ళాల్సిన అవసరం ఏమొచ్చిందని? నేను విజయవాడ వెళ్ళి విచారించి వద్దామనుకుంటున్నా" అన్నాడు పెదనాన్న.**

**నాన్న ఏమీ మాట్లాడలేదు. తల వేలాడేసి దిగులుగా కూచున్నాడు. అమ్మ రానందుకు నేనెంత బాధపడ్తున్నానో నాన్న కూడా అంతే బాధపడ్తున్నాడనిపించింది.**



"అమ్మ ఇంక రాదా అత్తా" అని అడిగాను. అత్త నా వైపు ప్రేమగా చూసి, జుట్టు సరిచేసి, "పెరట్లో కాత్యాయని పూలమొక్కల దగ్గర ఆడుకుంటోంది చూడు. నువ్వు కూడా వెళ్ళి కొద్దిసేపు ఆడుకో. ఈలోపల టిఫిన్ చేసిపెడ్తాను. ఇద్దరూ పళ్ళు తోముకుని రండి. తిందురుగానీ" అంది.

నేను లేచి పెరట్లోకి పరిగెత్తాను. కాత్యాయని బంతిపూలను చూస్తూ నిలబడి ఉంది. దాని కళ్ళు చాలాపెద్దవి. ముద్దబంతి పూలలా విచ్చుకుని ఉంటాయి. బూరెబుగ్గలు.. తెల్లగా, బొద్దుగా, రబ్బరు బొమ్మలా ఉంటుంది.

కాత్యాయనిని చూడగానే అమ్మలేని విషయం మర్చిపోయి ఆటల్లో పడ్డాను. ఇద్దరం కలిసి పూలమీద ఎగురుతున్న తూనీగల వెంటపడ్డాం. నా చేతికో తూనీగ దొరికింది. దాని తోకకి దారం కట్టి వదిలాను. అది దారంతో పాటు పైకెగిరింది. దారం సాయంతో మళ్ళా పట్టుకుని దారం చివర చిన్న రాయి కట్టి వదిలాను. అది ఎగరలేక అవస్థలు పడుతుంటే సంతోషంతో చప్పట్లు కొట్టాను.

"అలా చేయటం పాపం తెలుసా" అంది కాత్యాయని కళ్ళు చక్రాల్లా తిప్పుతూ.

"చూడు చూడు... అది ఎగరలేక ఎలా కిందికి పడిపోతుందో" అన్నాను మళ్ళా చప్పట్లు కొడుతూ.

"అలా చేస్తే దేవుడికి కోపం వస్తుంది. నీక్కూడా అలా చేస్తాడు."

"ఏం చేస్తాడమ్మా? నా తోకకి దారం కడతాడా? నాకు తోక లేదుగా.."

"నీ కాళ్ళు విరగ్గొట్టి నడవకుండా చేస్తాడు."

"అలా ఏమీ చేయడు."

"నిజం. మా అమ్మ చెప్పింది. కావాలంటే అమ్మనడుగు.."

నాకు భయమేసింది. నిజంగా దేవుడలా చేస్తాడా? అమ్మో.. కాళ్ళు లేకపోతే నడిచేదెలా.. పరుగెత్తేదెలా...

ఇద్దరం పళ్ళు తోముకుని అత్త చేసిన ఉప్మా తినడానికి పోటీలు పడ్డాం.

"ఇద్దరూ బైటికెళ్ళి కొద్దిసేపు ఆడుకోండి" అంది అత్త.

ఓ వారం వరకూ అత్త మా ఇంట్లోనే ఉండిపోయి నాకూ నాన్నకూ వండి పెట్టింది. పెదనాన్న విజయవాడ వెళ్ళి అమ్మ గురించి వాకబు చేసి వచ్చాడు.

### జరిగిన కథ

వేసవిసెలవులిచ్చారేమో రోజంతా ఆటపాటలతోనే గడుపుతున్నాడు రామకృష్ణ. ఆదివారం రోజున ఎప్పుడూ లేంది రామకృష్ణ వాళ్ళమ్మ వసుధ, త్వరగా వంట ముగించేసింది. రామకృష్ణకి గోరుముద్దలు తినిపించింది. ఎన్నో జాగ్రత్తలు చెప్పింది. పేరంటానికి వెళుతున్నానని చెప్పి వెళ్ళింది. చీకటి పడుతున్నా తిరిగి రాలేదు. రామకృష్ణ వాళ్ళ నాన్న, పెదనాన్న ఆమె కోసం వెతికారు. చివరకు ఎవరితోనో కలిసి విజయవాడ వెళ్ళిందని తెలిసింది.

ఆ తర్వాత....

అత్త ఒంగోలుకు తిరిగెళ్ళే ముందు రోజు సాయంత్రం అందరూ వసారాలో రెండు మంచాల మీద కూచుని తీవ్రమైన చర్చజరిపారు. అది అమ్మకు సంబంధించిన చర్చ కాబట్టి కాత్యాయనితో పామూ నిచ్చెన ఆట ఆడుతూనే వాళ్ళు మాట్లాడుకునేది శ్రద్ధగా వింటూ కూచున్నా.

"నా మాటిని మళ్ళా పెళ్ళిచేసుకో చిన్నన్నయ్యా" అంది అత్త.

"లేదు రమా. నేను వసూని కాకుండా మరో ఆడ దాన్ని నా భార్యగా ఊహించలేను" అన్నాడు నాన్న.

"అంతప్రేమగా చూసుకున్న నిన్నుకాదని, కన్న కొడుకు మీది ప్రేమను కూడా చంపుకుని వెళ్ళిపోయిం దిగా అన్నయ్యా. వీణ్ణి ఆడదాని సాయం లేకుండా ఎలా పెంచుతావు? కనీసం రామకృష్ణ కోసమైనా నువ్వు మారు మనువు చేసుకోక తప్పదు" అంది.

"నాకూ అదే సరైందనిపిస్తోందిరా. మన బంధువుల్లోనే ఎవరైనా అమ్మాయిని చూద్దాం. తెలి సిన వాళ్ళయితే కృష్ణని ప్రేమగా చూసుకుంటారు" అన్నాడు పెదనాన్న.

"లేదన్నా. నాకు జీవితం మీదే విరక్తి పుట్టింది. మరో పెళ్ళిచేసుకుని ఆ వచ్చే ఆడదాని ఉసురుపోసు కోలేను. వసూతో ఉన్నంత ప్రేమగా మరో స్త్రీతో ఉండలేను. ఈ జీవితానికీ దిగుళ్ళు చాలు. వసూతో గడిపిన రోజుల్ని గుర్తు చేసుకుంటూ శేషజీవితం గడిపేస్తాను" అన్నాడు నాన్న.

"ఇంకా వసూ అంటూ దానిపేరు జపిస్తా వెందుకు? అది నీ పరువుని మట్టిలో కలిపి పోయిందిగా. అయినా నీకేమంత వయసైపో యిందని.. తిప్పితిప్పిచూసినా ముప్పయ్ కూడా పూర్తిగా ఉండవు. ఈ వయసులో ఒంటరిగా ఉండటం ఒంటికి మంచిది కాదు. నీ అన్నయ్య చెప్పినట్టు మళ్ళా పెళ్ళి చేసుకో" అంది పెద్దమ్మ.

"లేదు వదినా. నాకిప్పుడు దేనిమీదా ఆసక్తి లేదు. నన్నిలా బతకనీయండి" అన్నాడు నాన్న.

"ఎన్నాళ్ళని చేయి కాల్చుకుంటావు చిన్న న్నయ్యా? వ్యవసాయమే చేస్తావా లేక ఆడదానిలా ఇంటిపనీ వంటపనీ చేస్తావా? అది నువ్వనుకుం టున్నంత సులభం కాదు" అంది అత్త.

"వంట ఇబ్బంది ఏం ఉండదులే రమా. నేను వండే దాంట్లోనే నాలుగ్గింజలు ఎక్కువేస్తే చాలు ఇద్దరికీ తిండి సమస్య తీరిపోతుంది. కానీ ఆడదాని ఆదరణ లేకుండా రామకృష్ణ ఎలా ఎదుగుతాడా అనేదే నా భయం" అంది పెద్దమ్మ.

రమత్త ఈ వారం రోజుల్లో ఎన్నోసార్లు అన్నమా టనే మళ్ళా అంది. "ఇప్పటికీ చిన్నొదిన అలా చేసిం దంటే నాకు నమ్మకం కుదరటం లేదొదినా" అని.

"ఇంకా నమ్మకపోవటం ఏమిటి? మీ అన్న విజయవాడ వెళ్ళి రెండ్రోజులుండి అన్ని విష యాలూ కనుక్కునే వచ్చాడుగా. కళ్ళముందు కన్పి స్తున్న నిజాన్ని కాదని ఎలా అనగలం?"

"అవుననుకో వదినా. అయినా చిన్నొదిన అలా ఎలా వెళ్ళగలిగింది? అసలెందుకు వెళ్ళింది? ఏ తల్లయినా తన బిడ్డల కోసం ప్రపంచాన్ని కాలితో తంతుంది కదా... అలాంటిది చిన్నపిల్లాడు రామకృ ష్ణని వదిలివెళ్ళటానికి మనసెలా ఒప్పింది? అలా గని వీడిమీద తనకి ప్రేమ లేదంటావా చెప్పు? తన ప్రాణంలా చూసుకునేదికదా."

పెద్దమ్మ ఏదో అనబోయే లోపు నాన్న అత్తతో అన్నాడు. "అందుకే రమా, తను నన్నొదిలి వెళ్ళిపో యినా తనమీద కోపం రావడం లేదు. బాధవే స్తోంది. పెళ్ళయిన క్షణంనుంచీ నాకేలోటు రాకుండా చూసుకుంది. నన్నో పసిపిల్లాడిలా లాలించింది. నేను అడక్కుండానే నా ప్రతి అవస రాన్ని తీర్చేది. అందంతోపాటు మంచి మనసున్న భార్య దొరికినందుకు ఎంత సంతోషపడేవాడినో.. కానీ చివరికి ఇలా ఎందుకు చేసిందో ఎంతాలోచిం చినా అర్థం కావడం లేదు. తనకేం లోటు చేశానని? వసుధంటే నాకెంతిష్టమో మీ అందరికీ తెలిసింది చాలాతక్కువ. నాకు తనంటే పిచ్చి ఇష్టం. తను లేకుండా బతకలేనంత ఇష్టం" నాన్న చేతుల్లో మొహం దాచుకుని సన్నగా వెక్కిళ్ళు పెడ్తూ ఏడ్చాడు.

"అది తన సుఖం వెతు క్కుంటూ ఎవడితోనో లేచిపోతే నువ్వెం దుకు ఏడు స్తావు?



ఆడదై ఉండికూడా బరితెగించి లేచిపోయింది. నువ్వు మగాడివి. ఒంటరిగా ఉండాల్సిన ఖర్మ నీకేం పట్టింది? నువ్వు ఊ అను. వారం లోపల నీకు మంచి సంబంధం తేకపోతే అప్పుడు చెప్పు" అంది పెద్దమ్మ.

"ఎందుకో వదినా... చిన్నొదిన గురించి బరి తెగించిందనో, లేచిపోయిందనో అనుకోడానికి మన సొప్పడం లేదు. ఎన్నిసార్లు నేనూ వదినా ఒంగో లుకు సినిమాలకు, షికార్లకు వెళ్ళామో. ఎంతంద మైన మగాడు ఎదురైనా కన్నెత్తి చూసేదికాదు. రాముడికి సీతలా మా చిన్నన్నయ్యకు వసుధ వదిన అనుకునేదాన్ని. ఆమె సీత కాదు నీతి లేని దని రుజువు చేసుకుంది. అయినా పోయిపోయి గుడిసెలో ఉండటం ఏమిటో ఖర్మ కాకపోతే" అంది రమత్త.

వాళ్ళమాటల్ని బట్టి అమ్మకు సంబంధించిన విషయాలు కొన్ని తెలుస్తున్నాయి. అమ్మ విజయ వాడలో ఉంది. ఓ గుడిసెలో ఉంటోంది. ఎటొచ్చీ లేచిపోవటం, బరితెగించడం అంటే ఏమిటో మాత్రం అర్థం కాలేదు.

"వాడు ఎవరిదగ్గరో కారు డ్రైవర్‌గా పన్చేస్తు న్నాడట. ఇంతకుముందే పెళ్ళయిందట. ఓ కొడుకూ, కూతురూ ఉన్నారట. వాడికోసం లంకంత కొంపనీ, పదెకరాల పొలానికి ఆసామి అయిన మొగుణ్ణీ, పసితనం వీడని పిల్లాణ్ణి ఎడం కాలితో తన్నిపో యిందామె. డ్రైవర్ గాడికి ఎంత జీతం వస్తుంది? అందుకే ఈవిడతో గుడిసెలో కాపురం పెట్టాడట. ఏం చేస్తాం చెప్పు. వినాశకాలం దాపురిస్తే ఇలాంటి విపరీతబుద్ధులే పుడతాయి" అన్నాడు పెదనాన్న.

"వినాశకాలమూ కాదు పాడూ కాదు. ఒళ్ళు కొవ్వెక్కి అది మరో మగాడి దగ్గర దొరికే సుఖం కోసం వెళ్ళిపోయింది. అటువంటి స్త్రీ గురించి మనం చర్చించుకోవడం కూడా అనవసరం. వదిలే యండి" అంది పెద్దమ్మ. నాన్న వైపు తిరిగి "అందుకే చెప్తున్నా. నువ్వు కూడా నీ సుఖం చూసుకో. జీవితం బావుంటుంది" అంది.

నాకు మరికొన్ని విషయాలు తెలిశాయి. డ్రైవ ర్‌గా పన్చేస్తున్న వ్యక్తి కోసమే అమ్మ నన్నూ, నాన్ననీ వదిలి వెళ్ళింది. ఇదంతా తన సుఖంకోసం చేసింది. నా చిన్నిబుర్రలో లోహముద్రలా ఓ అభి ప్రాయం స్థిరపడిపోయింది. ఎవరైనా సరే సుఖాన్ని వెతుక్కుంటూ ఎక్కడికైనా వెళ్తారు. ఆ సుఖంకోసం కన్నబిడ్డనీ, కట్టుకున్న మొగుణ్ణీ కూడా వదిలేసి వెళ్ళ గలరు. ఆ సుఖంకోసం ఇల్లూ పొలాలూ లేకున్నా గుడిసెలో అయినా ఉండగలరు. జీవితం బాగుం డాలంటే ఎవరి సుఖం వాళ్ళు చూసుకోవాలి. కానీ వాళ్ళు మాట్లాడుకుంటున్న సుఖం ఏమిటో మాత్రం నాకు తెలియలేదు.

***

అత్త వెళ్ళిపోయాక కొన్నిరోజులు పెద్దమ్మే మా కోసం వంటచేసి పంపేది. ఎందుకో నాన్న ఇష్టపడ లేదు. "ఇంతవరకూ మాకోసం చేసింది చాల్లే వదినా. ఎన్నాళ్ళని ఇలా పంపుతూ ఉంటావు? మేము వండుకుంటాంలే" అన్నాడో రోజు.

పెదనాన్న చెప్పినా విన్లేదు. "మా వల్ల వదినకు కష్టం కలగటం నాకిష్టం లేదన్నా" అన్నాడు.

"అదేమిట్రా.. నువ్వూ, కృష్ణ మాకు పరాయి వాళ్ళు కాదుగా. మనవాళ్ళకోసం చేసేదాన్ని కష్టమను కుంటారా ఎవరైనా? వదిన ఎన్నడూ అలా అనుకో దురా" అన్నాడు పెదనాన్న.

"అనుబంధాలు పగుళ్ళువారకుండా ఉండా లంటే ఎవరిబతుకు వాళ్ళు బతకడమే మంచిదన్నా. కష్టమొస్తే ఎలాగూ ఆదుకోవాల్సింది నువ్వూ, వదినే. అవసరమైనప్పుడు నేనే అడుగుతాలే" అన్నాడు.

ఆరోజు నుంచి నాకు కొత్త కష్టాలు మొద లయ్యాయి. అంట్లు తోమడంలో, ఇల్లు ఊడ్చడంలో, వంట చేయడంలో నాన్నకు సాయం చేయాల్సి వచ్చేది. దానికోసం నేనూ నాన్నతో పాటు ఉదయం ఐదింటికే లేవాల్సి వచ్చేది. అమ్మ ఉన్నప్పుడు దుప్పటి వెచ్చగా కప్పుకుని ఏడింటి వరకు నిద్ర పోయే వాణ్ణి.

ఇప్పుడు నాన్న అంట్లగిన్నెల్ని కచ్చికతో తోమాక నేను వాటిని నీళ్ళతో కడిగి పెడ్తున్నాను. నాన్న వంటగదిలో పొయ్యి ముందర కూచుంటే నేను కూరలు తరిగివ్వటం, బియ్యమో జొన్నలో కడి గివ్వటం చేస్తున్నాను.

నాన్న వండిందేదో తినేసి పొలానికెళ్తున్నాడు. నేను కూడా స్కూలుకెళ్ళిపోతున్నా. కానీ మధ్యా




**కన్నతల్లి జ్ఞాపకాలతో సతమతమవు తున్నాడా పిల్లాడు. తల్లిప్రేమ కోసం విలవిల్లాడుతున్నాడు. ఇంట్లో ఉంటే ఇల్లంతా ఆమే కనిపిస్తోంది. బయటికి వెళితే ఊళ్ళోవాళ్ళ జాలిచూపులూ, ఎగతాళి మాటలూ... రోజులు గడు స్తున్నా, తల్లి తిరిగొస్తుందనే ఆశతో, నమ్మకంతో ఎదురుచూస్తున్నాడు. ఆ నమ్మకంతోనే ఓ నిర్ణయం తీసు కున్నాడు. ఏమిటా నిర్ణయం?**

హ్నాలు నేను ఇంటికొచ్చే సమయానికి నాన్న వచ్చే వాడు కాదు. ఒంటరిగా కూచుని అన్నం వడ్డించు కుని తినబోతే సయించేది కాదు. పెద్దమ్మ వాళ్ళింటి కెళ్ళి సుందరం అన్నయ్య, కీర్తితో పాటు కూచుని తినేవాణ్ణి.

పెద్దమ్మ ప్రేమగా చూసేది. సుందరంతో సమా నంగా చూసేది. నా ఈడుదే అయిన కీర్తి గొడవ పడి నన్ను కొడితే పెద్దమ్మ కీర్తినే తిట్టేది. "తప్పమ్మా.. తల్లిలేని పిల్లాడు. వాణ్ణి ప్రేమగా చూడాలి కదా. రామకృష్ణకి మనంకాక ఇంకెవరున్నారు చెప్పు" అనేది.

పెద్దమ్మ నా పక్షం వహించడం సంతోషాన్ని చ్చినా తల్లిలేని పిల్లాడు అనే మాట విన్నప్పుడు బాధనిపించేది. ఎదుటివ్యక్తి జాలి చూపించే స్థితిలో ఉండటం ఎంత అవమానకరమో ఆ వయసులోనే నాకు తెలిసొచ్చింది. జాలి పదునైన కత్తిలా గుండెను ముక్కలుగా కోస్తుంది. ఊళ్లో కొంత మంది జాలిపడ్తున్నట్టు నటిస్తూ ఎగతాళి చేసే వాళ్ళు. వయసులో నా కంటే పెద్ద వాళ్ళు కూడా అంత అసహ్యంగా ఎలా ప్రవర్తించగలరో నాకర్థమ య్యేది కాదు.

"మీ అమ్మ లేచిపోయిందటగా. ఎవరితోనో నీకు తెలుసా? ఏ ఊళ్లో ఉందో తెలుసా? అతనికి పెళ్ళయిందా? పిల్లలున్నారా?" లాంటి ప్రశ్నలన్నీ నన్నడిగేవారు. నాకు తెలియదని చెప్పి వెనుదిర గడం ఆలస్యం... నవ్వుకునేవాళ్ళు.

పాలు పోసే లక్ష్మమ్మ ఆంటీ వాళ్ళింటికి పాలు పోయించుకోడానికి వెళ్ళినపుడు ఓ రోజు ఆమెతో పాటు మరొకావిడ మాట్లాడుతూ ఉండింది. ఆంటీ నా గిన్నెలో పాలు పోశాక "ఈ అబ్బాయి వాళ్ళ అమ్మే ఎవరితోనో లేచిపోయింది. పాపం చిన్న పిల్లాడు. ఇంత దుర్మార్గమైన తల్లులు కూడా ఉంటారా లోకంలో" అంది.

ఇంటికొచ్చి ఎంతసేపు ఏడ్చానో... ఆ ఏడుపు అమ్మ నన్ను వదిలి వెళ్ళినందుకో లేకపోతే అమ్మను దుర్మార్గురాలన్నందుకో నాకే అర్థం కాలేదు. అమ్మ దుర్మార్గురాలు కాదు. అమ్మ చాలా మంచిది. అమ్మ లేదని నేనెలా ఏడుస్తున్నానో నేను తన దగ్గర లేనని అమ్మ కూడా ఏడుస్తూ ఉండి ఉంటుంది.

నాన్న నన్ను ఓదార్చాడు. "నీకే అలా ఉంటే

## జోక్ చేసిందట!

'కాలు జారినా తీసుకోవచ్చేమో కానీ, మాట జారితే తీసుకోవడం కష్టం' అంటారు. సరిగ్గా తాప్సీ విషయంలో ఇదే జరిగింది. దర్శకేంద్రుడి విషయంలో నోరు జారిన తాప్సీ ఆ తరువాత భారీ విమర్శలనే మూటకట్టుకుంది. తన మాటలతో అందరూ ఏకీభవిస్తారని ఆశించిన తాప్సీకి నిరాశే ఎదురైంది. దానికి తోడు సినీ రంగానికి చెందిన వారే కాకుండా బయట వారుకూడా తాప్సీ మీద మాటల యుద్ధం మొదలెట్టారు. దాంతో కంగారు పడిన తాప్సీ దిద్దుబాటు చర్యలకు దిగింది. రాఘవేంద్రరావుగారి విషయంలో తాను అన్న మాటలు కేవలం జోక్‌గా అన్నవేతప్ప నిజం కావనీ, ఆ మహానుభావుడి చేతుల మీదుగా తన సినీరంగ ప్రవేశం జరగడం తన అదృష్టమనీ, అలాంటి వ్యక్తిని మాటలతో ఎలా అవమానపరుస్తానంటూ చెప్పుకొచ్చింది. తాప్సీ ఎంత గింజుకున్నా ఆమె విషయంలో జరగాల్సిన డ్యామేజీ జరిగిపోయింది అంటున్నారు సినీ జనాలు. దర్శకేంద్రుడికే వంక పెట్టిన ఆమెకు టాలీవుడ్‌లో అవకాశాలు వచ్చేది కష్టమేనన్నది కొందరి వాదన.



నాకెలా ఉంటుందో తెలుసా? నువ్వు ఏడ్చి గుండె బరువు దింపుకుంటున్నావు. నాకా అదృష్టం కూడా లేదు కదరా" అన్నాడు.

అమ్మ తిరిగి వస్తుందన్న నమ్మకం... నన్ను చూడకుండా అమ్మ ఎక్కువ రోజులు ఉండలేదన్న నమ్మకం.. రోజూ అమ్మ వస్తుందని ఎదురు చూడటం... నిరాశలోనే నిద్రలోకి జారుకోవడం.. అమ్మవెళ్ళి నెల రోజులు దాటిపోయింది. అమ్మ తనకు తనే వస్తుందన్న నమ్మకం సన్నగిల్లింది. మరో ఆశ నాలో చిగురు తొడిగింది.. నేను వెళ్ళి పిలిస్తే తప్ప కుండా వస్తుందన్న ఆశ.. 'అమ్మా.. నువ్వు లేకుండా ఉండలేను. వచ్చేయమ్మా' అంటే చాలు అమ్మ పరుగెత్తుకుంటూ వస్తుందన్న నమ్మకం..

అమ్మ జ్ఞాపకాలు బాగా బాధించేవి. ఇంట్లో ఏది చూసినా అమ్మ గుర్తొచ్చేది.

అమ్మ ఉదయం లేచాక పెరట్లోని పూల మొక్కలకు నీళ్ళుపోసేది. ఇపుడా బాధ్యత నేను తీసుకున్నాను. ముద్దబంతిపూల మొక్కలకు నీళ్ళు పోస్తుంటే అమ్మ నవ్వు గుర్తొచ్చేది. గులాబీ పూలు గాలికి కదిలినప్పుడల్లా అమ్మ నడుస్తున్నట్టే ఉండేది. మొక్కల్లోంచి అమ్మగొంతు విన్పించేది. 'కన్నా బావున్నావా' అని అడుగుతున్నట్టు... అచ్చం అమ్మ గొంతే.. తీయగా పాట పాడుతున్నట్టు..

అమ్మ ఎంత బాగా పాడేదో.. కథేదైనా చెప్పమ్మా అని అడగటం ఆలస్యం 'నీకు పెళ్ళికా నుక సినిమా కథ చెప్పనా' అనేది. అమ్మకు ఆ సినిమా అంటే ఎందుకంత ఇష్టమో నాకర్థమ య్యేది కాదు.

'ఒకర్ని ప్రేమించి మరొకర్ని పెళ్ళిచేసుకోవటం ఎంతటి నరకమో కదా. ఆ సినిమాలో నాగేశ్వర్రావు, బి.సరోజాదేవి ఎంతటి దుఃఖాన్ని గుండెల్లో దాచు కుని పైకి నవ్వుతూ జీవితాన్ని గడుపుతారో' అంటు న్నప్పుడు అమ్మ కళ్ళల్లో తడి మెరిసేది.

రాత్రుళ్ళు ఆరుబయట మంచం వేసుకుని నన్ను పక్కన పడుకోబెట్టుకుని జోకొడుతూ పాట పాడేది.

అలా అమ్మ గుర్తొచ్చినప్పుడల్లా బస్సెక్కి విజయ వాడ వెళ్ళి అమ్మను చూడాలనుకునేవాడిని. అమ్మను గట్టిగా వాటేసుకుని పెద్దగా ఏడిస్తే చాలు అమ్మ తప్పకుండా వచ్చేస్తుంది. కాని ఎవ రైనా అమ్మ విషయం ఎత్తి నామీద జాలి చూపించి నప్పుడు మాత్రం అమ్మమీద కోపం వచ్చేది. ఎవరైనా ఎగతాళిగా నవ్వినప్పుడైతే నాలో నేను నత్తలా ముడుచుకుపోయేవాణ్ణి. బైటికెళ్ళకుండా ఇంటి నాలుగ్గోడల లోపలే ఉండిపోవాలనిపించేది. ఎవ్వరికీ నా మొహం చూపించాలనిపించేది కాదు.

నాన్న ఈ మధ్య బాగా చిక్కిపో యాడు. సరైన తిండి లేదు కదా. ఏదో తినాలి కాబట్టి తినడం తప్ప అమ్మ చేతి వంటలా రుచిగా వండుకుని తిన్నదెప్పుడు? కానీ ఒక రోజు పెద్దమ్మ పెదనాన్నతో అంటుండగా విన్నాను.

"పెళ్ళాం వేరే మగాడితో వెళ్ళి పోయిందన్న దిగులు అతన్ని లోప ల్లోపల తినేస్తోందయ్యా. మనిషిని చూశావా జబ్బుపడ్డట్టు ఎలా అయిపోయాడో.. మొహమంతా పీక్కుపోయి, కళా కాంతులు లేకుండా.. తను వెళ్ళిపోయి అక్కడ ఏం బావు కుంటోందో తెలీదు కానీ ఇక్కడ వీళ్ళు మాత్రం హింస పడ్తు న్నారు. ఆ మహాతల్లి వెళ్ళిపో యిన క్షణం నుంచీ రామకృష్ణ నవ్వడం నేను చూళ్ళేదు" అంది పెద్దమ్మ.

నాన్న చిక్కిపోతుంది సరైన తిండిలేక కాదు, అమ్మ వెళ్ళిపోయిందన్న దిగులు వల్ల అని అర్థ మైంది. నాన్నకో రోజు బాగా జబ్బు చేసింది. విప రీతమైన జ్వరం, వాంతులు... దగ్గి దగ్గి గుండెల దగ్గర నొప్పంటూ పట్టుకుంటున్నాడు. స్కూలు మానేసి నాన్నను చూసుకోడానికి ఇంట్లోనే ఉండి పోయాను.

పెద్దమ్మ రోజూ జావ కాచిస్తోంది. అది తాగినా కడుపులో ఇమడక కక్కుకుంటున్నాడు.

"ఒంగోలుకు పిల్చుకెళ్ళి పెద్దాసుపత్రిలో చూపించడం మంచిది" అంది పెద్దమ్మ.

అప్పటికి నాన్నకు జ్వరం మొదలై ఆరు రోజులు.. నాన్నను రిక్షాలో ఎక్కించుకుని ఆస్పత్రికి పిల్చుకెళ్ళాడు పెదనాన్న. ఏవో పరీక్షలు చేసి టైఫా యిడ్ జ్వరమని మందులు రాసిచ్చారట.

పదిరోజులు దాటినా నాన్న పరిస్థితిలో మార్పు రాలేదు. నాన్న మరింత బలహీనంగా కన్పిస్తు న్నాడు. ఒంట్లో ఎన్ని ఎముకలున్నాయో లెక్కపెట్ట వచ్చు. దగ్గడానికి కూడా ఓపిక లేనట్టు ఇబ్బంది పడుతున్నాడు.

"డాక్టర్ రాసిచ్చిన మందులు వాడుతున్నా గుణం కన్పించడం లేదేమిటి?" అన్నాడు పెద నాన్న.

"అది టైఫాయిడ్ జ్వరమైతేగా తగ్గడానికి.. వసుధ మహాతల్లి వల్ల వచ్చిన జ్వరం. మానసిక జబ్బు. దానికి ముందేముంటుంది?" అంది పెద్దమ్మ.

"మరి ఏం చేద్దామంటావు? ఇలా వదిలేస్తే ప్రాణాలకే ప్రమాదం వచ్చేలా ఉంది."

"మీ తమ్ముడికి ఆవిడంటే ఎంతప్రాణమో నాకు తెలుసు. ఈ క్షణం ఆవిడ తిరిగొచ్చినా సంతోషంగా ఆవిణ్ణి భార్యగా స్వీకరించేందుకు తయారుగా ఉన్నాడు."

"వదిలెయ్. పరాయి మగాడు కావాలని వెళ్ళిన ఆడది మళ్ళా తిరిగెందుకొస్తుంది? వచ్చినా సమాజం ఊరుకుంటుందా? వేయి నాల్కలతో చీల్చిచెండా డదూ" అన్నాడు పెదనాన్న.

నాకు నాన్నను తల్చుకుని భయమేసింది. పెద నాన్న చెప్పినట్టు ఇలానే వదిలేస్తే చచ్చిపోతా డేమో... అప్పుడు నేను దిక్కులేని అనాథనైపోతాను.

నాన్నను బతికించుకోవాలంటే అమ్మను పిల్చు కుని రావడమొక్కటే మార్గమనిపించింది. అమ్మ ఎక్కడుందో తెలుసు కాబట్టి అదేమంత కష్టమైన పని కాదనిపించింది.

నాన్నకు ఆరోగ్యం బాగోలేదని తెలిస్తే అమ్మ




తప్పకుండా వస్తుంది. అమ్మ తిరిగి వచ్చాక నేను నాన్న అమ్మ ముగ్గురం ఎప్పటికి మల్లె సంతో షంగా ఉండొచ్చు.

పెదనాన్న మా పొలాల్లో పండిన గింజల్ని కూడా అవసరానికి సరిపడా ఉంచి మిగతావి అమ్మేసి డబ్బుల్ని నాన్నకిచ్చాడు. నాన్న వాటిని ఎక్కడ దాచిపెట్టాడో నాకు తెలుసు.

నాన్నకు తెలియకుండా వాటిలోంచి ఐదు వందరూపాయల నోట్లు తీసుకుని ఒంగోలు వెళ్ళే బస్సెక్కాను. అక్కడినుండి విజయవాడ వెళ్ళే బస్సెక్కి కూచున్నాను.

రెండున్నర గంటల ప్రయాణమని పెదనాన్న చెప్పటం గుర్తొచ్చింది. బస్ బయల్దేరేటప్పటికి సమయం ఉదయం పది గంటలు.

దారిలో అన్నీ అమ్మ గురించిన ఆలోచనలే. అమ్మ నన్ను చూడగానే ఏమంటుంది? చాలా సంతోషంగా పరుగెత్తుకుంటూ వచ్చి 'కన్నా.. వచ్చావా.. నాకోసం వచ్చావా.. నాకు తెలుసు నువ్వొస్తావని' అంటూ చెంపల మీద ముద్దులు పెడుతుంది.

నేను అలుగుతాను. 'నీతో మాట్లాడను పో. కటీఫ్' అంటాను.

'ఎందుకు మా కన్నాకి ఈ అమ్మ మీద కోప మొచ్చిందీ?' అంటుంది అమ్మ. అది కూడా పాట పాడినట్టు రాగం తీసినట్టు మాట్లాడుతుంది.

'మరి నన్నొదిలి ఎందుకొచ్చేశావు?' అంటాను కోపంగా.

'అవును కదా.. తప్పే. ఇంకెప్పుడూ నా బాబుని వదిలి ఎక్కడికీ వెళ్ళను. సరేనా.. మనం ఇప్పుడు దోస్త్' అంటుంది చేతిని ముందుకు చాపి.

'నువ్వు వెళ్ళిపోయాక నాన్న ఎంత బాధ పడ్డాడో.. నాన్ననెందుకు వదిలేశావు? నాన్న మీద కోపం వచ్చిందా' అని అడుగుతాను.

'అయ్యో.. నాకు మీ నాన్నమీద కోపం ఎందు కొస్తుంది? ఆయన చాలా మంచివ్యక్తి. నన్నెప్పుడూ పల్లెత్తుమాట అన్లేదు. ఎప్పుడూ బాధపెట్టలేదు. నేనే ఇలా వచ్చేసి అతన్ని బాధపెట్టాను' అంటూ అమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుంటుంది.

'నాన్నకు ఆరోగ్యం బాగోలేదమ్మా. ఇలానే వది లేస్తే చచ్చిపోతాడేమో అన్నాడు పెదనాన్న. నువ్వు తిరిగొస్తే కానీ బతకడు అంది పెద్దమ్మ' అంటాను.

'అయ్యో అలానా.. పద వెళ్దాం' అంటుంది అమ్మ.

ఉన్నపళంగా నాతో పాటు మా ఊరికొస్తుంది. అంతే. అమ్మను చూడగానే నాన్న మొహంలో కళ వస్తుంది. 'వచ్చేశావా వసూ. ఇక నాకేమీ పర్వా లేదు' అంటాడు నవ్వుతూ. నాన్నకు బాగైపోతుంది. అమ్మ నాన్న నేను... సంతోషంగా ఉంటాం.

ఆలోచనల్లోనే విజయవాడ వచ్చేసింది. పెద నాన్న రెండున్నరగంటలన్నాడు గానీ మూడు గంటలు పట్టింది. సమయం ఒంటిగంట అయి నట్టు బస్టాండ్‌లో ఉన్న గడియారం చూపించింది.

ఆకలేస్తోంది. బస్టాండ్ బయట బండిమీద పునుగులేస్తుంటే కొనుక్కుని కారప్పొడి అద్దుకుని తిన్నాను. ఎంత రుచిగా ఉన్నాయో.. అమ్మ దగ్గర కెళ్ళంగానే ఎలాగూ కడుపునిండా అన్నం పెడు తుందిగా. అప్పటివరకు ఈ పునుగుల్తో సరిపుచ్చు కోవాలనుకున్నాను. తను నన్నొదిలి వెళ్ళే రోజు గోరుముద్దలు తినిపించిందిగా. 'నీకు నా చేత్తో తిని పించి చాలా రోజులైంది కన్నా' అంటూ ఈ రోజు కూడా ముద్దపప్పూ నెయ్యీ కలిపి తినిపిస్తుంది.

రోడ్డు మీద నడుస్తున్నాను. అమ్మ కనిపిస్తుం దని ఆశ. విజయవాడ ఇంత పెద్దదని అనుకోలేదు. మా ఊరంత ఉంటుందనుకున్నా. మా ఊర్లో ఎవరు ఎవరి గురించి అడిగినా వెంటనే ఫలానా చోట ఉంటారని చెప్పేస్తారు. ఈ ఊరు మా ఒంగోలు కంటే పెద్దదిగా ఉంది.

గంటసేపు కనిపించిన మనుషుల మొహాల్లోకి ఆశగా చూస్తూ వెదికినా అమ్మ కనిపించలేదు. ఈరోజు అమ్మ బైటికి వచ్చి ఉండదు. తన గుడిసె లోనే ఉండి ఉంటుంది. ఈ ఊళ్ళో గుడిసెలు ఎక్కడ ఉంటాయో కనుక్కుని అక్కడికెళ్తే చాలు. అమ్మ పేరుచెబితే ఏ గుడిసెలో ఉందో చెప్పేస్తారు. అప్పుడు అమ్మ తప్పకుండా కనిపిస్తుంది.

నా పక్కనుంచి నడిచిపోతున్న ఓ పెద్దాయన్ని ఆపి అడిగాను. "ఈ ఊళ్లో గుడిసెలు ఎక్కడ ఉంటాయి" అని.

"గుడిసెలా.. ఎందుకూ" అని అడిగాడాయన.

అమ్మ కోసం వెతుకుతున్నానంటే ఇంకా చాలా వివరాలడుగుతాడని భయపడి "నా ఫ్రెండొకడు ఉంటాడక్కడ. వాడిని కలుసుకోవాలని వచ్చాను" అన్నాను.

"మీది ఈ ఊరు కాదా?"

"కాదు. పక్కూరు"

"ఏ ఊరు?"

ఇతనితో లాభం లేదని సమాధానం ఇవ్వ కుండా ముందుకు నడిచాను.

"అబ్బాయ్.. నిన్నే.. ఏ ఊరు మీది? పారిపోయి వచ్చావా? మీ నాన్న పేరేమిటి?" అంటూ వెంట బడ్డాడు.

నాకు భయమేసి అతనికి దొరక్కుండా పరిగె త్తాను.

"ఇదుగో.. నిన్నే.. ఉండు" అంటూ అతనూ వెంటబడ్డాడు.

నేనో సందులోకి దూరాను. అలా రెండు మూడు సందుల్లోకి తిరిగి, ఆయాసం తీర్చుకోడా నికి ఆగి వెనక్కి తిరిగి చూశాను. అతని జాడ లేదు.

మెల్లగా మరోవైపున్న మెయిన్‌రోడ్ పైకొచ్చి అక్కడ సెంటర్లో రోడ్డుపక్కన ఆపి ఉన్న ఓ రిక్షా అతన్ని అడిగాను. "ఇక్కడ గుడిసెలు ఎక్కడ ఉంటాయి" అని.

"గుడిసెలా? అడ్రస్ ఏమని చెప్పారు?"

"అడ్రస్ తెలియదు. గుడిసెల్లో ఉంటారని మాత్రమే తెలుసు".

"అలాగైతే కష్టం అబ్బాయ్. ఈ ఊళ్లో చాలా చోట్ల గుడిసెలుంటాయి. ఏ ఏరియాలో ఉండే గుడి సెలో తెలీకపోతే ఊరంతా వెతుక్కోవాలి" అన్నాడు.

**(ఇంకా వుంది)**

# శిథిలజీవి

-కాండ్రేగుల శ్రీనివాసరావు

**శీతాకాలం**

**అర్ధరాత్రి సమయం**

**విపరీతంగా మంచు కురుస్తోంది.**

**డిసెంబర్‌నెల చలి తీవ్రంగా వణకిస్తోంది.**

**అయిలయ్య తన పూరిపాక తడికె తెరచి బయటకు చూశాడు. వీధి నిర్మానుష్యంగా ఉంది. దూరంగా ఎక్కడో కుక్క ఒకటి చలికికాబోలు ఏడుస్తున్నట్లు అరుస్తోంది. తడికె దగ్గరగా చేరవేసి, లోపలకొచ్చి ముడుచుకుని పడుకున్నాడు అయిలయ్య. తడికెలోంచి పాకలోనికి చొరబడుతున్న చలిగాలి సూదుల్లాగుచ్చుతూ శరీరాన్ని బాధిస్తోంది. ఎముకలు కొరికేసేలాంటి చలి గుండెల్ని వణకిస్తోంది.**

తట్టుకోలేక పోతున్నాడు అయిలయ్య. వజవజా వణుకుతున్నాడు. గజగజలాడుతున్నాడు.

కంటిమీద కునుకు రావటంలేదు. ఒకవేళ ఏ గంటకో, గడియకో, మాగన్నుగా నిద్రపడితే చాలు, చెవిలో జోరీగలా భార్య సణుగుడు వినిపిస్తూనే ఉంది.

గుడిసె బయట ఎలా వుందో, లోపలకూడా చలి అలాగే ఉంది. ఇక పడుకోవటం అసాధ్యం అనిపించింది. లేచి చిరిగిన తుండుగుడ్డ దులిపి, చెవులకు చుట్టుకున్నాడు. భార్య మాటలు చెవుల్లో పదేపదే వినవస్తూనే ఉన్నాయి.

మూలనున్న పార తీసుకుని, భుజానికేసికుని పాకలోంచి బయటకు నడిచాడు. పంచాయతీ వీధి లైటు మిణుకుమిణుకుమంటూ వెలుగుతోంది. ఆ వెలుతురులో మెల్లగా నడవసాగాడు. చలిగాలి మొహానికి కొడుతోంది. తమాయించుకుని ముందుకు సాగుతున్నాడు. కొంతదూరం నడిచాక, అతడు చేరవలసిన గమ్యం రానే వచ్చింది.

ఊరికి ఉత్తరాన ఉన్న శ్మశానం అది. కొద్ది క్షణాలు సంశయిస్తూ అక్కడే నిలబడిపోయాడు అయిలయ్య. ఎక్కడో కీచురాయి ఒకటి అదేపనిగా రొదపెడుతూనే ఉంది. చీకట్లో అస్పష్టంగా తెల్లగా అగుపిస్తున్నాయి గోరీలు. గుండె దిటవు చేసుకుని ముందుకు కదిలాడు. సమాధుల మధ్యనుండి నడుస్తూవుంటే కాళ్ల క్రింద ఎండుటాకులు, కర్రపుల్లలు, నలుగుతూ చిన్నగా శబ్దం చేయసాగాయి. అతడు ఓ సమాధి దగ్గర ఆగాడు. తనని ఎవరైనా గమనిస్తున్నారేమోనని పరిసరాలు పరికించాడు. ఆ నిర్జన నిశీధిలో ఎవరూ అగుపించలేదు.

అంతచలిలో బయటకెవరు వస్తారు? అందులోనూ వల్లకాడు ప్రదేశానికి ఎవరొస్తారు? అని చిన్నగా నిట్టూర్చాడు అయిలయ్య.

భుజమ్మీద పార చేతిలోకి తీసుకుని పని ప్రారంభించాడు.

నడుమువంచి పారతో మట్టితీసి పక్కనపోస్తూవుంటే క్రమంగా శరీరం వేడెక్కి చెమట పట్టసాగింది. చలి తీవ్రత కాస్త తగ్గినట్టనిపించింది. వారంరోజుల క్రితం ఖననం చేసిన సమాధిని ఆ చీకట్లో రహస్యంగా తవ్వుతున్నాడు అయిలయ్య.

***

అయిలయ్యది రెక్కాడితేనే గానీ డొక్కాడని బతుకు. దున్నటానికి పొలం లేదు. ఉండటానికి గజం స్థలం లేదు. రోజుకూలీ చేసుకుంటూ రోజులు నెట్టుకొస్తున్నాడు. కాలం గడిచిపోతోంది. చూస్తూ ఉండగానే ఒంటిమీదకు నలభయ్యేళ్ళు వచ్చేశాయి అయిలయ్యకు. పెళ్ళీ, పెటాకులు ఏమీలేవు. అయినా తన స్థితి తెలిసి కూడా పిల్లని ఎవరిస్తారు? ఇక ఈ జీవితం ఇంతే అని తరచుగా దిగాలు పడుతూ ఉండేవాడు. అలాంటి నిస్సహాయ, నిరుత్సాహ స్థితిలోనే మునెమ్మ అతడి జీవితంలోకి అడుగుపెట్టింది. మునెమ్మకు తనకు ఇరవయేళ్ళ తేడా. తనని ఏరికోరి పెండ్లాడింది. నడివయసుకు చేరిన తనని చేసుకుని ఏం సుఖపడుతుందోనని లోలోపల కలత పడుతూ ఉండేవాడు అయిలయ్య.

తన సుఖం మాట అటుంచి, నిరంతరం పెనిమిటిని సుఖపెట్టాలని తపించేది మునెమ్మ. ఉన్నంతలో కమ్మగా వండిపెట్టేది. పక్కపరిచేది. పక్కలో కొచ్చేది. శరీరాన్ని చల్లబరిచేది. గోరు వెచ్చని నీటితో స్నానం చేయిస్తూ వీపు తోమేది. ఇవన్నీ ఒక ఎత్తు అయితే, జీవితంమీద ఆశ కలిగించటం మరో ఎత్తు. మునెమ్మ రాకతో అయిలయ్య జీవితం సుఖ సంతోషాలకి నెలవు అయింది.

"మావాc.... ఇట్టా ఎంతకాలం అవస్థలు పడతాం, ఓ గూడు కట్టుకుందాం" అంది ఓ రోజున.

"ఎట్టా అవుద్ది? పైసలన్నీ పూట గడవటానికే సరిపోతా ఉన్నాయి?" అన్నాడు నిరుత్సాహంగా. "నేను కూడా కట్టపడతాను మావాc.... ఏదో యేన్నీళ్లకు చన్నీళ్ళసాయం... ఎక్కడైనా ఏ కాస్త సోట్టైనా కొను



**ఊరు నిదరోతోంది. ఆ నిశీథిని పార భుజానేసుకుని బయలుదేరాడు. అతడి గమ్యం శ్మశానం! ఎక్కడో కీచురాయి రొద. చీకట్లో అస్పష్టంగా కనిపిస్తున్న గోరీలమధ్య నడుస్తూ ఒకచోట ఆగి సమాధిని తవ్వడం ప్రారంభించాడు. కాసేపటికి పారకు శవపేటిక తగిలిన చప్పుడు వినిపించింది. శవపేటికమీద మట్టి తొలగించి మూతకున్న మేకుల్ని పారతో పెకిలించే ప్రయత్నం చేశాడతను. అంతలో ఊహించని సంఘటన...!**

క్కుందాం" అంది.

అయిలయ్య ఏదో అనబోయాడుగానీ, ఆమె పట్టుదల చూసి మౌనం వహించాడు.

అన్నట్టుగానే మునెమ్మ అక్కడా ఇక్కడా అప్పులు చేసి ఐదువేల రూపాయలకు ఓ స్థలం కొన్నది. అంతేకాదు మరికొంత అప్పు చేసి ఆ స్థలంలో చిన్న పూరిగుడిసె లాంటిది నిర్మించింది. దానిని చూసుకుని సొంతిల్లని మురిసిపోయేది. ఎంతో సంబరపడిపోయేది. మునెమ్మ సంబరం ఎంతోకాలం నిలువలేదు. పదివేల రూపాయల అప్పు మూడేళ్ళనాటికి పాతికవేలై కూర్చుంది. ఒకపూట తిని మరోపూట పస్తులున్నా కూడా బాకీలు తీరేవి కావు. ఇద్దరి కాయకష్టం వడ్డీలకే హరించుకుపోతూండేది. కష్టాలు చుట్టుముట్టేశాయి.

"మావాc....అదేదో గలుపుదేశమంట, ఆడికిపోతే మన కట్టాలన్నీ తీరిపోతాయి. ఊళ్లో సానామంది ఆడాళ్లు ఎల్తా ఉన్నారు. నేను కూడా ఎల్తే బాగుణ్ను..." అంది ఓసారి.

"ఆడికెళ్లి ఏం చేయాలట?" అమాయకంగా అడిగాడు అయిలయ్య.

"సేకు సాయిబుల ఇళ్లలో పనిచేయాలట. మామూలు పనే. ఇంటిని సుబ్రంగా ఉంచటం, వండిపెట్టడం ఇట్టాంటివి. సానా డబ్బులిస్తారట. నేనెళ్ళి వస్తేగానీ, బాధలు తీరవు. ఏవుంది రెండేండ్లు ఇట్టే గడిసిపోతాయి. అప్పులన్నీ తీరిపోతే ఆనక మనం సుకంగా ఉండొచ్చు"

అవుననటానికి కాదనటానికి పాలుపోవటంలేదు అయిలయ్యకు. పెనిమిటి మౌనాన్ని అంగీకారంగా భావించింది మునెమ్మ. ఎక్కడెక్కడికో తిరిగింది, ఎందరెందర్నో కలిసింది. ఎన్నెన్నో ఆఫీసుల మెట్లెక్కి ఎందరికాళ్లో పట్టుకుంది. అవసరమయ్యే కాగితాలు, గుర్తింపుకార్డు (పాస్‌పోర్టు)లు తయారయ్యాయి. డబ్బు సమకూర్చుకుని ఎట్టకేలకు విమానం ఎక్కటానికి బయల్దేరింది. తనకోసం ఎన్నో అవస్థలు పడుతున్న మునెమ్మని చూస్తావుంటే, దుఃఖం తన్నుకు రాసాగింది అయిలయ్యకు. ఆ బేలస్థితిలో తనని చూసి ఎక్కడ బెంగపెట్టుకుంటుందోనని తనను తాను తమాయించుకున్నాడు. నిగ్రహించుకున్నాడు. కానీ విమానం ఎక్కేముందు మునెమ్మని ఆపటం అతనివల్ల కాలేదు. భోరున విలపించింది.

"నిన్ను ఇడిసెళ్తన్నాను. ఎట్టా ఉంటావో ఏంటో" అని వలవలా ఏడ్చింది మునెమ్మ. ఉబుకుతున్న దుఃఖాన్ని పంటిబిగువునే అదిమిపెట్టుకుంటూ, గుండెదిటవు చేసుకుని నాలుగు ఓదార్పుమాటలు చెప్పి మునెమ్మని ఎలాగో సాగనంపాడు అయిలయ్య.

విమానం గాలిలోకి లేచింది. జవసత్వాలన్నీ కోల్పోయినట్లు చతికిలపడిపోయాడు అయిలయ్య. గుండె బరువు తగ్గేదాకా భోరున ఏడ్చాడు.

ఆర్నెల్లు గడిచాయి.

వారానికి ఒకసారి, స్కూలు మాస్టారుగారింటికి ఫోన్‌చేసి అయిలయ్యతో మాట్లాడుతూ ఉండేది మునెమ్మ. తనకిక్కడ బాగానే ఉందని, యజమాని మంచివాడేనని తనని బాగానే చూసుకుంటున్నారని తన గురించి బెంగపడవద్దని చెబుతూండేది. అంతే కాదు, ఆ ఊరి పోస్టు ఆఫీసుకి అయిలయ్య పేరున డబ్బు పంపిస్తూ ఉండేది. కొన్ని అప్పులు తీర్చేశాడు అయిలయ్య. మునెమ్మ చెంతలేదనే బాధ లోలోపలున్నా అప్పులు కాస్తోకూస్తో తీరుతా ఉన్నాయనే ఊరట, ఒకింత సంతోషపెడుతూ ఉండేది.

'ఏవిఁటో ఈ మాయదారి జీవితం రేయింబవళ్ళులాగా, అప్పటికే సుఖం, అప్పటికే కష్టం ఈ ఆటుపోట్లు, ఆటవిడుపులూ, మనిషన్నవాడిని వదలవు కాబోలు...' అప్పుడప్పుడు అనుకుంటూ ఉండేవాడు.

***

సమాధి తవ్వుతూనే ఉన్నాడు అయిలయ్య.

మట్టితీస్తున్న పారకి, శవపేటిక తగిలిన చప్పుడు వినిపించటంతో కాసేపు నిలబడి అలుపు తీర్చుకున్నాడు. ఇంకొక పావుగంట కష్టపడితే చాలు పెట్టె తెరిచేయొచ్చు. ముఖానికి పట్టిన చెమటను గుడ్డతో తుడుచుకున్నాడు.

కాసేపు సేదతీరాక, తిరిగి తవ్వడంలో నిమగ్నమయ్యాడు.

శవపేటికమీద మట్టినంతా తీసి మేకులు దిగ్గొట్టిన పైకప్పుని పారతో పెకిలించే ప్రయత్నం చేయసాగాడు అయిలయ్య.

సరిగ్గా అప్పుడు జరిగింది అతడు ఊహించని సంఘటన.

"రేయ్...ఎవడ్రా నువ్వు? ఏమి చేస్తున్నావ్ అక్కడ?" అంటూ గద్దిస్తూ కేక వినపడింది. ఆ నిర్జన నిశీధిలో ఒక్కసారిగా వినిపించిన ఆ కేకకి ఉలికిపడ్డాడు అయిలయ్య. తూలి శవపేటికమీద పడబోయి, తమాయించుకున్నాడు.

అయిపోయింది. అంతా అయిపోయింది. తన తప్పిదం బయట పడిపోయింది. ఇప్పుడిక ఏమిటి దారి?

భయపడుతూ అరుపు వినిపించినవైపు చూశాడు అయిలయ్య.

కాటికాపరి ఉరుముతూ ఉగ్రనేత్రాలతో చూస్తున్నాడు.

***

పంచాయతీ జరుగుతోంది.

ఊరిజనం అంతా అక్కడే ఉన్నారు.

దోషి అయిలయ్య చేతులు కట్టుకుని నిలబడ్డాడు.

విచారణ జరుగుతోంది.

"అయిలయ్యా, నువ్వు అర్ధరాత్రి శ్మశానంలో చేస్తున్నదేమిటి? అసలు దేనికోసం సమాధులు తవ్వుతున్నావు? శవాల్ని అమ్ముకుంటున్నావా? లేదా క్షుద్ర పూజలు చేస్తున్నావా? అలా అర్ధరాత్రీ అపరాత్రీ శ్మశానంలో శవపేటికలు తెరుస్తూ ఉంటే ఊరికి అరిష్టం కదా? అసలు నువ్వుచేస్తున్న పనేంటి? అదెంత నేరమో తెలుసా? పోలీసోళ్లని పిలిపించమంటావా? దీనికి నీ సమాధానం ఏమిటి?"

తీవ్రస్వరంతో అడుగుతున్నాడు ఓ పెద్దమనిషి.

అయిలయ్యకి నోరు పెగలటంలేదు. మాట రావటం లేదు. చేతుల్లో ముఖందాచుకుని వెక్కివెక్కి ఏడుస్తున్నాడు.

"నువ్వు జోరీగలా నా చెవిలో పోరుతూనే ఉన్నావు. నీ మాట ఆలకించబట్టే ఇప్పుడు అందరి ముందర నేను ఇలా తలొంచుకుని నిలబడ్డాను. ఇట్టాంటి బతుకు నా కెందుకు?"

ఎవరికీ అర్థం కాని ఏవేవో మాటలాడుతూ నెత్తి కొట్టుకుని మరీ రోదిస్తున్నాడు అయిలయ్య.

చుట్టూ ఉన్న జనమంతా విస్తుపోయి చూస్తున్నారు.

***

ఓసారి మునెమ్మ ఫోన్ చేసింది.

"మావాc...నాకిక్కడ గాలీ నీరు సరిపడటంలేదు. అస్తమానూ జొరం వచ్చేస్తా ఉంది యజమాని కుటుంబం కూడా సిరాకు పడతా ఉండారు. ఇమానం ఎక్కించేత్తామంటున్నారు" చెప్పింది దిగులుగా.

"మునీ.. వచ్చేయ్... కలోగంజో ఏదో ఒకటి ఈడనే తాగుదాం.. కాయకట్టం చేసుకుని మిగిలిన అప్పులు ఎలాగో తీర్చుకుందాం...నువ్వు బెంగెట్టుకోమాకు. బేగా వచ్చేయ్..." చెప్పాడు అయిలయ్య.

"అట్టాగే మావాc...నాక్కూడా నిన్ను సూడాలని పిస్తోంది. మన ఊరిని మన ఇంటిని చూసి ఎన్నాళ్లయిందో కదా... అట్టాగే వచ్చేత్తాను మావాc.."

రెండు వారాలు పోయేక మళ్లీ ఫోన్ చేసింది మునెమ్మ.

"మావాc.... ఇమానాలు ఎక్కేదగ్గరే ఉన్నాను.



మా యజమాని వచ్చి దిగబెట్టాడు. నీకు ఫోన్ చేయమని కూడా చెప్పాడు. ఎల్లుండి సాయంత్రానికల్లా మనూళ్లో ఉంటాను".

మునెమ్మ మాటలకు ఉక్కిరిబిక్కిరయ్యాడు అయిలయ్య. తన ముని వచ్చేస్తోంది. ఈ సంగతి ఇరుగు పొరుగు వారికే కాదు, ఎదురుపడ్డ ప్రతివాళ్ళకీ చెబుతూ సంబరపడిపోయాడు. పోన్లే... డబ్బుమాట ఎలా ఉన్నా తామిద్దరూ ఒకేచోట, ఒకేచూరు కింద గడపొచ్చు.

సాయంత్రం అవుతుంటే ఒళ్ళంతా కళ్ళు చేసుకుని రాబోయే పెండ్లాంగురించి ఎదురుచూస్తూ కూర్చున్నాడు అయిలయ్య.

మునెమ్మ రాలేదుగానీ,

పోలీసోళ్లతో పాటూ సర్పంచ్ వచ్చాడు అయిలయ్య ఇంటికి.

"అయిలయ్యా, గుండెదిటవు చేసుకుని నేను సెప్పేది విను. నీ భార్య మునెమ్మ విమానంలో బయల్దేరి వస్తూ, మధ్యలో ఓచోట విమానం మారేందుకు దిగింది. పాస్‌పోర్టు కాగితాలు పారేసుకుందట. అధికారులు ఆమెని నిర్బంధించి రకరకాలుగా ప్రశ్నించేసరికి బెదిరిపోయింది. జైల్లో పెట్టేస్తారేమోనని భయంతో గుండె పట్టుకుని కూలబడిపోయిందట. అక్కడే ప్రాణం విడిచింది. ఆ విమానం కంపెనీవాళ్ళు శవాన్ని పంపిస్తామన్నారు. మన పోలీసు స్టేషన్‌కి కబురొచ్చింది. రేపు ఉదయానికల్లా శవం వస్తుంది" చెప్పాడు సర్పంచ్ విచారంగా.

అయిలయ్య కుప్పకూలిపోయాడు.

తన ఆశాసౌధం కూలిపోయింది. వెలుగుల పంట తనని వదిలెళ్ళిపోయింది. జీవితం చీకటిమయమైపోయింది.

బయల్దేరేటప్పుడు "నిన్ను ఇడిసి ఎల్లిపోతన్నాను. ఎట్టా ఉంటావో ఏంటో?" అని వలవలమని కన్నీరు మున్నీరైన మునెమ్మ రూపమే అయిలయ్య కళ్ళముందు కదలాడుతాంది. గుండెని కెలుకతాంది. మరుసటి రోజు దేవదారుచెక్కతో చేసిన అందమైన శవపేటికలో మృతదేహం వచ్చింది. అయిలయ్యని ఆపటం ఎవరివల్లా కాలేదు.

గుండె పగిలేలా రోదించాడు.

మునెమ్మ ప్రాణంలేని కట్టె అయితే, ప్రాణమున్న కట్టెగా మిగిలాడు అయిలయ్య.

అంత్యక్రియలు జరిగి అప్పటికి మూడురోజులు కావొస్తున్నాయి.

అయిలయ్య, పాకలో మాగన్నుగా నిదరోతున్నాడు.

"మావాc...ఓ మావాc....నీ మునిని...." ఎక్కడో దిగంతాలనుండి వినిపిస్తోంది మునెమ్మ గొంతు.

"పోయే...నీతో మాట్లాడను. నాకన్యాయం చేసి వెళ్లావుటే.."

"నేనెక్కడకు పోయాను మావాc...నీ చుట్టూనే ఉన్నాను".

"పోయే... పరేషాన్ మాట్లాడకు"

"మావా... నేనొకటి సెబుతాను ఇంటావా?"

"సెప్పు... ఏవిటో.."

"అట్టా సలిలో వణుకుతూ ఉండటం ఎందుకూ, శవపేటిక చెక్క మంచిగా ఉంది, తడికె తీసేసి, గుడిసెకి తలుపుగా వేసుకో మావాc..."

"అయ్యో... ఇప్పుడుగూడా నా గురించి ఆలోచిస్తా ఉన్నావ్... మరి నువ్వెట్టా ఉంటావే...."

"నేను మట్టిలో మట్టినై కలిసిపోయే దాన్నేగా... నా గురించి దిగులెందుకు? నామాట విని శవపేటిక తీసి వాడుకో.."

"ఏంటోనే... నువ్వేటి సెబుతా ఉన్నావో, నానేటి సెయ్యాలో, నాకేవీc బోధ పడటంలేదు. అంతా అయోమయంగా ఉంది".

"నేను సెప్పినట్లు సెయ్యి మావాc... గుడిసెలో వెచ్చగా ఉంటాది. కాసేపైనా కంటినిండా కునుకుపడతాది.. లే.. లేచి పొర తీసుకో.."

చప్పున మెలకువ వచ్చింది అయిలయ్యకు.

కల....? కాదు నిజం లాగే ఉంది.

కల లాంటి నిజం... నిజం లాంటి కల...

ఎంత స్పష్టంగా మాట్లాడింది మునెమ్మ.

ఆరోజు మాత్రమే కాదు. ప్రతీరోజూ అయిలయ్య చెవిలో మునెమ్మ రొద పెడుతూనే ఉంది.

***

చేతుల్లో ముఖం దాచుకుని రోదిస్తున్నాడు అయిలయ్య.

"బావూ....అది బావూ జరిగింది...మీరు నమ్మినా నమ్మకపోయినా జరిగిందదే బావూ... సచ్చికూడా నా సుకం గురించే తపిస్తాంది బావూ నా ఎర్రి బాగుల్ది... నా పెండ్లాం పడుకుని నిదరోతున్న పెట్టెతెరచి, చెక్క తీసి, పాకకి తలుపు చేసుకుందామనే ఎళ్ళానుగానీ, మీరనుకున్నట్టు శవాల్ని అమ్ముకోటానికో, సేతబడులు సేయటానికో కాదుబావూ...నన్ను నమ్మండి బావూ... నా పెండ్లాం సమాధి మాత్రమే తవ్వాను. నన్ను నమ్మండి.."

వెక్కుతూ విలపిస్తున్నాడు అయిలయ్య.

పంచాయతీ జరుగుతున్న ఆ ప్రదేశమంతా నిశ్శబ్దం తాండవించింది.

అంతా స్థాణువైపోయారు.

పంచాయతీ అంతటితో ముగిసింది.

***

ఆ రాత్రి సర్పంచ్‌కు నిదుర దూరమైపోయింది.

శవాన్ని సరైన చిరునామాకి పంపిన సిబ్బంది, ప్రాణమున్న మనిషిని ఎందుకు పంపలేకపోయారు? బోర్డింగ్‌పాస్ చెక్ చేస్తే టిక్కెట్ వివరాలు తెలుస్తాయి కదా. ఆమె ఏ దేశానికి చెందిన మనిషో, ఏ ప్రాంతానికి వెళ్ళాలో తెలుస్తాయి కదా! అధికారుల అశ్రద్ధా? ఉదాసీనవైఖరా? లేదా కఠినమైన నిబంధనలా? ఏదైతే అవనీ, మొత్తానికి ఓ నిండు ప్రాణాన్ని బలిగొన్నారు.

అయిలయ్య, తన భార్య సమాధిని తవ్వితే ఊరికి అరిష్టమనే విషయం కొందరు లేవనెత్తారు. కానీ చిన్న తలుపుచెక్కకోసం భార్య సమాధి తవ్వుకున్న తమ ఊరి అభాగ్యుడి సంగతి చుట్టుపక్కల ఊళ్ళల్లో అందరికీ తెలిస్తే తమ పంచాయతీకి ఎంత అప్రతిష్ట. పాక తలుపు విషయం పెద్ద సమస్యేమీ కాదు. పాలకవర్గసభ్యులంతా తలో పాతికరూపాయిలిస్తే అయిలయ్య తలుపు సమస్య తీరిపోతుంది.

విమానం కంపెనీవాళ్ళు లక్షరూపాయలు నష్టపరిహారం ఇచ్చేసి చేతులు దులిపేసుకున్నారు. ఆ సొమ్ము నేరుగా ప్రభుత్వ ఖజానానికి జమ అయింది. దానిని అయిలయ్యకి ఇవ్వాలంటే ఏభైవేల రూపాయలు లంచం అడుగుతున్నారు సంబంధిత అధికారులు. ఆ సొమ్ము లంచాల పాలవకుండా ఆ మొత్తం అయిలయ్యకు అందేట్టు చూడాలి. ఈ విషయంలో తను గట్టిగా నిలబడి పోరాడాలి.

ఊరిలో ఇంతటి దయనీయస్థితిలో ఉన్న అయిలయ్యలాంటివాళ్ళ గురించి ఇంతదాకా తనెందుకు దృష్టిపెట్టలేదు? ఆలోచిస్తున్నాడు సర్పంచ్.

రేయి నడుస్తా ఉంది, వేకువ వైపు....

సెల్: 9885139993

## తాళిబంధం




అమ్మ ఒడిని వదిలి
అరక్షణం వుండలేననుకున్నా !

నాన్న చేయి విడిచి
ఏ క్షణమూ మనలేననుకున్నా !



పుట్టిల్లును పూలతోటను
ఏనాడూ వదలననుకున్నా !

అన్నల అనురాగపు ఆదరణను
చెల్లెళ్ళ చిలిపిచేష్టలను మరవననుకున్నా!

ఇరవైవసంతాలు పెనవేసుకున్న
స్నేహితుల చెలిమి వీడి బతకననుకున్నా !

పుట్టింటి నుండి మెట్టింటికి
ఏడుస్తూ వీడుకోలిచ్చా ఆక్షణంలో !

మరి నేడు మెడలో నీవేసిన
తాళితో తక్కినవారందరినీ మరచా !

నా గుండె సడి నువ్వే
నా మెట్టెల సవ్వడి నువ్వే !

నా సిరిమువ్వల స్వరనాదం నువ్వే
నా పంచప్రాణాలు నీవే ప్రియమైన శ్రీవారు!

–సురేంద్రరొడ్డ
సెల్: 9491523570

# సౌభాగ్య చక్రం

జూలై 26 నుంచి
ఆగస్టు 1 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



## మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, పొదుపుపథకాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. ప్రియతములతో విందుల్లో పాల్గొంటారు. 28, 29 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. ప్రేమానుబంధాలు బలపడతాయి. చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 30, 31, 1 తేదీల్లో ప్రియతముల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. ఖర్చులు అంచనాలు మించుతాయి. విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు. పొదుపు పథకాలు లాభిస్తాయి.

## వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)



వృత్తి, వ్యాపారాలు, వేడుకలు, ప్రేమానుబంధాలు, పెట్టుబడులకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో విద్యా సంస్థల్లో ప్రవేశానికి అనుకూలం. ఇంట్లో వేడుకలకు ఏర్పాట్లు చేస్తారు. 28, 29 తేదీల్లో బదిలీలు, ఇల్లు మార్పునకు అనుకూలం. విందు వినోదాల్లో పాల్గొంటారు. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తిచేస్తారు. పరిశ్రమలు, హోటల్స్, రియల్ ఎస్టేట్ రంగాల వారికి శుభప్రదం. 30, 31, 1 తేదీల్లో వేడుకల్లో ఉల్లాసంగా పాల్గొంటారు. జనసంబంధాలు విస్తరిస్తాయి. ఖర్చులు అధికం. భాగస్వామి వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.

## మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)



విద్య, వృత్తి, వ్యాపారాలు, వేడుకలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో బదిలీలు, మార్పులకు సంబంధించిన సమాచారం అందుకుంటారు. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లకు అనుకూల సమయం. 28, 29 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రియతములతో ఉల్లాసంగా గడుపుతారు. పొదుపు పథకాలు లాభిస్తాయి. విద్యాసంస్థలు, చిట్‌ఫండ్ రంగాల వారికి శుభప్రదం. 30, 31, 1తేదీల్లో కమ్యూనికేషన్లు, హోటల్, వైద్య రంగాల వారికి ప్రోత్సాహకరం. వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. వృత్తిపరమైన సమావేశాల్లో పాల్గొంటారు.

## కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)



పెట్టుబడులు, షాపింగ్, కుటుంబ విషయాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో చెక్కులు, విలువైన పత్రాలు అందుకుంటారు. రవాణా, బోధన, కమ్యూనికేషన్ రంగాల వారికి శుభప్రదం. 28, 29 తేదీల్లో నిర్మాణం, రియల్ ఎస్టేట్ రంగాలవారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. కుటుంబ సభ్యుల సహకారంతో ఆర్థిక విషయాల్లో లక్ష్యాలు సాధిస్తారు. 30, 31, 1తేదీల్లో చిన్నారులు ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక వ్యవహారాల్లో ఆచితూచి ముందడుగువేయాలి. ఖర్చులు అధికం.



## సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, షాపింగ్, విద్యా విషయాలు, బదిలీలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. ఆర్థిక విషయాల్లో కీలక నిర్ణయాలు తీసుకుంటారు. అదనపు ఆదాయం లభిస్తుంది. 28, 29 తేదీల్లో విద్యార్థులకు శుభప్రదం. ప్రయాణాలు ఉల్లాసం కలిగిస్తాయి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. 30, 31, 1 తేదీల్లో గృహనిర్మాణం, రియల్ ఎస్టేట్ రంగాలవారు కీలక నిర్ణయాలు తీసుకుంటారు. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. కుటుంబ వ్యవహారాలు మనస్తాపం కలిగిస్తాయి. బదిలీ ప్రయత్నాలు ఫలించకపోవచ్చు.



## కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)

విద్య, దూరప్రయాణాలు, విద్యావిషయాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో సమీక్షలు, సంస్కరణలకు అనుకూలం. ఒత్తిళ్లు తొలగిపోయి మనసుకు సాంత్వన లభిస్తుంది. చేపట్టిన పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. 28, 29 తేదీల్లో సినీ, రాజకీయ రంగాలు, ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. దీర్ఘకాలిక పెట్టుబడులు లాభిస్తాయి. 30, 31, 1 తేదీల్లో వాహనాల కొనుగోలుకు, ప్రయాణాలకు అనుకూలం. ఒక సమాచారం కలవరం కలిగిస్తుంది. విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి.



## తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)

పెట్టుబడులు, సమావేశాలు, వేడుకలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో సినీ, రాజకీయరంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. సమావేశాలు, బృందకార్యక్రమాల్లో మీ అనుభవానికి గుర్తింపు లభిస్తుంది. 28, 29 తేదీల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. వేడుకల్లో పాల్గొంటారు. స్నేహానుబంధాలు విస్తరిస్తాయి. సమావేశాలు, బృంద కార్యక్రమాల్లో కీలకపాత్ర పోషిస్తారు. 30, 31, 1 తేదీల్లో పెట్టుబడులు పొదుపు పథకాలపై దృష్టి సారిస్తారు. ఖర్చులు అంచనాలు మించుతాయి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు.



## వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)

వృత్తి, వ్యాపారాలు, ఇంటర్వ్యూలు, ఆర్థిక విషయాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారపరమైన సమావేశాలు లాభిస్తాయి. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరంగా ఉంటుంది. గౌరవ, మన్ననలు అందుకుంటారు. 28, 29 తేదీల్లో ప్రముఖులను కలుసుకుంటారు. వాయిదా పడుతున్న పట్టుదలతో పనులు పూర్తి చేస్తారు. గౌరవ పదవులు లభిస్తాయి. రాజకీయ, సినీరంగాల వారికి ప్రోత్సాహకరంగా ఉంటుంది. 30, 31, 1 తేదీల్లో కొత్త పనుల ప్రారంభించేందుకు సన్నాహాలు చేసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో ఒత్తిడి అధికం. పెద్దల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.



## ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)

విద్య, పెట్టుబడులు, ప్రయాణాలు, సమావేశాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. గౌరవ పదవులు అందుకుంటారు. 28, 29 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సమావేశాల్లో ప్రముఖులను కలుసుకుంటారు. ప్రణాళికాబద్ధంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. 30, 31, 1 తేదీల్లో ప్రయాణాలు, చర్చలు ఫలిస్తాయి. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాల్లో లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. బంధుమిత్రుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.



## మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)

ఆర్థిక వ్యవహారాలు, వేడుకలు, క్రయవిక్రయాలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురువారాల్లో విద్యకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఆర్థిక విషయాల్లో మీ వ్యూహాలు ఫలిస్తాయి. 28, 29 తేదీల్లో పెద్దల ఆరోగ్యం మెరుగుపడుతుంది. ఆర్థికంగా ప్రోత్సాహకరం. గత అనుభవంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. పెన్షన్, పన్నుల వ్యవహారాలకు అనుకూలం. 30, 31, 1 తేదీల్లో సన్నిహితుల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపుతారు. క్రయవిక్రయాలకు అనుకూలం. ఖర్చులు అంచనాలు మించుతాయి. రుణప్రయత్నాలు ఫలించకపోవచ్చు.



## కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)

కుటుంబ వ్యవహారాలు, స్పెక్యులేషన్లు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులు లాభిస్తాయి. షాపింగ్ ఉల్లాసం కలిగిస్తుంది. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 28, 29 తేదీల్లో బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు. సమావేశాలు లాభిస్తాయి. న్యాయ, బోధన, రక్షణరంగాల వారికి ప్రోత్సాహకరం. 30, 31, 1 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో భాగస్వామి సహకారం అందుకుంటారు. గౌరవ, మర్యాదలకు భంగం కలిగే ప్రమాదం ఉంది. పైఅధికారుల వైఖరి మనస్తాపం కలిగిస్తుంది.



## మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)

ఇంటర్వ్యూలు, సమావేశాలు, వేడుకలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో భాగస్వామి సహకారంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. శ్రీవారు, శ్రీమతి ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపుతారు. 28, 29 తేదీల్లో వైద్యం, పరిశ్రమల రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. గత అనుభవంతో వృత్తి, వ్యాపారాల్లో లక్ష్యాలు సాధిస్తారు. 30, 31, 1 తేదీల్లో వృత్తిపరమైన ప్రయాణాలు, సమావేశాలు ఫలిస్తాయి. సంకల్పసిద్ధి కోసం అధికంగా శ్రమించాలి. బంధుమిత్రుల ఆరోగ్యం కలవరపెడుతుంది.



## ఆమె ముఖ్యం అట!

రణబీర్‌తో కటీఫ్ చెప్పేసిన తరువాత కత్రినా మాజీ ప్రియుడు సల్మాన్‌తో జత కట్టిన సంగతి తెలిసిందే! ఏదో ఇద్దరు పాత ప్రేమికులు మళ్ళీ కలుసుకున్నారని అందరూ అనుకుంటున్నా వీరి ఇద్దరి వ్యవహారం ముదిరి పాకాన పడిందంటున్నారు బాలీవుడ్ జనాలు. ఈ ప్రపంచంలో తనకు కత్రినా కన్నా ముఖ్యమైన వ్యక్తి ఎవరూ లేరంటూ సల్మాన్ ఓపెన్‌గా చెప్పడం అందరినీ విస్మయానికి గురి చేసింది. ఇంతకీ అసలు జరిగినదేమిటంటే...ఓ ప్రెస్‌మీట్లో సల్మాన్‌కి ఉన్నట్టుండి కత్రినా బర్త్‌డే గుర్తుకొచ్చింది. దాంతో తనతో పాటు అందరూ కత్రినాకి జన్మదిన శుభాకాంక్షలు చెబుతూ పాట పాడాలని కోరాడట! నిజంగానే ఆ రోజు కత్రినా పుట్టినరోజట! ఇంతకీ మీ పుట్టినరోజు ఎప్పుడని కొందరు సల్మాన్‌ని ప్రశ్నించగా, తనకు ఈ ప్రపంచంలో అందరి కన్నా ముఖ్యమైన వ్యక్తి కత్రినా అనీ, ఆమెకు సంబంధించిన సంగతులే గుర్తు ఉంటాయి తప్ప తన విషయాలు కూడా తనకు గుర్తుండవు అని చెప్పుకొచ్చాడు.

## రాజమౌళి మాటలు నమ్మకూడదంటున్నారు

రాజమౌళి తన సినిమాల కన్నా కూడా ఇతరుల సినిమాల గురించే ఎక్కువగా చెబుతుంటాడు. పొగుడుతుంటాడు. ట్వీట్ చేస్తుంటాడు. అందుకే ఏ సినిమా గురించి అయినా ఆయన నోటినుంచి ఒక్క మాట వచ్చినా ప్రేక్షకులు వెంటనే నమ్మేస్తుంటారు. ఇటీవల ఓ సినిమా గురించి రాజమౌళి ట్వీట్ చేశాడు. చాలా మంచి సినిమా అంటూ ఆకాశానికి ఎత్తేశాడు. ఆయన ట్వీట్ చూసి మోసపోయిన కొందరు సినిమాకి వెడితే లేని తలనొప్పి తెచ్చుకున్నట్టయిందని బాధపడ్డారట! ఇదే విషయాన్ని వాళ్ళు ట్విటర్ ద్వారా రాజమౌళికి తెలియజేస్తూ ఏ సినిమా గురించి అయినా ట్వీట్ చేసేటప్పుడు కాస్త ప్రేక్షకులను గుర్తుంచుకోవాలని సున్నితంగానే హెచ్చరించారు.



## రాజుగారి కోతలు షురూ!



కోతలంటే పంటకోతలు కాదు. సినిమా కోతలు. దిల్‌రాజుగారి సినిమా అంటే ప్రేక్షకులకు ఎంతో నమ్మకముంటుంది. ఆయన నుంచి మంచి కుటుంబ కథా చిత్రాలు వస్తాయన్నది చాలామంది నమ్మకం. ఆయన సినిమాలో అనవసర సన్నివేశాలుకానీ, సాగతీతలుకానీ ఉండవు అన్నది జగమెరిగిన సత్యం. తన ప్రతి సినిమాకు ఎంతో కొంత కత్తెర వేసే బయటకు పంపిస్తూ ఉంటారు దిల్‌రాజు. ఇప్పుడు 'ఫిదా' కూడా కత్తెర వేస్తున్నారట! ఇరవైనిమిషాలకు పైగా సినిమాలోని సన్నివేశాలకు కత్తెర వేయనున్నారట! దీనికి దర్శకుడు శేఖర్ కమ్ముల కూడా ఓకే అన్నారట! ఎలాగైనా ఈ సారి ఫిదాతో హిట్ కొట్టాలన్నదే శేఖర్ కమ్ముల ఉద్దేశంగా చెబుతున్నారు. ఇందుకోసం రాజుగారు ఎన్ని కత్తెర్లు వేసినా ఆనందమే అన్నది ఆ దర్శకుడి మాట!

## ఆమెతో చేయనంటున్నాడు

ఈ మాటలు అన్నది దర్శకుడు కృష్ణవంశీ. తన భార్య రమ్యకృష్ణను ఉద్దేశించి ఈ మాటలు అన్నాడు. శివగామిగా ఎంతో మందిని మెప్పించిన రమ్యను తన సినిమాల్లోకి తీసుకోవడం సాధ్యం కాదంటూ తేల్చేశాడు. కుటుంబ అనుబంధాల కారణంగా ఆమెను తను డైరెక్ట్ చేయలేనని చెప్పుకొచ్చాడు. అలాగని రమ్యకృష్ణ గొప్ప నటి కాదని అనుకోకూడదని, దక్షిణాదిలో ఉన్న ప్రతిభావంతులైన నటులలో తన పేరు తప్పకుండా ఉంటుందని కితాబిచ్చాడు. రమ్యకృష్ణతో సినిమాలు చేయనని అంటూంటే తామిద్దరం విడిపోయామని ప్రచారం చేస్తున్నారనీ, అలాంటివి విన్నప్పుడు ఇద్దరం సరదాగా నవ్వుకుంటామనీ చెబుతున్నాడు. ఇటీవలి కాలంలో షూటింగుల కారణంగా భార్యతోనూ, కొడుకుతోనూ ఎక్కువ సేపు గడపలేకపోతున్నానని అంటున్నాడు.



# తొందరేం లేదు

## -రకూల్‌ప్రీత్‌సింగ్

**టాలీవుడ్‌లో పాగా వేసేందుకు 'వెంకటాద్రి ఎక్స్‌ప్రెస్' ఎక్కిన రకూల్‌ప్రీత్ సింగ్ ఇక ఆ తరువాత వెనుతిరిగి చూసు కోలేదు. తెలుగులో దాదాపు అందరు టాప్ స్టార్లతోనూ నటించి తన ఎక్స్‌ప్రెస్‌కి స్పీడు తప్ప బ్రేకుల్లేవని నిరూపించుకుంది. ఇప్పటి వరకూ టాలీవుడ్ మీదే దృష్టిసారించిన రకూల్ కోలీవుడ్, బాలీవుడ్‌లో పాగా వేయాలని డిసైడ్ అయింది. తెలుగు, తమిళం, హిందీ భాషలలో వరుస పెట్టి సినిమాలు చేస్తున్న రకూల్‌తో....**



**మూడు భాషల్లో వరుస సినిమాలు చేస్తూ బిజీగా ఉన్నట్టున్నారు?**

ఇప్పుడు కొత్తగా అంగీకరించిన సినిమాలు కాదు. కొద్దికాలం క్రితమే ఆ సినిమాలను ఒప్పుకున్నాను. కానీ రెండు మూడు సినిమాలు ఒకేసారి మొదలయ్యాయి అంతే!

**చిన్న హీరోలు, పెద్ద హీరోలు అన్న తేడా లేకుండా అందరితో జత కడుతున్నట్టున్నారు?**

నాకు అలాంటి పట్టింపులేవీ లేవు. కథ వినేటప్పుడు చిన్న హీరోనా? పెద్ద హీరోనా? లేదా పెద్ద బ్యానరా? చిన్న బ్యానరా? అన్నది చూడను. కథ ఎలా ఉంది? అందులో నా పాత్ర ఏమిటి? ఆ పాత్రలో నన్ను ప్రేక్షకులు ఆదరిస్తారా? లేదా? అనే విషయాలు మాత్రమే చూస్తాను. అందుకే అందరు హీరోలతోనూ చేయగలుగుతున్నాను.

**ఉత్తరాది అమ్మాయి అయి ఉండి తెలుగులో చేసినంత స్పీడుగా బాలీవుడ్‌లో చేయకపోవడానికి కారణం?**

చెప్పానుగా...నాకు కథ ముఖ్యం తప్ప సంఖ్య కాదు. అయినా బాలీవుడ్‌లో వెంట వెంటనే సినిమాలు చేసేయాలన్న తొందరేం లేదు. మూడు నాలుగు సంవత్సరాల విరామం తరువాత అక్కడ సినిమా చేస్తున్నాను. ఆ సినిమా రిజల్ట్‌ని బట్టి అక్కడ సినిమాలు ఒప్పుకుంటాను. బాలీవుడ్‌లో నేను ఇప్పుడు చేస్తున్న సినిమా సూపర్‌డూపర్ హిట్ అయినా దక్షిణాది రంగాన్ని మాత్రం విడిచిపెట్టను. ఇక్కడి సినిమాల తరువాతనే బాలీవుడ్‌కి ప్రాధాన్యం ఇస్తాను.

**బాలీవుడ్‌లో చేస్తే దేశవ్యాప్తంగా గుర్తింపు వస్తుందంటారు కదా?**

ఒకప్పుడు నటీనటులు ఏ భాషలో చేస్తే ఆ భాషకే పరిమితమయ్యేవారు. టీవీలు, సోషల్ మీడియా ఇంతగా అభివృద్ధి చెందని సమయంలో పరభాషానటుల గురించి తక్కువగా తెలిసేది. ఇప్పుడు ఆ బాధ లేదు. ఏ భాషలో ఏ సినిమా హిట్టయింది.... హీరో హీరోయిన్లు ఎలా చేశారు? అన్న విషయాలు అన్నీ సినిమా విడుదలైన వెంటనే బయటకు వచ్చేస్తున్నాయి. దేశవ్యాప్తంగానే కాదు, కొన్నిసార్లు ప్రపంచ వ్యాప్తంగా కూడా మనవారి గురించి అందరికీ తెలిసిపోతోంది. ఏ భాషలో చేసినా మనకు రావలసిన గుర్తింపు తప్పక వస్తుంది.

**మిమ్మల్ని లక్కీ హీరోయిన్, గోల్డెన్ లెగ్ అంటూంటే ఎలా అనిపిస్తుంది?**

ఇలాంటి బిరుదులు విన్నప్పుడు సంతోషం కన్నా భయం ఎక్కువగా ఉంటుంది. సినిమాల్లో ఎవరూ లక్కీ కాదు. ఎవరిదీ గోల్డెన్ లెగ్, ఐరన్ లెగ్ కాదు. సినిమా బాగా రావడం అనేది అందరి కృషి మీద ఆధారపడి ఉంటుంది. కేవలం హీరో హీరోయిన్ల మీద ఉండదు. సో...అలాంటి బిరుదులు నాకు సరిపోవు. నేను మామూలు హీరోయిన్‌ని మాత్రమే! ప్రేక్షకులు ఆదరించినంత కాలం సినిమాలు చేస్తాను. అవకాశాలు వస్తుంటాయి. వారు పొమ్మంటే తెర మరుగు

కావడమే!

**రకూల్ నిర్మాతగా మారే అవకాశం ఉంది అంటున్నారు. ఎంత వరకు నిజం?**

ఆ కోరిక అయితే ఉంది. అది ఎంత వరకూ నెరవేరుతుందో చెప్పలేను. బాలీవుడ్‌లో అనుష్క శర్మ లాగా మంచి మంచి సినిమాలు తీయాలని ఉంది. కానీ అదిప్పుడే సాధ్యం కాకపోవచ్చు. అసలు ఎప్పటికీ కుదరదేమో! సినిమా అంటేనే రిస్కీ వ్యాపారం. అంత రిస్క్ నేను చేయలేను. దానికి మా ఫ్యామిలీ కూడా ఒప్పుకోదు. సో... నన్ను హీరోయిన్‌గానే గుర్తు పెట్టుకుంటారు తప్ప నిర్మాతగా గుర్తు పెట్టుకోలేరు.

**ప్రేమ... పెళ్ళి గురించి....**

నాకు లవ్ మ్యారేజ్ అంటే ఇష్టం. కానీ నాకు ఇంత వరకూ లవర్ లేరు. నా జీవితంలోకి ఓ రాజకుమారుడు వస్తాడని నా గట్టి నమ్మకం. అలాంటి రాజకుమారుడు తారసపడితే తప్పకుండా ప్రేమించే పెళ్ళి చేసుకుంటాను. ఈ విషయంలో మా ఫ్యామిలీ నాకు అండగా నిలబడుతుందని నా నమ్మకం. చూడాలి... భవిష్యత్తులో ఏం జరుగుతుందో ఇప్పుడే ఊహించడం కష్టం కదా!

**మీ ఫ్యామిలీ చాలా స్ట్రిక్ట్ అని చెప్పారు కదా? లవ్ మ్యారేజీకి ఒప్పుకుంటారా?**

మా ఫ్యామిలీ చాలా స్ట్రిక్ట్. నన్ను గారాబంగా పెంచకపోయినా, నా అభిప్రాయాలకు గౌరవం ఇస్తారు. ఏ పనైనా బాగా ఆలోచించి చేస్తానన్నది వారి నమ్మకం. ఇంత వరకూ వారి నమ్మకాన్ని వమ్ము చేయలేదు. నా లైఫ్ పార్టనర్ విషయంలో వారి నమ్మకానికి తగినట్టే నడుచుకుంటాను. నచ్చిన వ్యక్తి కనపడితే వారిని ఒప్పించి మరీ పెళ్ళి చేసుకుంటాను. చెప్పాను కదా....ఇదంతా ఓ దీర్ఘ ప్రణాళిక. అమలు కావడానికి చాలా సమయం పడుతుంది.



**కోలీవుడ్‌లో మీరు చేస్తున్న సినిమా గురించి....**

కార్తీతో చేయబోతున్నాను. ఇదో కొత్త తరహా సబ్జెక్ట్. ఇందులో నా డ్రెస్ కూడా కొత్తగా ఉంటుంది. సినిమా బాగా వచ్చిందని యూనిట్ అంటోంది. విజయ్‌గారితో సినిమా చేసే అవకాశం ఉంది.

**అక్కడ సినిమాలు అంగీకరించారా?**

కథలయితే వినడం జరిగింది కానీ, వేటికీ ఓకే చెప్పలేదు. రెండు మూడు పెద్ద బ్యానర్లకు ఓకే చెప్పాలి.

**శాండిల్‌వుడ్‌లో చేయడం లేదా?**

నా కెరీర్ ప్రారంభం అయిందే అక్కడ. నా బ్యాడ్‌లక్. నా మొదటి సినిమా అక్కడ ఫ్లాప్ టాక్ తెచ్చుకోవడంతో పెద్దగా అవకాశాలు రాలేదు. తెలుగులో రావడంతో ఇటువైపు వచ్చేశాను. వీలైనంత త్వరలో అక్కడ ఓ సినిమా చేయాలని ఉంది. చేస్తాను కూడా!



**మీ సినిమా వందకోట్లు వసూలు చేయలేదని బాధ పడిన సందర్భం?**

సినిమాలు వంద కోట్లు వసూలు చేశాయంటే గొప్ప సినిమా అన్నదే కారణం కాదు. దానికి బోలెడు కారణాలుంటాయి. ఇప్పుడు సినిమాను చాలా థియేటర్లలో విడుదల చేస్తున్నారు. టికెట్‌రేటు కూడా పెరిగింది. వీటికి తోడు సినిమా బాగుండడం. ఇన్ని కారణాలు కలిసి వస్తాయి. నా రాబోయే సినిమాలు కచ్చితంగా ఈ మార్కును అందుకుంటాయని అనుకుంటున్నాను.

**వెండితెర మీద లిప్‌లాక్‌లు, గ్లామర్‌గా కనిపించడం గురించి....**

లిప్‌లాక్‌లకు ఎలాంటి అభ్యంతరమూ లేదు. కథకు అనుగుణంగా వచ్చే సీన్లకు ఎప్పుడూ అభ్యంతరం చెప్పను. కాకపోతే సినిమా పబ్లిసిటీ కోసం లిప్‌లాక్ సీన్లు చేయమంటే మాత్రం చేయను. ఇక గ్లామరంటారా....సినిమా అంటేనే గ్లామర్ ప్రపంచం. ఇక్కడ అందంగా గ్లామర్‌గా కనిపించడం తప్పు కాదు. అవసరం కూడా!

**సోషల్ మీడియా ఫాలో అయ్యేటట్టున్నారు?**

తప్పదు. మన గురించి ఇతరులు ఏమనుకుంటున్నారో తెలుసుకోవాలంటే సోషల్ మీడియా ఒక్కటే ఆధారం. నా గురించి ఎవరూ నా ముఖం మీదే చెప్పరు కదా? వారి అభిప్రాయాలను సోషల్ మీడియాతో పంచుకుంటారు. అందులో నా మంచిచెడులు రెండూ ఉంటాయి. నాకు తెలియని చెడు గురించి తెలుసుకుని సరిదిద్దుకోవడం తప్పుకాదు కదా? ప్రతి వ్యక్తికి అది అవసరం. కాకపోతే సోషల్ మీడియా వల్ల మంచి కన్నా చెడే ఎక్కువగా జరుగుతోంది. ఈ విషయంలో యువత కాస్త జాగ్రత్తగానే ఉండాలి.

**–స్పందన రెడ్డి**



ఇంటర్వ్యూ

# నా మొదటి ప్రయారిటీ దానికే!

**-ఆదిత్య మీనన్**

**గతంలో సినిమాలో విలన్లు ఒడ్డు పొడుగుతో, గళ్ళ లుంగీ, బుగ్గన గాటు, ఎర్రని కళ్ళతో చూడగానే భయం పుట్టించే రూపంతో ఉండేవారు. ఇప్పుడు ట్రెండ్ మారింది. ఇప్పుడంతా స్టయిలిష్ విలన్లదే రాజ్యం. గతంలో లాగా కరడుగట్టిన విలన్లు ఇప్పుడు కనిపించడం లేదు. ఇప్పుడు వారు విలనిజం చేస్తూనే సాఫ్ట్‌గా కనిపిస్తున్నారు. ఈ ఉపోద్ఘాతం అంతా ఆదిత్య మీనన్ గురించే.... దక్షిణాదిన ఉన్న మంచి విలన్లలో ఆదిత్య గురించి ముందుగా చెప్పుకోవాలి. బుల్లి తెర నుంచి వెండితెరకు సాగిన అతడి సినీ ప్రస్థానం గురించి అతడి మాటల్లోనే.....**

**నా గురించి చెప్పాలంటే....**

మా కుటుంబానికి సినీ రంగానికి పెద్దగా సంబంధం లేదు. ముంబయిలో పుట్టాను. నేను పుట్టిన తరువాత మా కుటుంబం దుబాయి వెళ్ళింది. నాకు పద్దెనిమిది సంవత్సరాలు వచ్చేవరకూ అక్కడే ఉన్నాము. నా ప్లస్ టూ అక్కడే పూర్త యింది. అక్కడి నుంచి మా కుటుంబం అంతా బెంగుళూరుకు వచ్చాం. అక్కడ ఎం.ఎస్. రామయ్య ఇనిస్టిట్యూట్‌లో ఇంజనీరింగ్ పూర్తి చేశాను. ఇంజ నీరింగ్ చేస్తున్న సమయంలోనే రేడియో మిడ్ డేలో రేడియో హోస్ట్‌గా చేశాను. మీడియా వైపు నా మొదటి అడుగు అదే! నేను నటుడిగా మారతా నంటే మా ఇంట్లో వాళ్ళు ముందు కొద్దిగా భయ పడ్డారు. సినిమాల్లో నెగ్గుకు వచ్చే సత్తా నాకుందా? అన్నది వారి అనుమానం. సినిమాల్లో సక్సెస్ కాక పోతే నా చదువు నాకుంది. ఏదో ఒక ఉద్యోగం దొరకక పోదు అంటూ వారికి నచ్చచెప్పి ఈ రంగంలోకి వచ్చాను. ఈ రంగంలో నా సక్సెస్ చూసిన తరువాత వారి అనుమానాలన్నీ తీరి పోయాయి.

**చదువు పూర్తి చేసిన తరువాత.....**

ఈవెంట్ మేనేజరుగా ఉద్యోగంలో చేరాను. అప్పుడే ఒక థియేటర్ గ్రూపుతో పరిచయం అయింది. ఓ పక్క ఉద్యోగం చేసుకుంటూనే సరదాగా నాట కాలు వేసేవాడిని. అనుకోకుండా ఓ గొప్ప వ్యక్తి కంట్లో పడ్డాను. మిగతావారికి ఆయన గొప్ప వ్యక్తి కాదేమో కానీ, నాకు మాత్రం ఆయన గొప్ప వ్యక్తే. ఆయన వృత్తిపరంగా టీవీ జర్నలిస్టు. ఆయన కూడా నటుడే. టీవీ సీరియల్స్‌లో నటించేవాడు. కొన్ని సీరియల్స్‌కి కథ అందించడమే కాకుండా దర్శ కత్వం కూడా చేసేవారాయన. మేమిద్దరం కలుసు కున్న వేళావిశేషం...త్వరలోనే ఆయన సీరియల్‌లో నటించే అవకాశం వచ్చింది. ఇందులో నటిస్తున్న సమయంలోనే మరో సీరియల్‌లో ఛాన్స్ వచ్చింది. అలా పలు సీరియల్స్‌లో నటించాను.

**వెండితెర వైపు....**

బుల్లితెర మీద గుర్తింపు తెచ్చుకున్న తరువాత వెండితెర మీద కూడా నా సత్తా చూపించాలని అనిపించింది. శాండిల్‌వుడ్‌లో ఒకటి రెండు సిని మాలు చేశాను. వాటికి ఫ్లాప్ టాక్ రావడంతో అవ కాశాలు రాలేదు. దాంతో కోలీవుడ్‌లో ప్రయత్నిం చాను. ఇక్కడ కూడా ఒకటీ అరా వచ్చేవి కానీ నాకు పెద్దగా పేరు తెచ్చే సినిమాలు రాలేదు. దాంతో మళ్ళీ బుల్లితెరకు వచ్చాను. రాడాన్ మీడియా వర్క్ వారు నిర్మించిన సీరియల్‌లో నటిస్తున్న సమ యంలో కె.బాలచందర్‌గారి సీరియల్‌లో అవకాశం వచ్చింది. వెంట వెంటనే రెండు మూడు సీరి యల్స్‌లో అవకాశం వచ్చింది. ఇక బుల్లితెర మీదే సెటిల్ అవుదామనుకుంటున్న సమయంలో కోలీ వుడ్‌లో నేను నటించిన 'ఆంజనేయ'; 'జైజై' సిని మాలు రెండూ ఒకేసారి విడుదల కావడంతో అందరి దృష్టి నా వైపు తిరిగింది. ఆ తరువాత వెను తిరిగి చూసుకోవలసిన అవసరం రాలేదు. సిని మాల్లో విలన్‌గా చేయాలని ముందు అనుకోలేదు.



హీరోగా కాకపోయినా క్యారెక్టర్ ఆర్టిస్ట్‌గా పేరు తెచ్చుకోవాలని అనుకున్నా. కానీ నా ఒడ్డూ పొడుగూ చూసి నాకు క్యారెక్టర్ ఆర్టిస్ట్‌గా కన్నా విలన్‌గానే ఎక్కువ అవకాశాలు వచ్చాయి. నన్ను చూసి చాలా మంది 'మంచి విలన్' అంటూ బిరుదు కూడా ఇచ్చేశారు. ఇదేదో బాగుందే అనుకుని విలన్‌గానే కొనసాగుతున్నాను.

**బాధపడిన సందర్భం?**

ఈ రంగంలోకి వచ్చిన తరువాత బాధపడిన సందర్భాలు తక్కువే! ఎందుకంటే పెద్దవో, చిన్నవో ఏదో ఒక సినిమా దొరుకుతూనే ఉంది. ఖాళీగా ఉన్నాను అని బాధపడిన సందర్భం అంటూ లేదు. మొదట్లో కొద్దిగా ఇబ్బంది పడిన మాట నిజమే! భాష తెలియక కొంత, పరిచయాలు లేక కొంత అవకాశాలు తక్కువగా వచ్చేవి. పరిచయాలు పెరిగి, నేనంటే ఏమిటో తెలిసిన తరువాత ఖాళీగా ఒక్క రోజు కూడా లేను.

**శాండిల్‌వుడ్ అంటే కొద్దిగా ప్రేమ ఎక్కువే**

నటనవైపు అడుగులు వేసింది శాండిల్‌వుడ్‌లోనే కావడంతో దీని మీద నాకు కొద్దిగా ఎక్కువ ప్రేమే ఉంది. కోలీవుడ్, టాలీవుడ్ సినిమాల ద్వారానే నా పేరు సినీ అభిమానులకు పరిచయం అయింది. ఊహ వచ్చిన దగ్గర్నుంచీ బెంగుళూరులో ఉండడం వల్లనేమో కన్నడ సినీరంగం అంటే నాకు కొంచెం అభిమానం ఎక్కువ. ఏ మాత్రం తీరిక దొరికినా శాండిల్‌వుడ్‌లో సినిమాలు చేయడానికే ప్రయత్నిస్తాను. ఓ విధంగా చెప్పాలంటే నా మొదటి ప్రయారిటీ శాండిల్‌వుడ్‌కే! దక్షిణాదిలో మిగతా భాషలతో పోలిస్తే కన్నడలో అవకాశాలు తక్కువే. ఇప్పటికీ పట్టువదలని విక్రమార్కుడిలాగా ప్రయత్నిస్తూనే ఉన్నాను. ఏదో ఒక రోజు అక్కడ సక్సెస్ సాధిస్తాను.

**బాలీవుడ్‌లో సినిమాలు**

నా ఆఖరి ప్రయారిటీ బాలీవుడ్. నేను అక్కడే పుట్టినా, అవకాశాల కోసం అక్కడ ఎప్పుడూ ప్రయత్నించలేదు. వచ్చిన వాటిల్లో నచ్చినవి చేస్తున్నాను. కొన్ని సార్లు డేట్లు కుదరక వదులుకున్న సినిమాలు కూడా ఉన్నాయి. బాలీవుడ్‌లో చేస్తే దేశవ్యాప్తంగా పేరు వస్తుంది కదా అని చాలా మంది చెబుతుంటారు కానీ, కన్నతల్లి లాంటి దక్షిణాదిని వదిలి ఉత్తరాదికి వెళ్ళడం నాకు ఇష్టం లేదు. బాలీవుడ్‌లో ఇప్పటికే చాలా మంది విలన్‌లు ఉన్నారు. నేను వెళ్ళి ప్రత్యేకంగా చేయాల్సింది లేదు అన్నది నా అభిప్రాయం.

**హీరోలే విలన్‌లుగా...**

ఒకప్పుడు ప్రత్యేకించి సినిమాల్లో విలన్లు ఉండేవారు. వారి గురించే ప్రత్యేకించి పాత్రలు కూడా ఉండేవి! ఇప్పుడు ట్రెండ్ మారిపోయింది. ఒకప్పటి హీరోలు కూడా ఇప్పుడు విలన్ అవతారం ఎత్తుతున్నారు. ఇక్కడ పేర్లు చెప్పను. వారి రాకతో విలన్ క్యారెక్టర్ చేసేవారికి కొద్దిగా అవకాశాలు తగ్గాయనే అనుకుంటున్నాను. విలన్లు మాత్రం హీరోలుగా చేయలేకపోతున్నారు. ఎక్కడో ఒకరిద్దరు అలాంటి ప్రయత్నాలు చేసినా పెద్దగా సక్సెస్ కాలేదు. ఒక సారి విలన్‌గానో, క్యారెక్టర్ ఆర్టిస్టుగానో ముద్ర పడితే హీరోగా అవకాశాలు రావడం కష్టం.

**పారితోషికం**

దీని విషయంలో ఎప్పుడూ ఎవరినీ అడగలేదు. ఎంత ఇస్తే అంత తీసుకుంటున్నాను. కొందరు నటులు కొద్దిగా పేరు రాగానే పారితోషికం పెంచేస్తూ ఉంటారు. మొదటి నుంచీ నాది ఒకే పద్ధతి ఇచ్చింది తీసుకోవడం. కొందరు సినిమా విడుదలైన తరువాత కూడా పారితోషికం ఇవ్వరు. అలాంటి వారి నుంచి కచ్చితంగా వసూలు చేస్తాను.

**మరిచిపోలేని వ్యక్తులు**

ఈ రంగంలో నాకు అవకాశం ఇచ్చిన వారందరినీ ఎప్పుడూ మరచిపోను. వాళ్ళందరికన్నా ప్రకాష్ బేల్‌వాడి గారిని మాత్రం కలలో కూడా గుర్తుంచుకుంటాను. నాలో నటుడిని గుర్తించిన మొదటి వ్యక్తి ఆయన. ఆయనే తన సీరియల్‌లో అవకాశం ఇవ్వకపోతే ఈ రోజు ఇలా ఉండేవాడిని కాదేమో!

**డైలాగులు తక్కువ భావం ఎక్కువ**

కొందరు భారీ డైలాగులు చెప్పినా వారి మాటల్లో కసి కనిపించదు. కొందరిలో బాడీ ఉండదు కానీ, మాటల్లో వేడి ఉంటుంది. ఆదిత్య మీనన్‌లో బాడీతో పాటు మాటల్లో చురుక్కుమనిపించే వేడి ఉంటుంది. తక్కువ మాటలతో ఎక్కువ ఎఫెక్ట్ చూపించడం ఈ విలన్‌గారి స్పెషాలిటీ అలాంటి డైలాగుల్లో మచ్చుకు కొన్ని.

'ఎవడ్రా కొట్టింది,'

'వాడి పేరు తెలుసా?'

'మనం వచ్చిన పనేంటి? ఈ గొడవేంటి?',

చేతికి దొరికిన వాడిని వదిలేశానురా';

ఇలాంటి చిట్టిపొట్టి డైలాగులతో ప్రేక్షకుల మనసుల్లో చెరగని ముద్ర వేశాడు ఆదిత్య మీనన్.

**బాగా నచ్చిన పాత్ర....**

ఇప్పటి వరకూ నేను చేసిన పాత్రలన్నీ నాకు నచ్చి చేసినవే! అన్నిటిలోకి 'మిర్చి' సినిమాలో ప్రభాస్ బాబాయ్‌గా నటించాను. ఆ సినిమాలో చాలా మంది ఆర్టిస్టులు ఉన్నా నా పాత్రకి మంచి పేరు వచ్చింది. ఇవే కాక 'ఈగ', 'బలుపు', 'పవర్, 'లయన్', 'రుద్రమదేవి' సినిమాల్లో నాకు మంచి పాత్రలే లభించాయి. ఎప్పటికీ మంచి విలన్‌గానే ప్రజలకు గుర్తుండిపోయే పాత్రలు చేయాలని ఉంది. సరదాగా ఓ సారి హీరో పాత్ర చేస్తే ఎలా ఉంటుంది? అన్న చిలిపి ఆలోచన వస్తుంది కానీ, ప్రేక్షకులను ఎందుకు భయపెట్టడం అనుకుంటూ ఉంటాను. అసలు ఇప్పుడే కాదు ఎప్పుడూ అలాంటి సాహసం చేయనని నా అభిమానులకు మాట ఇస్తున్నాను.

—ఎం.సుమలత





# నూరుకట్ల పిశాచం కథలు ④

-వసుంధర

**ఒక గ్రామంలో మనోజవుడు అనే ఓ పేదవాడు ఉండేవాడు. పంచభక్ష్య పరమాన్నాలతో ఒక్కసారైనా భోంచేయాలని అతడి కోరిక. జాతకఫలమో ఏమోకాని, ఎంత కష్టపడినా అతడికి తగిన ప్రతిఫలం లభించేది కాదు. అందువల్ల అతడి కోరిక తీరకుండా ఉన్నది. అతడు రోజూ అన్నంలో కలుపుకునేది ఆవకాయ ఒక్కటే!**

## శాపాలు వరాలు

ఒకరోజు ఓ సన్యాసి దాహార్తుడై మనోజవుడి పూరిగుడిసె ముందు నిలబడ్డాడు. మనోజవుడు ఆయన్ను లోపలకు ఆహ్వానించి, మంచినీళ్ళు ఇచ్చాడు. సన్యాసి కాస్త కుదుటపడ్డాక, "స్వామీ, నేనెంత శ్రమించినా భోజనానికి ఆవకాయబద్దతప్ప మరింకేమీ సమకూరడంలేదు. తమరు త్రికాలజ్ఞులు. నా దరిద్రం తీరే మార్గం చెప్పండి" అన్నాడు మనోజవుడు.

అతడీ ప్రశ్న అడుగుతాడని ముందే ఊహించిన వాడిలా చిరునవ్వు నవ్విన సన్యాసి అతడి చేతికో వేరు ఇచ్చాడు. "ఇక్కడికి సమీపగ్రామంలో రత్నాకరుడు అనే ధనికుడున్నాడు. నీవు అతని ఇంటికివెళ్ళి నేనిచ్చిన ఈ వేరు నములు. నీ దరిద్రం తీరే మార్గం తెలియవచ్చు" అని చెప్పాడు.

సన్యాసి చెప్పినట్లే చేశాడు మనోజవుడు. రత్నాకరుడి ఇంటికి చేరుకున్నాడు. అక్కడ సన్యాసి ఇచ్చిన వేరు నమిలాడు. ఉన్నట్టుండి అతడికి కళ్ళు తిరిగాయి. పెద్దగా కేకపెట్టి, అక్కడే పడిపోయాడు. మళ్ళీ స్పృహ వచ్చేసరికి, అతడు మెత్తటి పరుపుల మీద ఉన్నాడు. ఒక సేవకుడు వింజామరతో వీస్తున్నాడు. అలాంటి హాయి అనుభవించడం జీవితంలో అదే మొదటిసారి అతడికి. మనోజవుడు కళ్ళు తెరిచీ తెరవగానే "ఇప్పుడు నీ ఒంట్లో ఎలా ఉన్నది?" అని అడిగాడో వ్యక్తి.

అతడి వేషభాషలు చూసి, అతడే రత్నాకరుడై ఉంటాడని ఊహించాడు మనోజవుడు. అతడికి ఇప్పుడు ఒంట్లో తేలికగా, హాయిగా ఉన్నది. అందువల్ల, రత్నాకరుడికి తన కథంతా చెప్పగలిగాడు. "ఈ ఇల్లు నీదే అనుకో! నీకు మనసు తీరేదాకా ఇక్కడే ఉండి, హాయిగా అన్నీ అనుభవించు" అన్నాడు రత్నాకరుడు.

ఆ ఇంట్లో మనోజవుడి కోరికలు చాలా తీరాయి. నిద్ర లేవగానే అవసరాలు చూడ్డానికి ఇద్దరు పనివాళ్ళు సిద్ధంగా ఉండేవారు. ఒంటి నొప్పులన్నీ పోయేలా మాలీసుచేసి, పన్నీరుస్నానం చేయించేవారు. భోజనంలో ఏ పదార్థం కోరితే అది ప్రత్యక్షమయ్యేది. మనోజవుడికి ఏ పనీ లేదు. ఎప్పుడు విశ్రమించాలనుకుంటే అప్పుడు మెత్తటిపరుపుల మీద విశ్రమించేవాడు. నిద్రాసమయంలో సేవకులు కాళ్లు పట్టేవారు. వింజామరలు వీచి హాయి కలిగించేవారు. "ఇంతకంటే స్వర్గం ఎక్కడుంది?" అనుకోసాగాడు మనోజవుడు. అలా వారం రోజులు గడిచాయి. ఒకరోజు మనోజవుడికి ఓ అనుమానం కలిగింది. రత్నాకరుడు తనను ఇలా ఎందుకు ఆదరిస్తున్నాడు? సన్యాసి ఇచ్చిన వేరులో ఏదైనా మహిమ ఉందా? లేక రత్నాకరుడు సన్యాసి శిష్యుడా?



రోజూ మనోజవుణ్ణి శ్రద్ధగా గమనిస్తున్నాడు రత్నాకరుడు. ఆ రోజు మనోజవుడు అలా ఉండడం చూసి కారణం అడిగాడు. మనోజవుడు ఏమాత్రం దాచకుండా తన సందేహం బయటపెట్టాడు. "ఈ విలాస జీవితం, భోగభాగ్యాలు అన్నీ నీకు శాశ్వతమయ్యే అవకాశముంది. అందుకు నువ్వు ఒక పని చేయాలి" అన్నాడు రత్నాకరుడు. "చెప్పండి. ఎంత కష్టమైన పని అయినా సరే, నేను తప్పక చేస్తాను" అన్నాడు మనోజవుడు ఉత్సాహంగా.

"నా ఆతిథ్యం నీకు తృప్తిని కలిగిస్తున్నదా?" అడిగాడు రత్నాకరుడు. మనోజవుడు తల ఊపాడు. "అయితే, నువ్వు నాకు తృప్తి కలిగించే విధంగా ఒక్కసారి ఆతిథ్యమివ్వాలి" అన్నాడు రత్నాకరుడు. సకల భోగభాగ్యాలూ ఉన్న రత్నాకరుడి వంటివాడికి తృప్తికరమైన ఆతిథ్యం ఇవ్వడం తనవంటివాడికి అసాధ్యం అనిపించింది మనోజవుడికి. అతడు హతాశుడయ్యాడు. "అలా నీళ్ళుగారిపోయావేం? ఈమాత్రం చేయలేని వాడివి, మరి ఈ భోగభాగ్యాలు ఆశించడం ఎందుకూ?" రత్నాకరుడు నిరసనగా అన్నాడు.

మనోజవుడికి పౌరుషం వచ్చింది, అతడు ధనికుడివద్ద సెలవు తీసుకుని, అక్కడినుంచి పట్నం బయల్దేరాడు. దారిలో మనోజవుడు ఆలోచించాడు. రత్నాకరుడు తనకు రోజూచేసే మర్యాదలకు, రోజుకో వంద వరహాలు అయుంటుంది. అంతకు రెట్టింపు ఖర్చు చేస్తేకానీ, తన మర్యాదలు అతడికి తృప్తినివ్వకపోవచ్చు. అంటే ఇప్పుడు తాను రెండువందల వరహాలు సంపాదించాలి.

అందుకని మనోజవుడు తన పద్ధతులు మార్చుకున్నాడు. ఒకప్పుడు రోజూ శక్తికిమించి కష్టపడినా, ఎవరినీ నిక్కచ్చిగా డబ్బు అడగలేక పోయే

వాడతడు. ఇప్పుడు మొహమాటం వదిలిపెట్టాడు. సహజంగా అతడిది జాలిగుండె. ఇదివరలో, తన వద్ద నాలుగుకాసులు చేరితే అవసరంలో ఉన్నవారిని ఆదుకునేవాడు. ఇప్పుడు ఇతరుల గురించి పట్టించుకోవడం పూర్తిగా మానేశాడు మనోజవుడు.

ఇంతవరకు తాను డబ్బు ఎందుకు కూడబెట్టలేకపోయాడో మనోజవుడికి ఇప్పుడు అర్థమైంది. తనలోని లోపాలు ఒక్కొక్కటిగా అతడికి తెలుస్తున్నాయి. ఇదివరలో అతడు డబ్బుకోసం రాత్రింబవళ్లు శ్రమపడేవాడు కాదు. ఆ రోజుకు సరిపడినంత లభించగానే, విశ్రాంతి తీసుకునేవాడు. అసలు అప్పుడు కూడబెట్టాలన్న ఆలోచనే అతడిలో ఉండేది కాదు. "ఎంత కూడబెడితే నేను గొప్పవాడినౌతానులే!" అన్న భావనతో ఉదాసీనంగా ఉండేవాడు మనోజవుడు.

ఇప్పుడు మనోజవుడిలో పట్టుదల హెచ్చింది. డబ్బు కూడబెట్టడమేకాదు, కూడబెట్టిన డబ్బును ఎలా పెంచాలో కూడా తెలుసుకున్నాడు. చిల్లర వ్యాపారాలు మొదలుపెట్టాడు. పట్నంలో చవగ్గా ఉండే వస్తువులు కొని పల్లెల్లోనూ, పల్లెలో చవగ్గా దొరికే వస్తువులుకొని పట్నంలోనూ అమ్మి డబ్బు పెంచుకోసాగాడు. ఇలా నాలుగునెలల్లోనే అనుకున్నదానికంటే కాస్త ఎక్కువగానే డబ్బు కూడబెట్టగలిగాడు మనోజవుడు. ఇక రత్నాకరుడికి ఆతిథ్యం ఇవ్వాలి.

అతడు ఓ రోజుకి పట్నంలో ఓ అందమైన భవనం అద్దెకు తీసుకున్నాడు. అలాగే దాసదాసీజనాన్నీ, ఇతర సరంజామాను కూడా ఒకేఒక రోజుకు ఏర్పాటుచేసుకుని, అప్పుడు రత్నాకరుడిని ఆహ్వానించడానికి అతడి దగ్గరకు వెళ్లాడు. రత్నాకరుడు మనోజవుడి వెంట ఆతిథ్యం పొందటానికి వచ్చాడు. మనోజవుడు చేసిన ఏర్పాట్లకు రత్నాకరుడు ఆశ్చర్యపోయాడు. అతడికి తాను చేసిన మర్యాదలకు రెట్టింపుఘనంగా ఉన్నాయి అన్నీ. రత్నాకరుడు ఆ ఏర్పాట్లుచూసి మనోజవుడి భుజంతట్టి మెచ్చుకుని, "ఇంత డబ్బు ఎలా సంపాదించావు? ఎక్కడైనా ఏదైనా నిధి దొరికిందాయేం, నీకు?" అనడిగాడు. "అంతా నా స్వయంకృషి" అన్నాడు మనోజవుడు.

భోజనాలవద్ద మనోజవుడు ఇంకా అద్భుతమైన ఏర్పాటు చేశాడు. ఇద్దరు అందమైన యువతులు అక్కడ ఉన్న పదార్థాలను స్వయంగా కలిపి, రత్నాకరుడికి తినిపిస్తారన్నమాట. రత్నాకరుడు భోజనానికి కూర్చున్నాడు. మనోజవుడు ఆయన్నే ఆత్రుతగా చూస్తున్నాడు. తన ఆ అతిథ్యంలో ముఖ్యమైన భాగమిదే! ఆయన దీనికి తృప్తి చెందితే, తన ఆశయం ఫలించినట్లే!

రత్నాకరుడు తనకు ఎదురుగా బల్లమీద ఉన్న భోజన పదార్థాలవంకా, తన ఆజ్ఞకోసం ఎదురు చూస్తున్న అందమైన యువతులవంకా చూసి, "ఇవేనా పదార్థాలన్నీ?" అని అసంతృప్తిగా అడిగాడు. మనోజవుడికి పై ప్రాణాలు పైనే పోయినట్లు అనిపించింది. తాను అతడి అభిరుచులకి అనుగుణంగా అన్ని పదార్థాలూ తయారు చేయించాడు మరి! "తమకు ఇంకా ఏమేంకావాలో చెప్పండి. వెంటనే తెప్పించగలను" అన్నాడు మనోజవుడు బింకంగా.



ఎంతో కష్టపడి డబ్బు కూడబెట్టాడతను. ఆపైన తన మాట నెరవేర్చుకోవడానికి సన్నాహాలు చేశాడు. మొదట ఒక భవంతిని, దాసదాసీ జనాన్ని అద్దెకు తీసుకున్నాడు. ఆ తర్వాత వెళ్ళి తన ఆతిథ్యం స్వీకరించమని ఆ ధనికుణ్ణి ఆహ్వానించాడు. ఆ ధనికుడు ఊహించని విధంగా రెట్టింపు మర్యాదలతో విందు ఏర్పాట్లు చేశాడతను. విందు సమయంలో ధనికుడు ఎలాంటి కోరికలు కోరాడు? ఇంతకీ అతడీ మర్యాదలు ఎందుకు చేస్తున్నాడు?

"రోజూ నేను తినే పదార్థాలన్నీ, నీ చేత తినిపించాను. కానీ నువ్వు రోజూ తినే పదార్థం నాకు వడ్డించలేదు" అన్నాడు రత్నాకరుడు. "తమరి ఇంట నేనెప్పుడూ ఆవకాయ చూడలేదు. తమబోటివారది తినరనుకున్నాను. కావాలంటే ఇప్పుడే తెప్పించగలను" అన్నాడు మనోజవుడు. అప్పటికప్పుడు ఆవకాయ తెప్పించి బల్లమీద ఉంచాడు.

రత్నాకరుడి అనుజ్ఞమేరకు యువతులిద్దరూ అన్నంలో ఆవకాయ కలిపారు. ఓ యువతి అతడి నోటికి ముద్దను అందించబోయింది. రత్నాకరుడు ఆగమని సైగచేసి, మనోజవుడితో, "ఈ ఆవకాయ అన్నం తింటే తప్ప, నాకు తృప్తి కలగదు. కాని, నేను తినను. ఆవకాయ తింటే నేను చచ్చిపోతానని వైద్యులు చెప్పారు!" అన్నాడు. ఆ మాటతో మనోజవుడికి నిరాశతోపాటు కోపం కూడా వచ్చింది.

"అటువంటప్పుడు ఇంత హడావుడి ఎందుకు చేశారు? ముందే ఈ విషయం చెప్పవచ్చుగా!" అన్నాడు మనోజవుడు. "అందుకు ఒక కారణం ఉంది!" అని ఒక్క క్షణం ఆగాడు రత్నాకరుడు. తర్వాత నెమ్మదిగా, "నీకు పేదరికం శాపం. ఆరోగ్యం వరం. నాకు అనారోగ్యం శాపం. డబ్బు వరం. అందువల్ల, నీకు ఇష్టమైతే మనం మనం మన శాపాల్నీ, వరాల్నీ మార్చుకోవచ్చు. ఏమంటావు?" అన్నాడు రత్నాకరుడు నెమ్మదిగా.

మనోజవుడు ఆలోచించాడు. ఈ ధనికుడి సంపద అంతా తనదైతే, అప్పుడు జీవితం ఎంత బాగుంటుంది? "నాకిష్టమే! డబ్బునైతే మార్చుకోవచ్చు. కానీ ఆరోగ్యాన్ని ఎలా మార్చుకోగలం?" అడిగాడు మనోజవుడు ఆశ్చర్యంగా.

"మార్చుకునే ఉపాయం ఉంది. నిన్ను నా దగ్గరకు పంపించిన సన్యాసి నాకు ఆ ఉపాయం చెప్పాడు. ఒక పేదవాడి మనసుకు తృప్తి కలిగించేలా ఆతిథ్యమిచ్చి, ఆ తర్వాత అతడినుంచి అదే విధంగా ఆతిథ్యం పొందుతున్నప్పుడు, అతడు కనుక ఈ మార్పుకు అంగీకరిస్తే, ఒకరి రూపాలు మరొకరికి మారిపోతాయి. నేను ఆవకాయకోసం మొహంవాచి ఉన్నాను. నువ్వు త్వరగా నీ అంగీకారం తెలియబర్చు. ఎటొచ్చీ నీకు నా రూపం వచ్చిన తర్వాత, నువ్వు ఆవకాయమాత్రమే కాదు. కారంగా ఉండే ఏ పదార్థమూ తినకూడదు. ఆ

